# విడిపోదాం!

అష్టకాల నరసింహారామ శర్మ



# ఏది పాపం ?

కవితా సుధాకర, అవధాని శిరోమణి,
బ్రాహ్మీవిభూషణ, సారస్వత శిరోమణి
అవధాన కళాపూర్ణ
**అష్టకాల నరసింహరామశర్మ** , అష్టావధాని
సిద్దిపేట,
మెదకు జిల్లా,
ఆంధ్రప్రదేశ్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయమువారి
ఆర్థిక సహకారముతో ముద్రితము

ప్రొఫెసర్ ముదిగొండ శివ ప్రసాద్
చారిత్రక నవలా చక్రవర్తి.



హిందీ సాహిత్యములో కీ.శే శ్రీభగవతీ చరణ వర్మ రచించిన "చిత్రలేఖ" నవల మిక్కిలి సుప్రసిద్ధమైనది. ఇదొక కాల్పనిక చారిత్రక నవల. కాల్పనిక శబ్దము రొమాంటిక్ అను ఆంగ్ల సాహితీభావనకు సన్నిహితార్థముగా వాడబడినది.

దీని ప్రసిద్ధికి కారణము ఇందలి కథా కథనశైలితోబాటు వస్తుప్రాధాన్యమును, పాపపుణ్యములు శాశ్వతములా? సాపేక్షములా? అయినచో పాపమనగా నేమి? శ్వేతాంకుని ప్రశ్నయిది. గురువు రత్నాంబరుడు - అనగా ఇదొక ఉపనిషత్ సంవాదము వంటిది. హిందీలో మూడు లక్షల ప్రతులపై చిలుకు అమ్ముడుబోయినదట. ఇందువలన ప్రజాదరణ నెంత చూరగొనినదో గ్రహింపవచ్చును. తెలుగులో నవలా రూపముగా అనేక అనువాదములు వచ్చినవి. కాని గేయ కావ్యముగా వచ్చుట ఒక వైచిత్రి. భావమునకు పుష్టిగూర్చుచు దీనిని నిర్వహించిన వారు శ్రీ అష్టకాల నరసింహరామ శర్మగారు.

వీరు వాగ్దేవీ ఉపాసకులు, అష్టావధాని, కవితాసుధాకర, అవధాని శిరోమణి, బ్రాహ్మీ విభూషణ అనునవి వీరి బిరుదులు. అవధానముల ద్వారా సత్కారధనముతో వాగ్దేవీకైంకర్యముగా అనంతసాగర్ కొండలపై (మెదక్ జిల్లా. సిద్దిపేట తాలుకా)ఆలయ నిర్మాణము గావించి నారు. ఇది యొక ఆశ్చర్యము. అదియొక సుందర ప్రదేశము. కాశ్మీరము, బాసరల, సరసన నిలువ దగిన సుందర ప్రకృతి. చిత్తశాంతితో బాటు మేధో విలసమునకు చక్కని తావు. ఇదంతయు శ్రీ శర్మగారి తపఃఫలము - భక్తజన కల్పవల్లియైనది.

నిజమునకు వారీగేయ కావ్యమును పాతికేండ్ల క్రితమే వ్రాసిరి. అనేక సభలలో చదివి వినిపించి రసజ్ఞుల నలరింప జేసిరి. ఈపాతికేండ్లును దీనిని బాగుగా మాగపెట్టి, పుటముపెట్టినట్లు మనకందించిరి. తెలుగులో ఇప్పటికే కొన్ని గేయకథా కావ్యములు కలవు. అవియును ప్రసిద్ధములే. వేరొక భాషలో నవలగా ప్రసిద్ధమైన దానిని తెలుగులో గేయకావ్యముగా మలుచుటలో కొన్ని

సమస్యలున్నవి. కల్పనలు కూడవు. యంథా మాత్మకముగా ఉండవలెను. వచనములోని విస్తృతిని ఛందములో బంధింపవలెను. శ్రీ నరసింహారామ శర్మగారు తమ ఉపాసన ద్వారా కొన్ని రాత్రులలోనే దీనిని సాధించినారు.

శైలిలో సారళ్యరామణీయకతలున్నవి. భాషలో మాధుర్యమున్నది. అభివ్యక్తిలో ఆర్ద్రత కలదు: కావుననే ధారాపాతముగా సాగిన వీరి కావ్యము పండిత పామరులకు ఆస్వాదయోగ్యముగా, షడ్రసోపేతముగా సిద్ధ పరచబడినది.

వృత్తములకన్న భిన్నముగాజాత్యుపజాతుల సొగసు గుబాళించునట్లు దేశిరచన సాగునం. ఔత్తరాహిక వస్తువునకు దాక్షిణాత్య ఛందము స్వర్ణమునరత్నములవలె పొదిగినారు.

ముత్యాల సరములని ప్రసిద్ధి గన్నది నిజమునకు భజగోవిందములోని ఛందమే. పేరు నొకరు మార్చినారు. అంతమాత్రమున దాని ప్రాచీనత మారునా?

నరసింహారామ శర్మ గారి శైలికి మచ్చుతునుకలు

" రత్నాంబరుడను గురూత్తమునికడ
రాజిలు శ్వేతాంకుండను శిష్యుడు
యత్నము తో తన సందేహమ్ముల
హార్దికముగ ప్రశ్నించి తీర్చుకొను"

ఇందు 1,3, పాదములలో ప్రాస, 1,2, (3,4) పాదములలో యతిగాని ప్రాసయతిగాని వాడబడినవి.

"వర్షాభంగా భంగను రంగత్
వలక్షరుచిరాపాంగను, జహ్నుమ
హర్షికృపా పాంగాంగను గంగను
హర్షోత్తుంగ తరంగను గంటిని."

"రథలగ్న లవలయానంద రతియుటు, మనో
రథ భగ్న విలయ తాండవకేళి యార్యునకు"
"అచటి వారు రూపసులు, పసులు కృషి
అబలలు సుందరు లతిబల యుక్తలు"

"సిగ్గు వొడమ దా నిగ్గు బోడులకు
మొగ్గలాంటి నునుబుగ్గల గాంచిన
మొగ్గ తొడిగె నాలోని మోహమును
మొగ్గరంబు చేసెను మదిలోనన"

ఇట్టి వెన్నెనియు గలవు , పఠితల తలలకే వదలెదను

శిష్యుడు గురువును పాపమన నేమి యని ప్రశ్నించగా సమాధానముగా కుమారగిరియను యోగివద్ద విశాల దేవుడను వానిని, బీజగుప్తుడను భోగివద్ద శ్వేతాంకుడను వానిని ఉంచివారి కర్మల ద్వార గ్రహింపుమని సూచించినాడు. ఆరంభోపసంహారవములను బట్టి ఏది పాపం? అను గ్రంథనామమువుతో పఠితలకు కథా వస్తువును సూచించినారు. కవిగారు.

నేడు పఠనాసక్తి తగ్గి ఎలక్ట్రానిక్ మీడియా దృష్టి పెరిగినది. అట్టితరి నవలలు చదువువారేతగ్గినారు. ఇక కావ్యముల సంగతి చెప్పవలయునా? కాని, రాశిని బట్టికాక వాసిని బట్టిరచనావైభవము నిర్ణయించబడును. ఒక గ్రంథము జనప్రియము కావచ్చును. కాని జన హితమైనది జనప్రియము కాదు. రెండు ధర్మములను ఒకే రచనలో నుండుట ఒక దుర్లభ కార్యము. శ్రీ శర్మ గారి సాధన భాగ్యవిశేషము.

విద్వద్వరేణ్యులునను, విద్యార్థులునను దీనిని సమానముగా సమాదరించగలరు. ఇట్టి వానిని పాఠ్య గ్రంథములుగా పెట్టినచో అందరికిని అందుబాటులో నుండును. ఆదాన ప్రదానవములలో అందరికిని అందుబాటులో నుండును. ఆదాన ప్రదానవములలోనిది ఆదానవము. భవిష్యత్తులో శ్రీ అష్టకాలవారు ప్రదానమును ప్రధానవము చేయవలెను. అష్టావధానములలోని అష్టకష్టములు వీరెరుగుదురు. రచన కూడ ఒక మధుర శ్రమ. దానిని వీరు ఓర్చినారు.తెలుగు వారికొక సానబట్టిన రత్నము లభించినది. శుభం భూయాత్

ముదిగొండ శివప్రసాద్
హైదరాబాదు

చిత్రభాను శ్రావణం

ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్
హైదరాబాదు

# అనుశంస

ఏది పాపం? ఏది పుణ్యం అనే మీమాంస చిరకాలంనుంచి సాగుతూ వస్తున్నది. ఈచిర ప్రశ్నకు శాశ్వత సమాధానం లేదు. పాపం. పుణ్యం అనే వాటికి శాస్త్రీయమైన, నిర్ద్వంద్వమైన నిర్వచనం చెప్పడం అసాధ్యం. మానవుడి మనః ప్రవృత్తి, ఆతడికి గల దృష్టికోణవైషమ్యం వలన పాపం పుణ్యంగానూ, పుణ్యం పాపంగాను కనిపించడం స్వాభావికం. "భిన్నస్థితి వఱలుట భేదించెను మీ మతములు" (పే . **246**)

ఆధునిక హిందీ సాహిత్యంలో కీ.శే. భగవతీచరణ్ వర్మ**1934**లో రచించిన చిత్రలేఖ అనే నవల మేరు శిఖరాగ్రంవంటిది. ఎన్నో పునర్ముద్రణలు పొందిన ఈనవల **2**లక్షల కంటే మించి కాపీలు అమ్ముడు పోయాయి. సాహిత్యవిలువలు కలిగిన ఒక నవలకు ఇన్ని కాపీలు అమ్ముడు పోయాయంటే, ఆనవలలో రచయిత ప్రతిపాదించిన శాశ్వత సమస్యయే మూలకారణం. ఏది పాపం? ఏదిపుణ్యం అనే సమస్యకు ఈనాటికి సమాధానం దొరకలేదు. ఇక ముందు కూడా దొరకడం అసాధ్యం. అసంభవం. చిత్రలేఖ అనేక భాషలలోకి అనువదించబడింది.

ఈ నవల కథా వస్తువు ఆధారంగా సినిమా కూడా నిర్మించారు. కవితా సుధాకర, అవధాని శిరోమణి అను బిరుదాంకితులయి, తెలుగు సంస్కృత భాషలలో సుప్రసిద్ధులయిన బ్రహ్మశ్రీ అష్టకాల నరసింహరామశర్మ గారు చిత్రలేఖను ముక్త ఛందస్సులో ఏది పాపం? అనే పేరిట అనువదించడం ముదావహం, స్వాగతార్హం.

మూలంలో కేవలం సంఖ్యాప్రధానంగా పరిచ్ఛేదాలుగా విభజించబడిన ఈ నవలానువాదాన్ని (అనువాదం అనడం కన్నా అనుసృజన

అంటే బాగుంటుంది) 23 సర్గలుగా విభజించి శ్రీ శర్మగారు ఉపక్రమణిక, ఉపసంహారము కాకుండా రంగప్రవేశము నుండి అఘమర్షణం అన్న పేర్లు పెట్టి, తమ రచనకు ఔచిత్యాన్ని సాధించారు. తమ సహజ కవితారచనా కౌశలంతో ఒక హిందీనవలను తెలుగు కావ్యరసికులకు హృదయంగమం చేసారు శ్రీ శర్మగారు.

'గురుదేవా! పాపం బెటులుండును' (పే.1) అని ప్రశ్నించిన తన శిష్యులు - శ్వేతాంకుడు, విశాలదేవులను గవేషణ చేసి గుర్తె ఱుగుటకు రత్నాంబరుడనే గురువు, "జ్ఞాని యొకడు సంసారియొకడు, సంస్కారులు వారల గూడి మెలంగుడు (పే.2) అని చెప్పి కుమారగిరి అను యోగిపుంగవుని వద్ద ,బీజగుప్తుడను విలాసవైభోగాల్లోమునిగేతేలే సామంతరాజు వద్ద ఒక సంవత్సరకాలం "జీవనమున ననుభవముగడించియు, చెలగి మీరు నిస్సందేహులుగా రావలయును అని దిగవిడచి వచ్చాడు. అక్కడనుంచి రంగప్రవేశ (మొదటి సర్గ) మవుతుంది. శ్వేతాంకుడి, విశాలదేవుడి గవేషణ ప్రారంభమై, చివరకు అఘమర్షణంతో ముగుస్తుంది కథ. బీజగుప్తుడు పుణ్యాత్ముడనీ, కుమార గిరి పుణ్యాత్ముడనీ తమ తమ అనుభవాలు ఆధారంగా ప్రతిపాదిస్తున్న శిష్యులకు రత్నాంబరుడు చేసిన వ్యాఖ్యానం - ఉపసంహారంతో కావ్య పరిసమాప్తమవుతుంది.

ప్రతి మనుష్యుడొక విశేష చిత్త
ప్రవృత్తుడై యుత్పన్నుడయ్యెడిని
ప్రతి వాడొక నటుడై యెసలారును
ప్రపంచరంగస్థలమందున నిట.

తనకు దాను విభుడౌనె మనుష్యుడు?
తాను పరిస్థితి నికర దాసుడగు
తనకు గలదె కర్తృత్వము? భువి సా
ధనమగు నతీంద్రియంబగు శక్తికి.

అందులకే ఈ ప్రపంచమందున
నెందు పాప పరిభాష లేదు గద!
ముందు గూడ గనబోము, మానవుడు
పుణ్యపాపముల జేయలేడెపుడు

చేయ వలసినది చేయునంతియే
నాఅభిప్రాయ మగునిది వినుడి. (పే **247, 248**)

ఈ విధంగా మానవుడు పరిస్థితులకు దాసుడనీ, అతీంద్రియమ్మైన శక్తి ఎలా నడిపిస్తే అలా నడిచే కీలు బొమ్మ **कठपुतली** (శ్రీ శర్మగారు సాధనం - instrument- అని అన్నారు) అని నిర్ధారించారు. కనుక పరిస్థితులు కారణంగా ఒకడు పుణ్యాత్ముడు కావడం, మరొకడు పాపాత్ముడుకావడం జరుగుతుందన్న శ్రీ భగవతీ చరణ వర్మ చేసిన నిర్ధారణను శ్రీ శర్మగారు చక్కటి శైలిలో పాఠకుల కందించారు.

శ్రీశర్మగారు రచించిన ఈ కావ్యం చిత్రలేఖ కు ముక్కస్యముక్కానువాదం కాకుండా ఛాయానువాదంవలె పాఠకులకు మౌలిక కావ్యమనే భావాన్ని కలిగిస్తుంది. చక్కగా, అక్కడక్కడా తెలుగునుడికారాలతో, ద్వితీయాక్షర ప్రాసలతో కూడి, ఆసాంతం ప్రవాహయుక్తంగా సాగిన ఈ రచనను అనుసృజన ( Recreation) అనడమే సంభావ్యంగా ఉంటుంది.

జీవిత రంగంలో శాశ్వతమ్మైన సమస్యను కథావస్తువుగా తీసుకొని, ఆసమస్యకు సముచిత విధానంలో సమాధానాన్ని ప్రతిపాదించిన ఇతి వృత్తంగా గల ఈకావ్యం తెలుగు సాహిత్యంలో ఒకమైలురాయివలె ఉండి పోగలదని ఆశిస్తున్నాను. చదువుల తల్లి సరస్వతి దేవి ఆలయ నిర్మాతలయిన శ్రీ అష్టకాల నరసింహరామశర్మ గారు అక్షర ప్రసూనాలతో శారదాంబకు చేస్తున్న పూజ, తన సువాసనలతో తెలుగు సాహిత్యాన్ని గుబాళింప చేయగలదనడంలో సందేహం లేదు.

ఇతిశమ్,
విద్వజ్జన విధేయుడు
భీమ్‌సేన్ నిర్మల్

**15-8-2002**

# భూమిక

కవికి సృజనాత్మకత ప్రాణము. కనుకనే మంచి సృష్టిని ప్రతి సృష్టిలో ఏదైనా ఒక క్రొత్తదనము తప్పక దర్శించి, దర్శింప జేసేదాక ఏ కవికీ నిదుర పట్టదు. నిదురలోనూ, నిదురలేకనూ కవి పని చేస్తూనే ఉంటాడు. తన పనిలో స్వీయ సృజనకు ఎంత విలువ ఉంటుందో ఇతర కవుల సృజనకూ అంతే విలువ ఇస్తాడు. అదే ఇతరుల రచనలోని క్రొత్తదనాన్ని తన పాఠకుల కందించాలనుకుంటాడు.

కాని అతని భావాలను అనుకరించడానికి పూర్తిగా మన సొప్పకుండును. ఒక కవి ఇతర భాషారచయితల భావాలకు స్పందించి యథాతథముగ తన పాఠకుల కందించాలని తపిస్తాడు. దానిని అనువాదము అంటారు. అదే తన భాషలోని కవుల భావాలనైతే స్వీయ పాఠకులకు చేర్చుట అనువాదమైతే, దానికి మెరుగులు దిద్ది స్వీయ భాషా సౌందర్యాన్ని జోడించి నూతన సృష్టి యనిపించు నట్లు కవి చేసే కృషిని అను సృజన అనవచ్చునని పెద్దలన్నారు. ఇందులో కవిత, భావము, శైలి, పద సౌందర్యము తనతనాన్ని అడుగడుగునా ప్రదర్శించుటకు కృషి జరుగుతుంది.

ఆ ప్రణాళిక ప్రకారము నేను(**1960**) పదవ తరగతి చదివేరోజులలో నాకుపవాచకముగా నున్న పురుషోత్తముడు నవలను పద్యకావ్యముగా మలచినాను. (**950** గద్య పద్యములు) నాడు బాల్యమున పరిపుష్టముకాని కవితా నైపుణ్యముతో సరియైన న్యాయము చేసినానో లేదో అని శంకించినను, యువ కవన శక్తి ఎంత పని చేసినదో ఆపుస్తకముపై పరిశోధన చేసిన డా॥ చెప్పెల హరినాథ శర్మ ద్వారా (**2000** లో) తెలిసినది.

ఆపిదప మహారాష్ట్ర దేశములోని పరమ భక్తుని జీవిత చరిత్రను తుకారామ స్వామి చరిత్రము అను పేర పద్యభాగముగా (**544** గద్యపద్యములు) **1963** లో రచించినప్పుడు నిండిన భక్తి పారవశ్యము పుస్తకాన్ని రమ్య సుందరముగా తీర్చిదిద్దబడినట్లు, దానికి **2001** సం॥ లో మహాకవి కీ.శే. గడియారం వేంకట శేషశాస్త్రి శతావధాని గారి సాహిత్య అవార్డు వచ్చిన నాడు అర్థమైనది.

రామాయణ కథ ప్రాతదైన క్రొత్తరీతిలో లఘు పాత్రలతో భాణ పద్ధతిలో పద్య

కావ్యముగా మలచబడిన శ్రీరామ చంద్రిక పునర్ముద్రణ భాగ్యము పొందుట కూడా ఎంతో తృప్తి కలిగించినది. మధుర పద్యములను వ్రాయగలననే నమ్మకాన్ని కలిగించినది కూడా.

ఆ క్రమములో చిత్రలేఖ అనే హిందీనవలను **(1934** లోనిది**)** అనువదించాలని కలలోకూడా అనుకొనలేదు. చిత్రలేఖ గతములో సినిమాగా వచ్చినదని గాని, తెలుగులో నవలగా అనేకులు అనువదించినారని గాని, హిందీ జగత్తులో **1977** నాటికే **2**లక్షల ప్రతులు అమ్ముడు పోయిన ఉత్తమ నవల యనిగాని, ప్రసిద్ధకవి శ్రీ భగవతీ చరణ్ వర్మగారి రచన యనిగాని, మా బావమరది గౌరీభట్ల మైత్రామ శర్మ యాదృచ్ఛికముగా ఆ నవలలోని **5**వ పరిచ్ఛేదములోని ఘట్టాన్ని వర్ణించి చెప్పినప్పుడు తప్ప తెలియదు. ఆఘట్టము నన్ను స్పందింప జేస్తుందనీ, దాన్ని ఒక సారి చదివిస్తానని తీసుకుని వెంటనే దానిని తెలుగులో పద్యకావ్యముగా రచించాలని అనుకుంటానని భావించలేదు. దానిని కనీసము **5,6**సార్లు చదివితే గాని వ్రాయలేననుకున్న నాకు ఆ యవసరము పడక ఒకసారి చదువగనే కలము కదిలినది. అది పద్య కావ్యముగా మలచుటకు నేను పడిన కృత్యాద్యవస్థ ఎట్టకేలకు పది పద్యాలు వ్రాయించినది. **(4-10-1976)**

వాటిని సహృదయుడు మా ప్రధానోపాధ్యాయులైన శ్రీ బైరి బాలకృష్ణా రెడ్డి (కొండపాక) గారికి వినిపించుట యేమి? వారు విని ఆనందించి, "పద్యకావ్యములు ఎన్నో వ్రాసినారు కదా? ఇది పద్యముగా గాకగేయముగా వ్రాసిన వైవిధ్యముగా ఉండుటయేంగాక పాఠకులకు సులభశైలిలో అందించే అవకాశము"ంటుందని సూచించుట, గత కావ్యాల ప్రబంధ ఫక్కినుండి నన్ను గేయ కథా రచనకు ఉపక్రమింప చేసినది. అప్పటివరకు ఒక్కగేయము కూడా వ్రాసిన యనుభవము లేక పోవుట, పద్యము స్వాధీనమగుట, ఒక కథా కావ్యమును ఆసాంతముగా నడుపుటకు వారి ప్రోత్సాహము అమ్మదయ ప్రేరకములైనవి.

రచనలో **1,3** పాదములలో ప్రాస **2,4** పాదములలో యతిగాని, ప్రాసయతిగాని ఉంచేనియమముతో, నవలను ప్రబంధ ఫక్కికి మార్చుటకు అత్యవసరమైన కొన్ని మార్పులు చేయుటకు పట్టిన సమయము రెండురోజులేయైనను,

మెదడును చక్రమువలె ద్రిప్పినది. విద్యుత్సౌకర్యము లేని యింట్లో చిరుదీపము వెలుగులో చిన్న అచ్చుకలిగిన మూల నవలను ముందుంచుకొని యతి ప్రాసలు మాత్రా బద్ధము చేయు క్రొత్త కవితా ప్రక్రియకు శ్రీకారము చుట్టిన గడియ యెట్టిదోగాని, వ్రాత ప్రతిలో **346** పుటల గేయ కథా కావ్యము కేవలము **22** రాత్రులలో పూర్తియగుట, ప్రతిపగలు వీలైనపుడు శ్రీబాలకృష్ణా రెడ్డి గారు పూర్తిగా విని ప్రోత్సహించుట యే కారణమనక తీరదు. కవిత ధారగా సాగుతుందని అప్పటికి అవధానాలు ఆరంభించని నేననుకోలేదు. (మొదటి అవధానము **18-12-1976**)

మూల కథా కథనములో కొన్నిమార్పులు చేసి, శీర్షికలు ఏర్పరచి కథా సూచనకు శ్రీకారము చుట్టుట జరిగనది. కథాంశము చారిత్రకము. సంశ్లిష్ట మనస్తత్వాల మధ్యజరిగిన మానసిక సంఘర్షణకు అద్దము పట్టినట్లు, వర్ణమాల కవకాశమున్నచోట కొంత ఔచిత్య భరితముగా పెంచి, అనుప్రాస, శ్లేషయమకములకు ప్రాధాన్యత కల్పిస్తూ సాగిన రచన నా సహజ కవితా ధోరణికి మెరుగులు దిద్దినది. ప్రాంతీయ వేషభూషలను తెలుగుదనముతో భూషించుట జరిగినది.

సంవాదములను మూలములో పేరాలకొద్ది ఉన్నవాటిని చిన్న ప్రశ్నోత్తర పద్ధతిలో సెమికోలన్‌లలో చూపితిని. ఒకే మాత్రా ఛందములో నడచిన విసుగని పించునను దృష్టితో, **10,12,14,16,20,** మాత్రలు గల పాదములుగా, ముత్యాల సరాల ఫక్కిలోను నడిపి ఔచిత్యమును పోషించితిని. తెలుగున కలంకారమైన యతిప్రాసలు బంధములైనను నవల లోని వాక్యములను కుదించుటతోను, విస్తరించుటతోను సులువుగా మలచుకొనుట జరిగినది.

**बीजगुम अपने शयन गृह में चला गया। चित्रलेखा और कुमार गिरि के बारे में सोचन लगा। आधी रात तक निद्रा नही पाया।**

ఈ సన్నివేశమున చిత్రలేఖ కుమారగిరి పరస్పరాకర్షితులై ఏకదేశచింతనీయులే కనుక ఆకర్షణ కల యశోధర తన వెంట బడుటను ప్రధానముగా బాధాజనకముగా మలిచితిని

తలబరువయ్యె జలించె మానసము
తలగడపై దల, తలలో నెలతల
తలపులవల వలపల దాపలగా
వలవల నీరొలుకును గను గొలకుల

అని చెప్పి

ఎంతచేసె నాయింతి? యింతకును
స్వంతబుద్ధియా? యోగి చెంత కా
కాంత యె ట్లయస్కాంతమ్మయ్యెను
కొంతకాలమేనా? సాంతమ్మా?

ఇక్కడ ఆకర్షించుటకు అయస్కాంత శబ్దమును ప్రయోగించితిని. చిత్రలేఖ యశోధరల సౌందర్యమును మూలమున కన్న పెంచుట ఉచితముగా తోచినది.

**चित्रलेखा के सिर का वस्त्र खिसक गया था और उसके सिर के बाल अंधकार के भाँति काले थे। उन बालों से गुँथी हुई मोतियों की माला प्रकाश की भाँति चमक रही थी। कितना सुंदर था उसका वेश।**

ఈమాత్రము వర్ణనతో తృప్తి పడని నామనస్సు కొంచెము పెంచినది చూడుడు.

తటినీ నిభ చేలాంచల
మటు వీడెను తలను వీడి.

చీకటి కూకటి తోచును
జెలగి కేశపాశమ్ముల
జోకను ముత్యాల సరులు
సొంపు నింపు చుక్కలగతి.

అంజనరేఖా భ్రమరము
లందగించు ముఖకమలము
సంజచాయ పెదవుల లా
స్య మ్మొనర్చి మనసు దోచు.

చెక్కిళు లద్దములై తన
ముక్కు కన్ను తీరు తెలుపు
జక్కదనము చిక్కనగుచు
జొక్కమ్మును వెక్కిరించు.

అధరోష్ఠము బలిమి తోడ
మధు బిందువు నిలుప జూచు
మధుర హాస దర్పణమున
మారు తూపుగా మారును.

యశోధరను వర్ణిస్తూ మూలమున

यशोधरा सुन्दरी थी, और सुन्दरी भी उच्चकोटि की। उसके शान्त मुख - मण्डल पर भोलापन अपना अधिपत्य जमाये हुए थे। उसकी हँसी की सुरीली झंकार में यौवन से पराजित बचपन ने शरण ली थी। हरिणी की सी बडी बडी सुन्दर आंखों में संकोच था और उसके रस युक्त अरुण कपोलों में लज्जा थी। यशोघरा का यौवन सुधा और उल्लास का मिश्रण था, उसमें गर्व की उच्छृंखलता न थी उसमें लज्जा की शन्ति थी।

అష్టాదశసద్వసంత పోషిణి
హార్దికతా పరిపూర్ణ వచస్విని
కష్టనికృష్టాశ్రిత సుమనస్విని
కరుణా పూర్ణ విలోక తపస్విని.

అగాధ సంపద కఖిలాధీశ్వరి
అమలిన శృంగారాబ్ధితలోదరి
ప్రగాఢ జనక ప్రేమామృతఝరి
పరిఢవిల్లు ముక్తా ఫలసుందరి.

ఆర్య శ్రేష్ఠానంద విహారిణి
ఆకర్షిత పురయువక గ్రామణి
హర్యక్ష ప్రతిమాన గభీరిణి
అమాయికాత్మాభరణ శ్రీమణి.

చంచల దృగ్విజితాఖిలహారిణీ
సంకోచాకుంచిత కపోలినీ
చంచల చంచత్తనూవిలాసిని
సరసమధురమృదు తరళ సుహాసిని.

కనకశలాక లతాలలితాకృతి
కాయోత్థిత లావణ్య భరప్లుతి
జనక హృదయ సకలాశా విస్తృతి
సత్కవి సన్నుత స్రష్టృ మహత్కృతి.

ఈ విధమున తెలుగు భాషాసౌందర్య ముట్టిపడునట్లు అంత్య ప్రాసలను జోడించితిని.

మొదటి పరిచ్ఛేదమున చిత్రలేఖ గత చరిత్ర చెప్పుటకు - బీజగుప్తునిలో తన పతిరూపుతోచినట్లు దానితో ఆమె గత చరిత్రస్మృతికి దెచ్చుకొనినట్లు మార్చి చెప్పవలసివచ్చినది.

బీజగుప్తుని తో చిత్రలేఖ గడిపిన రోజులను వర్ణిస్తూ

పెదవి పెదవి తాకిన తమకమ్మున
పదవి పెరిగి నటులై ముద మెచ్చెను
కొదమకోరికలు యౌవనవతులై
కొదమసింగములుగా లంఘించెను.

మదిరాసవ ఘుటికల సమస్తనిశి
మాత్రము విఘటికలై పచరించెను
మృదుల తనూ స్పర్శనమున నిద్దఱి
హృదయము లద్దరి యిద్దరి దెలియవు.

కాశీ ప్రయాణ ఘట్టములో బీజగుప్తుని మన స్థితిని ప్రకృతితో బోల్చి శ్లేషలోను, విరోధాభాసములోను ఆలంకారికముగా చెప్పుట జరిగినది.

రాత్రిసగమ్మై పోయెబ్రతి వారికిని నాడు
రాత్రి సగమయ్యె నార్యుని వేదనను జూచి

తోచె సమయాతిక్రమణ భార మందఱకు
దోచె సమయాతిక్రమణ భార మాతనిని.

నిద్రాసమున్మీలితాక్షులై రందరు.స
ముద్రకల్లోల కల్లోల మానసు డతడు.

కలవరముతో నిట్లు బీజగుప్తుండుండ
కలరవము చెలగె బ్రాతఃకాలమని తెల్ప.

ప్రకృతి ధర్మవిరుద్ధ పథి బీజ గుప్తుండు
వికృతు డౌటకు నెఱ్ఱబడె పూర్వదిక్తలము.
బీజ గుప్తుని పరిస్థితి చూచి తారకలు
రాజువెంబడి బిక్కమొగములను మరుగయ్యె

ఈ విధముగా చెప్పుట జరిగినది. కుమారగిరిని చిత్రలేఖ దూషించే ఘట్టమును విస్తరించుట ఉచిత మనిపించి

సంసారము చేయవెరచి
సన్యాసిగ మారితివా?
సంసారమునందురోసి
సన్యాసిగ మారితివా?

ఇట్లు చెప్పిన దానికన్న కావ్యము నచ్చువేసి, పాఠకుల చేతిలో వేసిన న్యాయువు చేసినట్లగును. అంతయు నేనే జెప్పిన చదువుటకు పాఠకుల కేమి మిగులును?

వ్రాత 22రాత్రులలో పూర్తియైనను ముద్రణకు 24సం.లు పట్టుటకు కారణమునేనెవ్వరినీ దాతలుగా గోరకుండుట. 22 సం.లు సరస్వతీ దేవికి ఆలయ నిర్మాణమున నిమగ్నమై యుండుట

ఊరిన భావసంపదల నొప్పుగనే రచియింతుగాని, త
ద్భారము నిర్వహింప సముదార చరిత్రుల జేరి ముద్రణో
ద్ధారము చేయ గోరను, వృథా యొనరించునొ? సార్థకంబుగా
గోరునో? మాత చిత్తమని గొప్పగ నమ్మితి వాసరేశ్వరీ!

కానీ ఈ యేడు తెలుగు విశ్వవిద్యాలయము గ్రంథముద్రణ కార్థిక సహాయము చేయుటకు ప్రకటించిన దాదిగా ముద్రణకు యథా శక్తి కృషి చేయుట మొదలైనది.

నాకోరిక మన్నించి, తమ అమూల్యాభిప్రాయాన్ని శ్రమ కోర్చియిచ్చిన పెద్దలు ఆచార్య శ్రీ ముదిగొండ శివ ప్రసాద్ గారికి, ఆచార్య భీమ్‌సేన్ నిర్మల్ గారికి సర్వదా కృతజ్ఞుడను.

ముద్రణలో ఆత్మీయత రంగరించి, శ్రమను సునాయాసముగా సహృదయముగా స్వీకరించిన కోదండ ప్రింటర్స్ అధినేత శ్రీ భీంరావు రాధాకిషన్ రావు హైదరాబాద్ వారికి కృతజ్ఞతలు.

పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయ మందించిన పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయము హైదరాబాద్ వారికి హార్దిక ధన్యవాదములు.

ఈ గ్రంథమును తమ పత్రిక దశమ వార్షికోత్సవాలలో ఆవిష్కరింపజేయ దలచిన ప్రసన్నభారతి త్రైమాసిక పత్రికా వ్యవస్థాపక సంపాదకులు శ్రీ కొండేపూడి సుబ్బారావు (విశాఖ) గారికి సాహిత్యనమస్సుమనస్సులు.

సమయమిచ్చి చదివి యానందించు రసజ్ఞ పాఠకోత్తములకు మనోభినందనలు.

రచయిత
చిత్రభాను విజయదశమి

శ్రీ విద్యాయైనమః

<u>ఉపక్రమణిక</u>

రత్నాంబరుడను గురూత్తమునికడ
రాజిలు శ్వేతాంకుండను శిష్యుడు
యత్నముతో దన సందేహమ్ముల
హార్దికముగ బ్రశ్నించి తీర్చుకొను.

పురకోలాహలములను బాటలీ
పుత్రనగర మొప్పుట గని యొజ్జయు
గిరి శిఖరమ్ముల బోలు భవనముల
ద్రేవ నొక్కపరి చూచి శిష్యుగని.

పృచ్ఛ చేసె "శ్వేతాంకా! నీ మది
ప్రేమ జేయు నీ సేవలు మెచ్చితి
స్వచ్ఛమనముతో నిల్చియుంటి నీ
శంక దీర్చుటకు సత్వర మడుగుమ".

గురు కటాక్షమున దృష్టి చెంది, సం
బరమున నడిగెను శ్వేతాంకుండిటు
"గురుదేవా పాపంబెటులుండును
ద్వరగ దెల్పి నా శంక దీర్చు" మని

"ఎంత గూఢమగు ప్రశ్న చేసితివి
ఇంత కాలమే నాలోచించితి
సుంతయేని యెఱుగంగ నోచ నిక
స్వాంత మొప్ప దెటు చర్చ సేయుదును

కాని నాయనా! కర్త మిప్పు సం
ఘాన గవేషణ సేయగా వలెన్.
పూని నీవు సిద్ధంబుగ నుండిన
పుణ్యాపాపముల గుర్తెఱుంగుదువు

విశాల దేవుని హృదయము గూడా
వేచియుండు నీ ప్రశ్నము సేయగ
విశాలదేవా! నిజమేనా?" యన
"విజ్ఞులుదెలియని విషయ ముండునా?"

అని విశాలదేవుడు బదులీయగ
మనమున ముదమున రత్నాంబరుడును
"వినుడి మీరు పాపము నెఱుగంగను
వెడల వలయు బటుదీక్ష సంఘమున

నేనెఱుంగు మహనీయు లిద్దఱున్
బూని మీకు సాయంబగుచుందురు.
జ్ఞాని యొకడు సంసారి యొకడు, సం
స్కారులు వారల గూడి మెలంగుడు

కుమారగిరి యోగీంద్రుడు విప్రుడు
కోమలిబాయడు బీజగుప్తుడును
సమానులిద్దఱు వారి కర్మలను
జతురులు మీరలు వారి సహచరులు

విశాలదేవుడు కుమారగిరితో
వెడలవలయు ననుగామిగ సతతము
ప్రశాంత జీవన పథమున లక్ష్యము
పడయగ ననయము గృషిసేయగవలె.

బీజగుప్తు నెడ శ్వేతాంకుడు దగు
విధము సేవకుడుగా వెలుంగ వలె.
రాజభోగముల రమ్యత గనుగొని
ప్రబలు నాత డాతని గొలువన్వలె.

జీవనమున ననుభవము గడించియు
చెలగి మీరు నిస్సందేహులుగా
రావలయును, నేనంత వరకు దు
ర్గమ తపంబులో వెళ్ల బుచ్చెదను.

కాని మీ రొకటి మనమున నుంచుడు
గమ్యము చేరుట లక్ష్యమె కానీ
పూని యందె నిర్మగ్నులు కాగా
పోవు సదాశయ మెల్ల భగ్నమై.

మీరు జేరు వారల చరిత్రనులు
మేలు తెలిసియుండుట మీకెప్పుడు.
మారు మొగంబులు పెట్టకుండ నా
మాట వినుడు - కడపట చింతింతురు.

కుమారగిరి యోగీంద్రుడు సతతము
సమస్త వాసన లధిగమించితని
ప్రమాద పడకను భావించెడు నీ
ప్రపంచ మనగ విరక్తుండయ్యెను.

యువకుడయ్యు సంసార సుఖమ్ముల
యోగ్యుడయ్యు నిరసించెను వాటిని
భవికి దూరమై పరమాత్ముని గన
బరిశ్రమం బొనరించుచు నుండును.

శారీరకబల మాత్మబలమ్మును
సంపాదించిన మహనీయుండన
దూరీకృత మమకారుండని ప్ర
స్తుతి కెక్కిన వాడా కుమారగిరి.

విశాల విశ్వం బాతని సాధన
వేల్పునగరి గమ్యం బాతనికిని,
విశాలదేవా! నీ గురుడాతడు
విశ్వసించునటు సేవ జేయుమా!

బీజగుప్తుడొక భోగి, మత్తుడగు
వీక్షణమున సుఖ నాట్యము చెలగును
రాజరత్నఘటి తాసవ పాత్రను
రాజిలు సర్వ సుఖమ్ములాతనికి

విభవయుక్తు డుర్వీంశుండాతడు
విమల సుందరాకారుండాతం
డిభపంకము ద్వారమున వసించగ
నిభగమనలు నర్తనము వెలార్తురు.

దైవ విషయిక ధ్యాన మాతనికి
పాపముండునే నాడు రహించదు
ఇవి నరకమ్ముల చింతలేదు మో
హించుట తప్పు యెఱుంగందన్యము.

శ్వేతాంకా! నీవాతని వద్దకు
సేవకుడవుగా బోవ సమ్మతమె?
చేత మెప్పనిది చేయుమటంచను
చిత్త వృత్తి నా యది గాదెఱుగుడి.”

శిరోధార్యమని చెప్పి గమించిరి
శిష్యులు రత్నాంబరుని కుటీరము
గురుండడవికై కోరి యేగె సం
బరమున శిష్యులు పురమున కరిగిరి.

## 1. రంగ ప్రవేశము

పాటలీపుత్ర నగరము నందున
పరిఢవిల్లు నొక సుందర నర్తకి
పాటలాధరయు బద్మనిభేక్షణ
పరిమళగంధి సుధాంశునిభానన.

విద్యుల్లతా నిభాంగి మనోహర
విద్వద్వందిత నృత్య కళావిద
హృద్యరసజ్ఞ వచన చణచాతుర
హేలామంజుల ముగ్ధతనూధర.

పాదావనత ప్రసిద్ధ పార్థివ
నాదోపాసక నటనాభాసుర
మోదిత సకల జనామోదిత సం
పాదిత విభవాంచిత మధురోదిత.

రోదితతుల్య సతీసముపేత, మ
హోదయ సంతత సేవిత మందిర
వాదిత సకల కళా వాద్యాంచిత
వర్ణ చిత్రలేఖా సముదీరిత

చిత్రలేఖ నా నెగడు నా నెలత
చెలగె నతుల శృంగార మూర్తిగా
ధాత్రిజనుల కుల్లాసము గూర్చెడు
దనపదయుగ మంజీర ధ్వనితో.

ఎల్ల జనుల కుల్లాసదాయిని గ
నుల్లము లెల్లను బల్ల వించగా
దల్లీనత నాట్యమ్ము సల్పుచును
దనియించును రసికావతంసులను.

మాత్రకాల మాగరితను గాంచిన
మాత్ర నెంత వాడైనను మరలడు
క్షత్రియులెందఱొ లక్షాధీశులు
సాగి మ్రొక్కెదరు తత్కటాక్షమున.

వేశ్యకాదు, మఱి ముగ్ధమోహనా
వేశ కాదు, రమణీయ విగ్రహము
వశ్య జేసికొన పడిగాపులు పడు
వసుధేశులకై లాస్య మొనర్చును.

బీజగుప్తు డొకనాడు నాట్యమున
వేడ్కవచ్చి కూర్చొనియె జనమ్మున
రాజులందఱను వీడుచు నటి నీ
రాజన మొసగెను బీజగుప్తునకు.

ఏదో తన స్మృతి పథమున జెలగెను
ఎవరిచేత తన వ్రతము భగ్నమై
పోదాలగెన్ దన నియమ నిష్ఠలును
భువి నాతండని నెమ్మది దలచెను.

బాల విధవయై బ్రాహ్మణ సతియై
బాల్యమ్మునసే విధి బానిసయై
చాలనిష్ఠ నుండగ దరి జేరిచి
లీల మానసము దోచిన మారుడు.

ఎంతకాల మిన చంద్రులుందురో
అంతకాల మవనిం జీవించిన
యంతకాల మిరువురి విడదీయుగ
నగునె యేరి కని పలికిన కంతుడు.

పితరులు దూరిన వెన్క దూరమున
వేశ్మ మేర్పరిచి వెలిగిన యాతడు
సతి దౌహృదమును గాంచి ముదంబున
చంక లెగుర వేసిన మహనీయుడు.

ఎవని రూప మట పుత్ర రూపమున
నవతరించి కనుమరుగై పోయెనో
ఎవని సుందరాకారము మదిలో
నెల్లనిలుచు మోహను డాతండటు.

లోకనింద కోర్వగ గాతరుడై
వ్యాకులమున విషభక్షణ సేసియు
లోకము బాసిన కృష్ణాదిత్యుం
డేకాకిగ దను జేసిన యాతడు.

వేడ్కవచ్చి తన ముందట నిలిచెనో
వెలది పరిస్థితి గాంచ వచ్చెనో
చూడ్కి కాతనిగ దోచె నాయమకు
సుందరుడగు నా బీజగుప్తుడును

జన సముదాయము సంగతి మరచెను
చంచల దృక్కనిమేషత నొందెను
కనులు కలిసె మనసులు పెనవేసెను
కదులని చిత్రం బయ్యె దలోదరి.

తనువును మరచెను దన పని మరచెను
దనకై వచ్చిన జనులను మరచెను
దనధృతి మరచెను దత్పరయయ్యెను
దన పతిగా మనమందు దలంచెను

బీజగుప్తుని దె యదృష్టంబని
నోజ గుజగుజలు పోయిరి రసికులు
బీజగుప్తుడను మాట వినంబడి
వెలవెలబోయెను చిత్రలేఖయును.

కరిగిపోయె గలలన్నియు వడిగా
గనుల మైక మెల్లను నశియించెను
పొరపడి తను సవరించుక నర్తకి
పూనె లాస్య మొనరించ యథావిధి.

భ్రమ యెంతటిలో పాపమొనర్చెను
భర్తయగా భ్రమియింపగజేసెను
క్రమశిక్షణ నిష్ఠల నట్టేటను
గ్రాల జేసెడును క్షణకాలమ్మున.

నర్తన పిదప జనాభ్యంతరమున
నర్తకి కడకేగెను సామంతుడు
స్మర్తవ్యమునీ సరస నాట్యమని
సన్నుతి జేసెను మన్నన తోడను.

"నానికేతనము నందు నాట్యమును
నా తృప్తికినై యాచరింతువే"
నా నర్తకి "జనతతికి ప్రదర్శన
నా లక్ష్యమ్మొంటరికి గా"దనెను.

"ఒక్కనితో నింకొక్కడుగూడిన
యువిద! సంఘమ్మై యొప్పును గాదే?
ఒక్కని మోహము సంఘపు మోహ
మ్మొక్క తీరునే యుండును గాదా?

భేద మెంచు టది యేల నా నటీ
విధుబింబాస్య సమాజములోపల
ఖేదము గలుగునె కేవల మతివకు
కీడు గలుగు నొక్కని సహచారత.

అనగా దనకై తలుపు మూయబడె
నని తలపోసెను బీజ గుప్తుడును
తను నిలువగ నట చోటుగా దనుచు
ధనుర్ముక్త బాణము గతి బోయెను.

దినములు గడచెను నెలలును గడచెను
దినదినమును నుత్సాహ మ్ముడిగెను
జనతతిలోపల బీజగుప్తుడును
కనుపించక నర్తకి మది గలగెను.

కనులు దీపములుగా విలసిల్లగ
గన్నయ్యను గను రాధిక పోలిక
మనసు మందరమ్మై విరహాంబుధి
మునిగిపోవుటను విహ్వల మతియై.

చిత్రలేఖ సామంతుని పాలికి
జేరనంపె జెలితో నొక లేఖను
నాత్రమ్ముగ దనయంగీకారము
మాత్రము వ్రాయుచు సంతస మందుచు.

లేఖను జదివిన బీజగుప్తుడును
లేచి నిలువబడి వణకె నొకట ను
ల్లేఖించెను నర్తకి సుగుణమ్ముల
లేమి దొలగి సిరిగలుగు చందమున.

ఇరువదియైదు వసంతము లిప్పుడు
పరుగున వచ్చిన వరుస రహించెను
తరుణి సుఖమ్మున స్వర్గము దరియగు
కరణితోచె సకలమ్మును మరచెను.

పెదవి పెదవి తాకిన తమకమ్మున
పదవి పెరిగి నటులై ముద మెచ్చెను
కొదమకోరికలు యౌవనవతులై
కొదమసింగములుగా లంఘించెను.

మదిరాసవ ఘుటికల సమస్తనిశి
మాత్రము విఘటికలై పచరించెను
మృదుల తనూ స్పర్శనమున నిద్దఱి
హృదయము లద్దరి యిద్దరి దెలియవు.

వేశ్యకాని రమణీయ మోహనా
వేశయైన నర్తకి సంగమ్మున
వశ్యమయ్యె సకలోర్వి యాతనికి
స్వప్న లోకమే మిగిలె నాతనికి.

కౌగిలింత దనువింత లింతలై
సాగి పోయె జౌశితి బంధముల
మూగవోయె, నోరడిగె మనమ్ముల
భాగిని భోగము యోగమయ్యెనా!

అతులమ్మైన సౌఖ్యానందమ్ముల
మతులు వెఱ్ఱులై మరి మరి దిరుగగ
రతులలోన నుపరతులలోన ధృతి
పతితమ్మైన హృది బాధల నెందెడు.

బీజగుప్తుడొకనాడు నర్తకిని
పృచ్ఛసేసె "జీవన సుఖ మేదని?"
రాజానన, రాజా! నను నడిగిన
రతి మదవతితో మత్తుతోడి" దనె.

నిసిరాతిరి సకలమ్ము నిద్ర గొనె
నిస్తులతన్ దీపములు పే గనుల
రసికుల మదిరా రసమత్తుల కను
భ్రామి వారి రతి గాంచుచు నుండగ.

కేలీభవనము బాహిర జగతిని
గేలిసేయగా దొడగె ముదమ్మున
లీలావతి యందించిన మదిరా
లోలత పలికెను బీజగుప్తుడును.

"యోచించెద నో చిత్రలేఖ! ఆ
లోచన కందదు యౌవనాంతమే
లా చింతించగ నాగ నర్తకియు
లాలిత్యము గోల్పోయె ముఖమ్మున.

మందహాస ముద్యద్గంభీరత
మధ్యనలిగె గత భావి జీవితము
లం దనుభవముల భయానక స్థితి
యందు మునక లెత్తెను మానసగతి.

మరల మరల ప్రశ్నించు ప్రియున కు
న్మాదవృత్తితో మదవతి పలికెను
'తురగలించు యౌవనాంత జీవ
న్మరణ పరిస్థితి' నా నాతండను.

'కాదు, కాదది యసంభవమ్ము సుమి
కావలయును జీకటి కాబోలును
లేదు భవిత, గతమేడ కల్పనా
పాదితమిది కల దతుల సుఖోదధి.

వర్తమానమిది కనుల ముందఱిది
వర్తిలునది యుల్లాసవిలాసత
నర్తకి! నీవే నామాదకతవు'
నా నీవే నాయున్మాదంబనె.

మాదకతోన్మాదంబుల కలయిక
మందహాసముల మధ్యన నలిగెను
ఈ దోషా యెంతటి పుణ్యాకర
ఎంత సుఖుల మంచెంచిరి వారలు.

కౌగిలింతలో కరగి పోవునెడ
కాయములొకటై కలియబడెడు నెడ
మ్రోగె ఘంటికా నాద మ్మతిధుల
యాగమనమ్మును సూచించుచు ధృతి.

అర్ధరాత్రి యాగంతుకు లెవరో
యంచు కౌగిలిని బెడబాయుచు విధి
నర్థి దూఱుచును నాజ్ఞ నొసంగిరి
నంతట లోనికి రా వా రతి థుల

శ్వేతాంకునితో రత్నాంబరుడును
చేరె లోని కళివాదము గొనుచును
స్ఫీతలజ్జయై చిత్ర లేఖ యు
ర్వీతలమ్ముపై గోటగీత లిడె.

మ్రోలనిలుచు సామంతుని గనుగొని
ముగ్ధమోహనాకారము దెసగని
కేలిగృహము నలుదిక్కులు దృష్టిని
గీలించిన రత్నాంబరు డనియెను.

'చిత్ర మయ్యో లోకోత్తర సుందరి
సిత చరిత్ర నర్తకి యీ రాతిరి
చిత్రలేఖ సామంతుని భవనము
చేరె, నంచు నాసీనుండయ్యెను.

"మహాప్రభూ! మీ కరుణకు కారణ
మహో! కష్టపడి రయ్యు మహాత్ములు
మహానిశిని శ్రమ మముగన వచ్చిన
మహా కార్యమేమిటో సెలవీయుమ."

అనుచు బీజగుప్తుడు ప్రార్థించిన
అనియె నాతనికి రత్నాంబరుడును
"వినుము చెప్పెదను సకలము నీకును
విశదము గావలె వీడొక శిష్యుడు.

పాప మేదనుచు ప్రశ్న యొనర్చెను
బదులు చెప్ప నే శక్తుడ గామిని
పాపాభిజ్ఞత యందు సాయపడ
పనివడి నీకడ కరుగుదెంచితిని.

భోగ విలాస వికాస జగమ్మున
పుణ్యా పాపముల పొడగనిపించెడు
రాగద్వేష చరాచర జగతిని
రాగిల్లును పాపాభిజ్ఞతయును.

ఈతం డవివేకుడు, కుడువడు సుఖ
మాతత గతి దోషములు సహించుమ
భూతలమున తొలిసారిగ నడుగిడు
పూత చరిత్రుం డీ శ్వేతాంకుడు.

గురుదక్షిణ నే గోరితి వినుమా
గురు గౌరవమున వీనిని గనుమా
పరగ నీకు సేవకునిగ గొనుమా
దురిత వివేకము గలుగ జేయుమా"

నా విని యొప్పిన రత్నాంబరుడును
"నాయన! ఓ శ్వేతాంకా! వినుమా!
సేవకుడవు నీ వీతని కియ్యెడ
సేవించుమ యీతని భోగమ్ముల.

మంచి చెడ్డ నీ ముందు గనంబడు
నంచితముగ బరిశీలించగ వలె
మంచి నీకె కా దితరుల కగుచో
మంచిది, మంచిది పోయి వచ్చెదను."

అని పోయిన రత్నాంబరు శిష్యుని
కనుగొని సామంతుడు మాటాడెను
"విను మోయీ నా భృత్యుడవైతివి
వెలది యీమె యెవ్వరొ యెఱుంగుదువె?"

అన శ్వేతాంకుం డామెను గనుగొని
యచ్చెరువున గనులంతయు జెదఱగ
ననియె "నే నెఱుగ "నంచు నప్పుడా
తనికి ననియె రాజామెను జూపుచు.

"చిత్రలేఖ నా నెగడు సుందరీ
శేఖరమ్ము, మరుతూపు, పాటలీ
పుత్ర పవిత్ర చరిత్ర నర్తకీ
పురంధ్రీ మణియ నా సతి సన్నిభ.

ఇచ్చట స్వామిని నీ కగు నీయమ
నిచటి పరిస్థితి గని వెఱగందకు
మచ్చటి మధువందించుమ యామెకు
నిచ్చలు ననుభవమును గడియించుము."

పాత్ర సేవకుని చేతి కీయగా
నాత్రమ్మున నందించె నాతడును
చిత్రలేఖ పాత్రము చేనందుచు
చిన్న స్పర్శ కలిగించె శిష్యునకు.

కంపించెను తను వతనికి నంతట
కాంత పలికె శ్వేతాంకుని గనుగొని
"చాంపేయామల దేహ సుందరా!
సరగున దెల్పెద ధన్యవాదములు."

శయన సమయ మను ఘంటిక మ్రోగెను
నయన చకోరము లొత్తిగిల్లుటను
శయనించగ దన సదనమునకు జను
జవ్వనితోడై చనుమనె శిష్యుని.

" తేరా వల గలదందు సుందరిని
ధీరత దోకొని పొమ్మని పలుకుచు
నీరాకకు ముందిచట భవత్ప్రుల
నిర్ణయమా " నని యనిపె నాతనిని.

## ౨. విచికిత్స

కుమారగిరి యోగీంద్రుండంచును
గుర్తింపంబడె జగంబునందున
సమస్త సాంసారిక సుఖ సంపద
భ్రమాస్పదమ్మని భావన చేసెను.

నియమ నిష్ఠ లాతని నిశ్చయములు
నిర్జన దేశం బతనికి ప్రియమగు
జయమును గాంతును జగతి సుఖమ్ముల
సరగ నంచు సాధన మొనరించును.

అతీత శక్తుల సంపాదనలో
నాత్మబలము నభివృద్ధి పరచుకొను
నితాంత విశ్వాసమ్మును జూపును
నిస్తుల సాధన సేయుచునుండును.

శక్తులు గలవను మాటయె కానీ
రక్తి చూపడవి ప్రయోగించగా
శక్తి సాధనకు నేకాంతమ్మును
రక్తి గోరు తపియించు సతమ్మును.

శరీర తాపము తపః క్రియ గదా
సంపాదించును సుఖానుభూతుల
నిరాలంబుడుగ నిస్తబ్ధుడుగా
నిలిచె వాసనల నిర్మూలించగ.

కల్పన సుఖమని, కాదు నిత్యమని
కామి వాసనల గాలి చిక్కనని
స్వల్ప సుఖమ్ముల కాసజెంది శా
శ్వత సుఖమ్ము నెడబాయగూడదని.

మోహ పాశముల ద్రెంచు కొనిన ని
ర్మూలించగబడు దుఃఖ సంఘమని
దాహము తృప్తికి వెదకు నెప్పుడును
తన్మయత్వమున భువి మరిపించును.

భౌతిక వస్త్వను బంధిత సౌఖ్యము
పాతక కలితము పాప సంకులము
కాతర బుద్ధికి గామ్యము గావున
పూత చరిత్రులు యోగులె యనుకొని

యోగియయ్యె నా యువక గ్రామణి
భోగ భాగ్యముల దిరస్కరించెను
రాగ ద్వేషములను జయించ ని
ర్మల సాధన మొనరించు చుండె నిల

మధుపాలుం డాతని శిష్యుండయి
మాటికి నాతని ననుచరించుచును
పృథు విస్మయమును జెందు శక్తి గని
పృచ్ఛ సేయు ననుమానము దీఱగ.

"దేవా! సంయమ లక్ష్యంబేమిటి?"
నావిని 'శాంతియు దద్భవ తృప్తియు'
"దేవా! ప్రపంచ వాస్తవ గతి యిం
తేనా? యన బరివర్తన శీలత?

బాహిరమ్మై శూన్యం బంతస్సున
దేహమున్కలిడు దీర్ఘ చింతలో
మోహ బంధముల వాయుటు నాపై
ముముక్షు వగుటయె జ్ఞాని లక్ష్యమొ.

జ్ఞానం బంతిమ సోపానంబగు
సంసారము పరివర్తన శీలము
దాని లీలయే శూన్యత మూలము
గాన తెలియు" మనె కుమారగిరియును.

అంతే వాసికి దృష్టి కలుగలే
దంతేగా దానందము కలుగక
చింతతోడ బ్రశ్నించె గురూత్తము
'నింత కన్పడున దెట్లు శూన్య' మని

గురుడు వల్కె నందులకె యోగ మని
'గుఱుతు తెలియగా గనులు మూయు'మని
'పరివర్తన శీల ప్రపంచ మిక
గుఱుతు పట్టుదువె' యంచుబలికె నటు.

"కనులు మూయగా గలవె సుఖమ్ములు
కలవె దుఃఖములు, రాగాసూయలు
దినము రాత్రియును బ్రహ్మయు మాయయు
కనిపించునె కాసంతయు స్థిరముగ

శూన్యము చూచుట కలవాటైనపు
డన్యము తోచక నానందమ్మగు
ధన్యత గలుగును శాశ్వతముక్తియు
మాన్యుడు యోగి విముక్తుండగు "నని

గురుడువల్క నబ్బురపడి శిష్యుడు
చరణమ్ములపై వ్రాలి నిలువబడి
గురుని శక్తి యచ్యుత మని నమ్మెను
కుటీరమున కతిథులు విచ్చేసిరి.

రత్నాంబరు రాకకు కుమారగిరి
రాగిలి లేచియు నౌగిలి గొనియెను
రత్నాంబరు నుపవిష్టు జేసి సం
ప్రశ్న మొనర్చె దదాగమ హేతువు.

"అఖండ తేజః పూర్ణ యోగి! నీ
యందు భక్తి గొని వచ్చె నీతడును
నిఖిల సుఖమ్ముల ద్యజించి నిర్మల
నిష్ఠ నైకొనిన పుణ్య చిత్తుడవు.

జ్ఞానవంతుడవు చతురమతివి భగ
వానుని జేరగ శక్తియుక్తుడవు
నే ననుభవ శీలిని సంసారిని
గాన నీకడకు తెచ్చితి నీతని.

విశాల దేవ సునాముం డీతడు
వినయ వినమిత స్వభావు డీతడు
ప్రశాంత జీవన పథికుండీతడు
ప్రశ్నోత్తర సువిచార వర్తనుడు.

జటిల సమస్యా పటుతర దీక్షా
చరణ దీర్చుకొను చతురుండీతడు
నిటల ఘటిత కరపుటుడై నీకడ
నిలిచిన వానిని గనుము శిష్యునిగ."

నా విని 'విశాల దేవా! మెచ్చితి
నాకడ కరుదేరగ కతమేమిటి!'
నావినయమ్మున మ్రొక్కెను శిష్యుడు
'దేవా! పాప మనగ శంకించితి.'

కుమారగిరి చిరునవ్వు నవ్వి "యో
కుమార! పాపము గురించి తెలియుట
సుమా! కష్టతర మది యనుభవమున
చూడవలయు నాకడ నెటులబ్బును.

నియమ సంయమన లాత్మక్షేత్రము
లయయో! అయ్యవి పాపదూరములు
నయమగు నిను శిష్యునిగా పూర్వము
నా లక్ష్యము వినిపించుట నమ్ముము.

పుణ్యము చూపెద దానివలన నీ
వును గ్రహియింతువె పాపరూపమును
పుణ్యుడు రత్నాంబరు ననురోధము
పొంది నేను నీ మాటకు నిలిచితి."

నావిని రత్నాంబరుడను "యోగీ!
న్యాయము వక్కాతి వంతియ చాలును
ధీవరునకు నది సుగమంబగు నం
తే వాసిగ గొను మీతని వడిగా

నాబుద్ధికి దోచని విషయ మ్మిది
నా శిష్యుల ననురక్తుల జేసితి
ధీ బలమున సాధింతురు వారలు
తేజో మూర్తుల సన్నిధి నిలిపితి.

తప మొనరింతును తత్పరమతినై
తమయనుభవమున వారలు తెలిసిన
ప్రపంచానుభవ పాపరూపమును
రహి నెఱిగెద నే వెడలెద "ననిచనె.

కుమారగిరిగనె విశాలదేవుని
సమాధానముల నాశించుచు, 'ప్రియ
కుమార! వాసన యన నెఱుగుదువే
కొంతయైన జెప్పుము చూతం' బన

'దేవ! కోరికల రెండవ నామము
గా వర్ణించెద వాసనాభిధను
జీవనమున నది ప్రవహించెడునది'
నావిని గురు డబ్బురమున బలికెను.

"వాసనయే పాపంబు, జీవితము
పాపసంకులము జేయు సాధనము
వాసనలకు ప్రేరేపణ కలిగిన
వాడు దైవనియమాల దాటెడును.

వానిలోన మగ్నుండగు నాతడు
వానిని, వానిని గను వానిని న
జ్ఞాని గావుననె మరిచిపోయెడును
కాన వాసన త్యాజ్యంబందును.

కోరికలను వదలిన గణనీయుడు
కోరిక లీరిక లెత్తిన నింద్యుడు
కోరి సచ్చిదానందము భగవ
ద్గుణ త్రయము నిర్మలునకు కలుగును.

మమత్వహేతువు వాసన గావున
మమతయు భ్రమ కావరణము గావున
సమకూడునె ఈ గుణత్రయంబును
సరగున వీడుట నా కర్తవ్యము.

మనసు శుద్ధమైనను దపమందురు
తనువు తపించిన దుఃఖముండ దిల
కను వాంఛల నడగించుట కంటెను
కనకుండుట శ్రేయస్కర మగు గద.

కలిగిన కోరిక బలవంతం బగు
కావున కోరిక కలుగకుండ దగు
కలుగుదువే వాంఛలు లేకుండగ
పలుకు "మనగ ఛాత్రుండిట్లనియెను.

'యత్నమొనర్చెద గాని సాధ్యమని
యవలీలగనే జెప్పగ జాలను
రత్నము వంటిది మీ సలహా మఱి
రాయిడి తప్ప దటంచు దలంతును.

మనుజుడు పుట్టెను కర్మచేయుటకు
మానవ కర్మకు ఫలితము దొరుకును
తన ఫలితముపై కోరిక గలుగుట
తప్పని సరియగు టిది తప్పదుగా.

కావున వాసన గడ తేర్చినచో
దైవ ద్రోహము గాదా నామది
భావన సేయును శంకనుబాపిన
భవన్మార్గ మనుసరింతు నిక్కము.'.

ఈ యుత్తర మూహించిన యోగియు
'ఓయీ! నీ పలు కుచితం బగుటను
ధ్యేయం బితర గురూద్దిష్టము గద
న్యాయంబగు గురుభావము గల్గుట.

రత్నాంబరు శిష్యుండవు గావున
ప్రాపంచికముల ధిక్కరించ విక
యత్నము చేసెద నా గతి నడుపగ
నాస్తికుడను గా నాస్తికుడగుదును.

కాని రెండు విషయాలు నమ్మవలె
కలవు భువిని కర్తవ్యము బ్రహ్మయు
ఐన నీవు నిశ్చింతగ నుండుము
నేను దీక్ష దయసేతు నీకిపుడు.

ముక్తి మార్గమును చూపి నీకు నను
రక్తి పాప పరిచయమ్ము సేసెద
శక్తి కొలది' నా విశాల దేవుడు
సంతసించి సమ్మతమును దెలిపెను.

## 3. అసిధారావ్రతం

బ్రహ్మచారి శ్వేతాంకుడు
పరమ పవిత్రుం డాతడు
జిహ్మా దూరుడనభిజ్ఞుడు
స్త్రీ పరిచయ విరహితుండు.

పాతికేండ్ల వాడు శాస్త్ర
బహుళాధ్యయనసుశీలుడు
నీతి వ్యాకరణ దర్శ
నేతి హాస పరిచితుండు.

కావ్య వర్ణిత స్త్రీ గుణ
గణ పరిచితుడంతె కాని
దివ్యక్ స్త్రీ సౌందర్యము
తేరి చూడ లేదెన్నడు.

తమ సంగతి నీత డుంట
తగియుండుట ముదమందెను
సమవయస్కు డగుట చేత
సంతసపడె సామంతుడు.

చిత్రలేఖతో నిత్యము
రాత్రి శిష్యు డరుగ వలెను
చిత్రలేఖ మాదకతా
నేత్ర యగుట సహజంబగు.

మత్తిల్లిన కనుల తోడ
మాణ వకుని గను నర్తకి
చిత్తం బుత్తల పడగా
శ్వేతాంకుడు చలించెడును.

మదిరామద మత్తతరుణి
మదన మోహనాకారుడు
విదిత తైలభరిత దీప
వేష్టిత శలభమ్ము తీరు.

చిత్రలేఖ దెస గనుచు వి
చిత్ర సుఖము గనును వటుడు
ఆత్రంబున మ్రింగజూచు
న జ్ఞాతావ్యక్త తుష్టి.

అర్ధనిమీలిత నేత్రము
లర్థ వంతముగ జూచిన
నర్థి మారు నున్మాదిగ
నర్ధ రాత్రి వేళ గాన.

శ్వేతాంకుడు బీజగుప్తు
సేవకు మన్ననలందెను
నేతల పరిచయము గలిగె
నిండె నఖిల భోగమ్ములు.

శుష్క సాధనము వదులుచు
సుఖ సాగర మధ్య నిలిచె
పుష్కల భోగముల గూడి
పుణ్యపాపమధ్య నిలిచె.

ఒకే తీరు సాగు బ్రతుకు
వికలముగా మొదలిడియెను
సకల వాసనల వలలో
చతుర మతిగ మెలగ వలయు.

అర్థాంతర కార్యమ్ముల
నాగె బీజగుప్తుడొకటు
నిర్ధారిత సమయమ్మున
నిలిచె సతీరథ మచ్చటు.

శ్వేతాంకుడు స్వాగత మిడి
చేర్చె లోని కతివను వడి
నేత యింట లేని విషయ
మాతురముగ మనవి చేసె.

'రాక యెంత తడవగు'నన
'రావచ్చును త్వరలో' ననె
'నాకు దాహమగు' నంచన
'స్వీకరించు జలమం' చనె.

'ఎంతటి యజ్ఞాని' వనిన
'ఏమి తప్పు జరిగిన' దనె
'చింతించిన తెలియు'ననిన
'చెప్పిన తప్పేమి' టనియె.

'పిపాస దీరుటకు జలము
పీయమానమగునె? అగ్ని
తపనము శమనము గోరునె
తపియించును నేతి' కనిన

'తృప్తికి జలమును గోరుట
ధృతి గాదన వింత' యనియె
"తప్తత యనుభవము లేదు
తరుణ వయస్కుడవుగాని

జీవనమే యొక పిపాస
జీవనమున నది తీరదు
జీవనాంతమగు దీరిన
కావున మధువంది "మ్మన

"తార్కిక ధోరణి మెచ్చితి
దరుణీ శిష్యుడనైతిని
తర్కమేల తెచ్చి యిత్తు
దాహమునకు మదిర," ననియె

ఘుటిక వేసి మధు పాత్రను
వటుని ముందు నుంచె నతివ
తటినీనిభ చేలాంచల
మటు దొలగెను దలనువీడి.

చీకటి కూకటి తోచును
జెలగి కేశపాశమ్ముల
జోకను ముత్యాల సరులు
సొంపు నింపు చుక్కలగతి.

అంజనరేఖా భ్రమరము
లందగించు ముఖకమలము
సంజచాయ పెదవుల లా
స్య మ్మొనర్చి మనసు దోచు.

చెక్కిళు లద్దములై తన
ముక్కు కన్ను తీరు తెలుపు
జక్కదనము చిక్కనగుచు
జొక్కమ్మును వెక్కిరించు.

అధరోష్ఠము బలిమి తోడ
మధు బిందువు నిలుప జూచు
మధుర హాస దర్పణమున
మారు తూపుగా మారును.

కన్నులు చిరునవ్వునవ్వి
చిన్నవాని మనసు దోచు
మున్నెన్నడు జూడని సొం
పులు కన్నులు జుర్ఱ సాగె.

"శ్వేతాంకా! మదిరపైన
శీత కన్ను వేసెదేల?
నా తప్పుగ నెంచకు ని
న్నాతతగతి ప్రశ్నించుట.

నీగురుడాజ్ఞాపించెనె?
త్రాగుడును నిషేధించెనె?
కాగ కారణము దెల్పుట
కర్జ మిప్పుడగు" నంచన

"సంయమంబు జీవన ల
క్ష్యంబ వశ్య మగుట మదిర
సంయమ విద్వేషి" యనియె
'సంయమ లక్ష్యం బేమిటి?'

'సుఖ శాంతులు లక్ష్యంబులు
సుమ్మ' నంగ జిత్ర లేఖ
'అఖిల జీవనము దేనికి?'
అనగ 'శాంతి సుఖముల' కనె.

పాత్ర పెదవి కానించుచు
పడతి వలికె వటునితోడ
"నాత్ర పడకు, తప్పితి విట
అందలి సత్యము చెప్పెద.

సౌఖ్యము తృప్తి యెగాదా!
శాంతి యకర్మణ్యత కద!
ముఖ్యముగా జీవనమ్మొ
బుద్ధి కర్మలకు నిలయము.

తీరని దప్పిక యయ్యది
తిరిగెడు శీలము దానిది
కోరెదెట్లు సుఖ శాంతులు
కొను" మంచందించె పాత్ర.

తొలగించగ గలడాతడు
పలుకెత్తగ లేకపోయె
మిలమిల మను చెలికన్నుల
తళుకు లందు దడబడియెను.

చెలి ముఖమ్మునందు స్వర్గ
సీమ దృశ్య కావ్య మయ్యె
కలికి పలుకు సంగీతము
గారవించి ముగ్ధడయ్యె.

చెలియ కర స్పర్శ సుధా
సేచనమ్ముగా దోచెను
నెలత కంటి కాటుక వె
న్నెలల మించు చీకటయ్యె.

పెదవుల కందించు పాత్ర
మదిర పరిమళించె నాస
ముదిత దీనివలన దనను
మోహించెడు ననెడు నాస

గుటుకున మింగెను దానిని
వటువు చూపు నెలతపైన
చిటుకున మధురాసవమ్ము
చేరెనంతలో నుదరము.

"నర్తకికి శుభాకాంక్షలొం
నర్తు దీక్షనిడెవటునకు"
మూర్తిత్వము సెందు హాస
న్ముఖిత బీజగుప్తు డనియె.

హఠాత్తుగా లేచి వటుడు
తటాలుమని చూచెన్నృపుని
పటాపంచలగు మోహము
వంచె దలను లజ్జాగతి.

బీజగుప్తు డభ్యంతర
మోజవోవ శ్వేతాంకుడు
"రాజముఖీ! నా సాధన
రవరవ గావించితివే

ఎందుల కిటు చేసితి వీ
వేల జ్వాల రేపితి న
న్నెందున గొఱకాకుండగ
మందునిగా జేసితివిల

నా జీవిత పథము నందు
నన్వచ్చిన కతం బేది?
బీజగుప్తు డిది గని యీ
రోజు నిలుచునే సమ్మతి?"

చేయివట్టి యడుగ దొడగె
న్యాయమ్మొ యిది యటంచు
"ఓయీ శ్వేతాంక! నీవు
చేయునదియ సాధనయా!

కాదది కాదాత్మ హనన
కర్మసుమ్ము జీవనమున
మాదకత యవశ్యమ్మని
మాత్రమె తెలిపితి నియ్యెడ.

జ్వాల రేపు విషయము నే
జాలరేప గుప్తముగా
నీలో గల దయ్యది నే
నీకెఱింగించితి నంతే."

అనుచు చేయి లాగి సరగ
ననగ దొడగె జిత్రలేఖ
"విను నీ జీవిత మార్గము
నను నే జేరుట జరుగదు.

బీజగుప్తు డొక్కడె నా
ప్రియుడు వినుము శ్వేతాంకా!
రాజరాజు లెందఱైన
రాలేరీ వనిత గలయ.

తొలగి పొమ్ము వేగ నిచటు
తొందరగా" నన విచార
జలధి మునిగి శ్వేతాంకుడు
సరియని ద్వారమున జేరె.

అతివ వలన గలిగినట్టి
యవమానము దుస్సహమయి
అతుల దుఃఖ మయ్యె నతని
యకుల జలములు గ్రమ్మెను.

చిత్రలేఖ శ్వేతాంకుని
జేర బిలిచి మరల ననియె
'ఆత్ర పడకు, కోపించితి
నంతె మనసు నందుంచకు.

మనసున నిను ప్రేమింతును
మరిమరి నా సోదరునిగ
మనసు నొవ్వ మాటాడితి
మన్నించుమి నను సోదర!'

శ్వేతాంకుడు చలియించెను
చిత్రలేఖ మనోవృత్తి
చేత జకితుడై పోయెను
చింతలెల్ల దొలగి పోయె.

"దేవీ! మన్నించవేడ
తేజో హానియ సుమ్మా
నావలనన దోషము గల?
దీ విధి తగునే పలుకగ?

దండింపగ దగు వానిని
దండించక దయ తోడను
గుండె నిండ బిలుచు నిన్ను
కొలుతు వదలె నజ్ఞానము

స్వామిని నే వెళ్లెద" నని
జనియెను శ్వేతాంకుండటు
సామంతుని కడకు జేరి
'స్వామీ! దండించు' మనియె.

పదముల బడువాని లేపి
పలికె బీజగుప్తుడు, 'త
ప్పిద మేమిటి ఏల శిక్ష
భీతి వదలి చెప్పు' మనియె.

"చెప్పరాని తప్పిప్పుడు
చేసితి, ద్రోహము చేసితి
చెప్పగ నోరాడ దయ్యా!
శ్వేతాంకుని క్షమియించుమ.

మీరు వలచు మిమ్మువలచు
మెలతను వలచితి" ననగా
"నేరీతి నెఱింగితి వా
నారి వలచె నన్ను" నియెను.

'చిత్రలేఖ స్వయముగానె
చెప్పె' ననియె శ్వేతాంకుడు
'చిత్రలేఖ చెప్పనిచో
చేయు దేమి ట 'నియె రాజు.

'యజమానికి ద్రోహమ్మును
యత్నమ్మున జేయ బడెడు
నిజ మిది'యను వటుని మాట
నిర్మలతను ప్రకటించెను.

నృపుడు తృప్తి పొందెను "మ
న్నించ వేడ దగునె సఖా!
విపరీతము జరిగెడు ను
ర్వ్యని వేరొక డుండినచో.

పరిస్థితుల ప్రాబల్యము
వలన మనిషి దోషియగును
పరిశీలన చేసినచో
దొరుకు నందు నిజమంతయు.

అట్టి పరిస్థితి చిక్కిన
యట్టివేళ నెవ్వడైన
గుట్టు చప్పుడును జేయక
పట్టి విడువగలడె నేడు.

బుద్ధిమంతుడవు గావున
పుణ్యముగతి దాటలేదు
రాద్ధాంతము సేయకుండ
రహస్యమ్ము దాచలేవు.

దండన స్వయముగ గోరెడు
తప్పిదమ్ము సేయలేదు
పండితుడవు ప్రపంచమ్ము
బాగోగుల దెలియలేవు.

ఇట్టి యనుభవము లెన్నిట
గట్టి పడగ వలయు నీవు
ఇట్టివి నీకగు పరీక్ష
లెపు డే మరి యుండరాదు.

శమదమములు నిర్జనమున
సమకూడుట తప్పనిసరి
శ్రమపడి జనతా తతిలో
సంపాదించుట దక్షత."

నావిని శ్వేతాంకు డనియె
"దేవా! చేసెద నికపై
నావిధి మరువను గానీ
నాకు శిక్ష వేయు" మనుచు.

అనిన "నీకు శిక్ష యేల
ఐనను చెప్పెద వినుమిక
మునుపటి వలె రాత్రి వేళ
ముగుద ననిశ మనుగమించు."

చిత్త మనుచు నొప్పి కొనియె
శ్వేతాంకుడు, నవ్వె రాజు
చిత్త స్థైర్యమున యథా
స్థితి పొందుట సేమముగద.

## 4. అయస్కాంత శక్తి

విశాల దేవుడు తగిన శిష్యుడని కుమారగిరి తలచెన్
విశాల దేవుడు తగిన గురుండని విధి నాతని వలచెన్
కుమారగిరి బోధన విధానముల కొలది మెచ్చెనతడున్
సమస్త విధముల సాధు పుంగవుని సాన్నిహిత్యమబ్బెన్

ఆతని యోగము నందాసక్తిని బెంచుకొనియెవటుడున్
స్ఫీత మహత్వ మ్మాకర్షించెను బెరిగె నతుల శక్తుల్
నా డుపాసనము గూర్చి చెప్పగా నుత్సహించెగురుడున్
దౌడు తీసె దినకరుడు పశ్చిమోర్వీధరంబు చేరన్

"వత్తునా లోనికి మహాత్మా!
పథము దప్పిన పాంథుడను" నా
'ఇత్తు నాశ్రయ మిందు ర' మ్మని
హితవుగా ముని పిలిచినన్.

పథికుడొక్కడు నాతి తోడుత
పర్ణశాలను జొచ్చి నిలిచిన
వ్యథ కుమార గిరీంద్రుడనియె' "న
బద్ధమేటికి పథికుడా!

నాతితో జనుదెంచి నానని
నాకు జెప్పవు మున్ను నీవిక
పూతమగు నాశ్రమము యోగుల
పూన్కి నీకిక తెలియదా!"

అనిన పురుషుం డిట్లు పలికెను
"నిను నెఱుంగుదు జితేంద్రియునిగ
వనిత నొక్కత కాదు జతగా
ననుమతించగ జాలవా?"

చకితుడైన కుమారగిరి ఆ
సనముపై గూర్చుండి యుండెను
వికలుడగుటను దోచనీయక
ప్రకటముగ దా బలికెగా.

"అంధకార మ్మగును మోహ
మ్మగును, మాయయు నగును, వాసన
బంధురమ్మగు వనిత కావున
బాధ పడితిని నేడిటన్.

ఐన మీరతిథులు, కుటీరము
నందు నాతిథ్యమ్ము సేయుట
పూని నా కర్తవ్యమగుటను
పొమ్మనన్గలనా మిమున్"

అనిన నారీతిలక మబ్బుర
మంది యోగిని జేరి మ్రొక్కెను
'వినుత తేజో లుబ్ధ శలభం
బునకు చీకటి మ్రొక్కెడిన్.'

నమస్కారము వింతగానై
నారసంబును బోలి గ్రుచ్చెను
సుమధురంబగు గాత్రమును నం
దమున జిందెను గవితయున్.

అహము తోచెను వినయభరమై
అసాధారణ నమస్కారము
సహనశీలిగ యోగివర్యుడు
చానగని చకితుండయెన్.

కోపమును శమియింప నత డపు
రూపసుందరి నపరిచితగని
తాప సోత్తము డుత్తరంబిడ
దగద టంచనె పురుషుతో.

'అతిథులను బరిచయము గోరుట
అనుచితంబును గాదు కావున
అతిథి సత్తమ! ఎవ్వరో మీ
రతి ప్రీతిగ జెప్పుడీ'

"పాటలీ పుత్రాఖ్య నగరని
వాసుడను నే బీజగుప్తుడ
పాటలాధర చిత్రలే ఖన
బరగు నర్తకి యీమెయున్."

అబ్బురంబున యోగి వర్యుడు
"అహో! నర్తకి చిత్రలేఖా!
నిబ్బరమ్మగు నీ కవిత్వము
నిండె నున్మాదంబుతో.

నీదు హృద్గత విషమ్మోతరు
ణీమణీ! సుందరత దాగెను
మోదమున మ్రొక్కితిరి గావున
ముందు దీవెన లిచ్చెదన్.

సుమతి నిచ్చెడు గాక మీక
చ్యుతుడు సతతం" బనిన నర్తకి
సుమధురంబుగ మందహాసము
శ్రుతి నిబద్ధత చేసియున్.

"యోగివర్యా! సుమతి యన న
ర్థోక్తి భిన్నత కలుగు నెప్పుడు
రాగి సుఖము విరాగి దుఃఖము
రంజిలును వ్యతిరేకమ్మై.

వ్యక్తి తన సిద్ధాంతమున వి
శ్వాసముంచును మంచి యెంచును
రక్తి తనపై నితరుగతి దు
ర్మార్గ మను జగమందునన్.

ఏది సుమతి యికేది దుర్మతి
ఎందు నిశ్చయ మౌను తెలుపుము
కాదనను దీవెనను సత్యము
గావలెను గద!" యంచనన్.

రాగి నర్తకి దాడి చేసె వి
రాగిపై అని క్రాంతి శాంతికి
భోగి ముక్తుల మధ్య యుద్ధము
పొసగె నిప్పుడు ధీరతన్.

అవిచలితుడై యోగి పలికెను
'భువిని వాస్తవ మొకటి కలదది
అవని శాంతిని సుఖము గూర్చెడు
నట్టి విజ్ఞానం బనన్.'

బ్రహ్మ తేజం బుట్టి పడు ముని
వర్యు కంఠ ధ్వని గభీరత
జిహ్మ దూర ప్రభా వికసిత
చేతనా వేశమ్మునన్.

యువక సుందర మంజుతేజో
యోగ యోగి కుమార గిరి కను
గవను శాంతి జ్యోతి వెలుగగ
గనియె నర్తకి చలితయై

ఉచ్చకోటిని నిలువగా దగు
యోగి యాతం డనుచు దలచెను
నిచ్చలును సాహస మొనర్చెను
నిజముగా వాదించగా.

"శాంతి సౌఖ్యము లంటి యతివర!
సౌఖ్యముల పరిభాష పెక్కులు
శాంతియగుగా నకర్మణ్యాత
సాధువర్తన! ఎఱుగుమా!"

వికృత సిద్ధాంతముల బల్కెడు
వెలదిగని ముని చకితుడయ్యెను
ప్రకృతి సుందరి విదుషిగా తన
ప్రతిభ జూపెడు నంచిలన్.

ప్రతిభయే ప్రతిభకు విరోధిగ
ప్రబలగల్గును జ్ఞాన జగతిని
ప్రతిభకే సర్వోచ్చతాస్థితి
వరలుచుండును దిరముగా.

కొంత మౌనము కడపి ముని "యో
కోమలీ! పలికితివి సత్యము
శాంతి యగున య్యా కర్మణ్యాత
సరవి నదియే ముక్తియౌ.

అకర్మణ్యాత యనుచు దేనిని
యనునొ విశ్వంబది యబద్ధము
ప్రకటముగ నాస్తితిని మేధయు
సకల కర్మ లొనర్చెడున్.

ఎట్టి శూన్యము నుండి పుట్టెనొ
అట్టులే లయ మకర్మణ్యాత
అట్టి శూన్యత బ్రతుకు లక్ష్య
మ్మిట్టి సత్యము నెఱుగుమా!

సుఖము గూర్చిన యర్థ భేదము
చొప్పు వల్కితి వదియు నమ్మెద
సుఖమ్మొక్కటె భేదముండదు
సుఖుండున్నతు డయ్యెడున్."

యోగి మాటల కబ్బురం పడి
యువిద ఆకర్షింపబడియెను
రాగి మనసు ద్రవింపజేయు వి
రాగి యని హృది మెచ్చెడున్.

ఐన నింకొక మారు సాహస
మాచరించగ బూని పలికెను
"కాని యోగీ! నమ్మ నెవ్వడు
కనుల దోచని శూన్యమున్.

కనుల దోచిన యదియె సత్యము
కనుల దోచని శూన్యమొక క
ల్పనయె, దానిని పొగడు యోగీ!
కనెదె మమతల భేదమున్.

భేదమును గనువాడవైనచో
విశ్వసించవు శూన్య మీవును
భేదభావము లేకపోయిన
విజ్ఞతాంధతలందునన్.

మిథ్యయగు సుఖ దుఃఖములకును
మెలత పురుషుల పుణ్యభవముల
మధ్యగల భేదమ్ము సుమ్మీ
మాట తప్పకు మునివరా!

ఈశ్వరుడు పుట్టించు నపుడే
ఏర్పరించెను చేయు కర్మను
ఈశ్వరుడు భువి కర్మకొఱకే
ఇచ్చె జన్మను మనిషికిన్.

కర్మ సేయగ వెఱచి మనుజుడు
కాతరుండై కష్ట సుఖముల
ధర్మమున నతి ఖిన్నుడగు సం
దర్భములు తగునా ధరన్

తృప్తి సుఖమున మారు పేరగు
తేజరిల్లును కోరికలలో
తృప్తియన గోరికలు దీఱుట
దీప్తమిది నీ వెఱుగుమా!"

యోగి గాంభీర్యము వహించెను
యోష చిరునవ్వులు వెలార్చెను
భోగి సామంతుడును నర్తకి
బుద్ధి పటిమకు మెచ్చెడున్.

మానినీతర్కమున గుందెను
మాణవకుడు విశాలదేవుడు
మౌని ప్రత్యుత్తరము కొఱకై
మంత్రముగ్ధత నిలువగాన్.

మౌని యొక పది నిమేషమ్ములు
మౌనమున యోచించి పలికెను
"మానవున కీశ్వరున కెంతయు
మధ్య భేదంబుండునా?

ఉండబోవని భేదమొక యెడ
నున్న నయ్యది బాహిరమ్మొ
దండి యోగము చేత నది యు
ద్దండముగ గనిపించెడిన్.

మాయయును బ్రహ్మయును గలిసిన
మమత్వంబన బడును, బ్రహ్మను
మాయ యొక యంశంబ యయ్యును
మారు గా తోచును భువిన్.

మాయలో బ్రహ్మంబు మునిగిన
మగ్నుడౌ సంసార మందున
మాయ వదలిన స్వయం జ్యోతిగ
మారునాతడు దెలియుమా.

నీకు నాకంతరము గలదే
నిర్మల బ్రహ్మాంశములమే
జోక మాయా మిశ్రితమ్మవు
సుమ్ము మాయా రహితుడన్.

కాన మాయను దూరముంచగ
కాంక్ష సేసెద, తృప్తి సుఖమని
పూని పల్కితి వదియు తప్పగు
కాన విప్పెద నిప్పుడున్.

తుష్టియే మరి తృప్తి యైనచో
దుఃఖమేటికి యదియె సుఖమగు
దుష్ట కర్మల జిక్కు తృప్తికి
తుష్టి యెట్టుల కల్గెడిన్.

బ్రహ్మ మాయా సంగమున తను
స్వయముగానే మరచిపోవును
జిహ్మ పూరిత కర్మజాలము
చేత జిక్కుచు గుందెడిన్.

మాయనెప్పుడు వీడునో త
న్మయత నెప్పుడు వాయునో ని
ష్ఠా యుతుండయి తృప్తి నెందును
సంతసమ్మును పొందెడిన్.

దుఃఖమయ సంసారమును విడి
తుష్టి నందుటయే సుఖమ్మగు
దుఃఖమున కతి దూరముండును
దూరమాలోచించగా.

తనర సత్య మ్మనుభవించుట
తప్ప మార్గము లేదు అది అ
య్యనుభవము విశ్వాసముండక
మనుజు డెటు విజ్ఞానియౌ

తర్కమున కంతమ్ము గల్గనె
తరుణి రేయియు మించుచున్నది
అర్కు డుదయంబైన దాకను
నాగ దిది విశ్రాంతి గొనుమా!"

ఋషి వ్యక్తిత్వమ్ము నాక
ర్షించె నతివను, నెలత యందము
ఋషియు మెచ్చెను జ్ఞాన సంపద
తృప్తి లే దిద్దఱ కిలన్.

బీజగుప్తుండిద్దఱంగని
వెలవెలయ్యెను ముఖమునందున
పూజనీయుడు మౌని తరుణియు
పూవుబోడియు గావునన్.

ఎంత యాకర్షింపబడనిది
ఇంత వాదం బెటుల జరుగును
స్వాంతమున నుత్తలంపడు వి
శ్వాస ముంచడు దానిపై.

"ఈత డిచ్చుట పండుకొను మీ
రితని కుటిలో విశ్రమింపుడు
రాతి రెక్కుడుగాగ నుదయము
బ్రాతిపడెద దపమ్మునై."

అనిన ముని వచనమ్ము విని మన
మందు మెచ్చెను బీజగుప్తుడు
చనుచు నర్తకి "యోగివర! జీ
వనము మరచుట తపమగున్.

నిజమునకు దప మాత్మహననము
నిరూపించెద సమయ మిచ్చిన
ప్రజనితానందమ్ము తోడుత
ప్రణామమ్మొనరించెదన్ "

అనుచు నర్తకి బయటి కేగిన
అంత ముని చిరునవ్వు నవ్వుచు
ననుకొనెన్ మన మందు నిజమే
ఆత్మ హననము తప మనన్.

ఆత్మ మాయాబ్రహ్మములలో
నతుల మాయా లోపమగు తరి
యాత్మ మరణంబైన బ్రహ్మం
బతులమై వెలుగొందెడున్.

అనుభవమునకు రాగ్రహించెద
వంతె నీ వితరమ్ము నుండిన
గనుదు వందలి రహస్యమ్మును
జ్ఞానమున్నది నీ హృదిన్.

జ్ఞానమొక్కడు చూపదగినది
గాదు సుమ్మత్యంత దుఃఖం
బూనుచున్నది మనసు నినుగని
పొమ్మటంచని యనె మదిన్.

తిరిగి వచ్చె విశాలదేవుడు
పరుగునను వారలను బంపుచు
బరువుగా నా బీజగుప్తుడు
పలికె నటి నబ్బురముగా.

"చిత్రలేఖా! హృదయ మొక్కటి
చిత్రమగు భారమ్ము నొందెను
ఆత్ర పడు మన బ్రతుకులందున
నలముకొను మేఘములు నాన్.

ఏల ననగ కుమారగిరి యో
గీంద్రుడాకర్షించె" ని న్నన
బాలనెమ్మొగ మోలి వెలవెల
పడియె బలికెను స్తిమితయ్యె.

"ప్రియతమా! మూర్ఖుండు నాతడు
పేర్మి నాతని యాత్మ చచ్చెను"
ప్రియునితో నిట్లనియె నింకను
ప్రియుని మోసము సేయగాన్.

"యోగి నిర్జన వాసి, మన మిం
దుండునది భోగస్థలమ్మగు
భోగులము, వాసనల నెఱుగడు
యోగి వానిని చంపెడున్.

మనము వాసనలందు నమ్మక
మునను బ్రతికెడువార మాతని
మనము కల్పిత శూన్య వల్లభ
మంజులమ్మగు నిత్యమున్.

మనదు జీవన లక్ష్యమెయ్యది
మత్తుగల నున్మాద మగుటను
మనకు మధ్యను నెట్టి వ్యక్తియు
మనడు నమ్ము మటం" చనన్.

"దేవుడట్టుల జేయుచుండెడు
గావు" తనియెను బీజగుప్తుడు
దేవిమదిసుందరుడె మునియని
భావనము సేసెడు దుదిన్.

## 5. యుక్తి - ప్రత్యుక్తి

స్వర్ణ తోరణ విభాసముపేత జాజ్వల్య
వర్ణితామేయతాద్వార సంకలితమ్ము
దారుతామ్రసువర్ణ రజత శిల్పాకృతిక
భూరి సౌందర్య నృత్యాభినయ దర్శకము.

రాజోన్ముఖముఖాబ్జ రాజితాగంతుకము
తేజః ప్రసారణ ద్విగుణిత హసన్ముఖము
స్వీయ రాజన్య వృత్తాంత విజ్ఞాపనా
మేయ కుతూహలాగత రాజభారితము

నైజశక్తి ప్రదర్శన సభ్య సామోద
రాజితాదర మేదురాశాగతప్రజము
ఆవశ్యకావళినివేదనా మోదనా
శావహ ప్రాతినిధ్య వ్యక్తి కలితమ్ము.

పాటలీపుత్ర పార్థివ వంశ రాజన్య
కోటి పీఠిత రత్న సింహాసనాంచితము
చంద్ర గుప్త ప్రజాపతి పాలనోపాత్త
సాంద్ర కీర్తి ధ్వజా శాంతసంవలితమ్ము

ఒకవైపు సామంత గణము లొప్పారవే
రొకవంక రాజ్య ప్రధానాధి కారులును
ప్రకటకర్మిష్ఠ విప్ర ప్రకరమొకచోట
సకలమై సకల ఋత్విజ్ఞికాయము నిండ.

యజ్ఞాఖి మంత్రిత ప్రకట ధూమసువాసి
తాజ్ఞానువర్తితాఖిల భృత్యసంఘమ్ము
విజ్ఞ సంగీత విద్వచ్ఛిల్పినటవిట మ
నోజ్ఞమై యొప్పు నరపాల సభ యెంతయును

ఆ సభా భవనమ్ము యజ్ఞావసానమున
వాసితాఖిల దర్శనాంతర్విషయ చర్చ
కోరి యేర్పరచినది, కూడిరందఱు, రాజు
తేరి చూచెను సభాసదముఖమ్ములనెల్ల

చంద్ర గుప్తుడు మంత్రి చాణక్యు దెసగాంచి
మంద్రహాసము చింద "మంత్రి వర నీతిజ్ఞ!
మీ నీతి శాస్త్ర మాయాచోటులన్ సమీ
చీన మయ్యును గొంత ధర్మావ హేలనము

కావించె నేలకో? కరుణింతురే మీర
లేవిధిన్ నీతి శాస్త్రము ధర్మ బాహ్యమో?"
నావినుచు జాణక్యు డానందమున లేచి
ఆవిర్భవించు తేజోరాశి యనునట్లు

సవినయమ్ముగ బండితాఖండలులకును
గువలయేశున కానతాస్యుడై యిట్లనియె.
"సత్య సంగ్రహణ పారీణులౌ భూమీశ!
సత్య మస్మన్నీతి శాస్త్ర మం దచటచట

రూఢి ధర్మ విరుద్ధ సిద్ధాంతముంట యా
రూఢియే, యే నొప్పుకొందు నీ విషయమ్ము
వివరించి చెప్పగా వేడ్క గల్గెడునాకు
భువి సమాజము చేత బుట్టినది ధర్మంబు

ధర్మమ్ము నీతి శాస్త్రపు మాతృక గాదు
ధర్మమే నీతి శాస్త్రమున జన్మంబందె.
నియతజీవితము మన్నిక సమాజమున కా
శ్రయమైనయది నీతి శాస్త్రమ్ము తెలియుడీ.

నీతికాధారమ్ము నెలమి తర్కమ్మగున్
నీతి నిర్ధారమ్ము గావించు నియమాల
విశ్వాసమే ధర్మమున కాది మూలమ్ము
విశ్వాస బంధితుండేలు నియమములెల్ల

అదియే సమాజంబునకు మేలు కల్గించు
అదిగోరి యొకట ధర్మావరోధము గల్గ
అవసరంబగు విరుద్ధాచరణ ముర్విలో
అవని యిట్టుల మారు నట్టిదే ధర్మమ్ము."

మంత్రి మాటల కబ్బురము సెంది పండితుల్
మంత్రముగ్ధులుగ నిస్తబ్ధులై యుండగా,
గర్వమున రాజు మంత్రినిగాంచి సభవై ప
ఖర్వదృష్టిని జూచు నూత్న సిద్ధాంతమ్ము

సారవంతమ్మయ్యు జతురోక్తి మయ మని
ర్ధారి తాఖిల ధర్మ సిద్ధాంతపు విరోధి
అగుట దీనికి సమాధానమేరిత్తురో
తగుదు రెవ్వరు దీనికని చింతిలంగ వి

ద్వన్మండలిని గల్గు యోగి యొక డిట్లనియె
"జన్మనిచ్చెను మానవున కీశ్వరుం డట్లు
మానవుండు సమాజమును వినిర్మించె నది
కానబడు సర్వ విశ్వ స్వరూపంబుగా

ఈశ్వరుని మానవుని సేత మొనరించునది
విశ్వమే, అది సమాజాను జీవిత మగున్
దానిహేలన ఈశ్వరావహేలనము స
త్యానికి దూరమం దరుగుటయు నా బడును.

సత్యమొకటే ధర్మమే తద్ద్వితీయాఖ్య
నిత్యమై నిర్మలంబై యొసంగును భువిన్
నీతిశాస్త్రంబు ధర్మవిరుద్ధమైనచో
నీతిగా దదియ దుర్నీతి శాస్త్రమ్ము

ధర్మ సిద్ధాంత సంవర్ధకమ్మై వెల్గు
మర్మ మీ విశ్వ మం" చను యోగి పల్కు విని
వృద్ధుడౌ చాణక్య మంత్రి పుంగవుడప్డు
క్రుద్ధు డౌచు గుమారగిరి యోగి గనుగొంచు

"ధర్మమ్ముపై ప్రీతి దనరారు నో యోగి!
ధర్మమ్మునకు జన్మ దాత యెవరో చెపుమ!"
నా వినుచు 'నీశ్వరుడు మానవుని యాత్మచే'
నావినుచు 'నీశ్వరుని?' అను మంత్రి వాక్యమున

చకితులై రచ్చటి సభాసదులు ప్రశ్నవిని
ప్రకటించె నాత 'డీశ్వరు డనాది' యటంచు
పలుక జాణక్యు డుద్ధురత గంభీరుడై
"పలుక రే రెల్లరీ పాటి నగ్న నిజంబు

నీ వనాదియటన్న యీశ్వరునెఱుగుదే?
ఏ వారలైన నిచ్చటి వారెరుంగుదురె
ఎఱుగ రెవ్వ రటంచు దృఢముగా బల్కెదను
సరియె మాయల మారి మాట నమ్మెడెవండు.

కాని సత్యం బొకటి గలదు, తేజో మయ
మ్మైన మానవ నేత్ర మద్దాని గనలేదు.
దాని నెఱుగగ జాల రెవ్వార లీశ్వరుని
పూని కన్గొన దపంబున్ జేయు డెన్నాళ్లు.

వ్యర్థమౌ, ఈశ్వరునెఱుగుదేనియు వాడు
నర్థి నీ దృష్టి కందిన వాడ ఆయెనా
నిస్సీమ విశ్వ రచయిత యెట్లు గాగల్గు?
నిస్సి! ఈశ్వరు డెట్లు? మనమెల్ల పూజించు

ఈశ్వరుం డన్యు డౌతడు కల్పితుండౌను
ఈశ్వరు బుట్టించె నీ సమాజం" బంచు
చాణక్యుడెల్ల వైపుల జూచి సభలోన
రాణించు నిశ్శబ్ద నిస్తబ్ధతను గాంచి

ఆ ముని కుమారగిరి కనుదోయి మూసికొని
యేమనక నుండ చాణక్యు డిట్లని పల్కె
గర్వ గంభీరతాకలిత దృష్టుల తోడ
సర్వదిక్సభిక విస్మిత ముఖమ్ముల జూచి

"నేనన్న ఈశ్వరుడు కల్పితుం డింతియే
గాని యన్యము గాదు సంకల్పితేశ్వరుడు
భిన్న మతముల యందు భిన్న రూపుండయ్యె
నున్న రూపులు మారి యెన్నొ రూపములయ్యె

అంతరాత్మను గూర్చి యవగతం బొనరింతు
అంతరాత్మయు నీశ్వరవినిర్మితమ్మొనె?
అదియును సమాజనిర్మిత మంచు జెప్పెదను
మది న దీశ్వర నిర్మితంబైన దైనచో

భిన్న మత సంబంధ వ్యక్తులకు భిన్నమై
యున్న దెట్టులు యుక్తి యుక్తముగ బలుకుడీ
ఈశ్వరుండే ధర్మ నిర్మాత యైనచో
శాశ్వతంబుగ మనుజు ధర్మ మొకటే యౌను.

సామాజికుని యంత రాత్మ వేరొకని మత
సామరస్యము నోర్వ దేమిటీ కారణము?
మానవుని యాత్మ సమాజ మొప్పని దాని
కానిపనిగా దల్చు గావునను యాత్మయును

దాని వలనన బుట్టె, దానినియమాలపై
మానవున కంధ విశ్వాసమ్ము ప్రబలినది.
ఆ యంధ విశ్వాస మాత్రశ్రద్ధయే ఆత్మ
మాయమౌ నది సమాజము లేక యుండినన్."

అని మంత్రి వర్యు డాసనముపై గూర్చుండె
ఘన పండితులు తలలు వంచి రాతని ముందు
యోగి యాతని మాట విన్నెనొ లేదొ గాని
మూగ వోయిన కరణి మూసి యుండెను కనులు.

వాని ముఖమున దివ్య తేజంబు తోచెడిని
గాని లౌకిక దృష్టి విజితు డాతండిప్డు
చంద్రగుప్తుడు నవ్వి, సభనంత కలజూచి
మంద్ర గంభీరతన్ సైగ చేసెను నంత

"వాదోపవాదముల్ పరిసమాప్తంబయ్యె
గాదె నృత్య మ్మిప్పు డారంభమగుగాక!"
అనునట్టి ప్రకటనకు హర్షమొందెను సభయు
మనము లుత్కర్ష సంభ్రమములం దేలినవి.

దిశలు తేజము గురిసినట్లుగ
దృగ్వికాసము ద్విగుణమయ్యెను
వశీకరణమె సాధనముగా
వశముదప్పెను మానసమ్ముల్

అందె లందము చిందు సవ్వడి
యందు డెందము కందళించెను
మందగమన సభాప్రవేశము
నందు హాయలింపొందసాగెను.

కటక ముక్తా భరణ నిస్వన
మటునిటై మతులూపుచుండగ
నటీ లయానుగతాత్మ గమనము
నన్ విలాసము చిందుచుండెను.

నిండు చంద్రుని బోలు మోమున
నిండె వెన్నెల కాంతి, వేణిక
నిండు విష మోర్వకను నాగం
బుండె దత్పృథ గ్రోలగానాన్.

వేణికా వినిబద్ధ ముక్తా
విసరములు శశి గవయు పామును
శ్రేణిగా దలపడ్డ విధమున
చెలగి యందము లందగించెను.

వలిప మొప్పెను వలుదకుచముల
వలయు పరిమాణమును దెలుపుచు
వలయితమ్మై వలువ చెలువము
కళల దాచుచు కళల నింపెను.

రత్న జటితా భూషణావళి
రాజితమ్మై నటి వెలింగెను
రత్న నిధి సుకుమారి రూపము
ప్రకటమయ్యె సభాస్థలమ్మున

రాజునకు నభివాద మొనరిచి
రమణి సామంతులను గాంచెను
బీజగుప్తుడు చిత్రలేఖయు
వెదకి రొక రొకరిం గనుంగొన.

మౌన సంభాషణము చేసిరి
పూనుకొని కనుదోయి తోడనె
మౌని గాగల యోగి నెమ్మొగ
మూని కనుగొనె జిత్రలేఖయు.

బీజగుప్తుని వోలె యోగియు
వీక్షసేయు నటుంచు దలచెను
మోజు వీడెను ధ్యానమగ్నత
మునియు నుండుట చిత్రలేఖయు

జంత్ర వాద్యము లాగిపోయెను
క్షణములో నిశ్శబ్ద మయ్యెను
మంత్రముగ్ధులుగా సదస్యులు
మారి యుండిన తరుణముననే

కమలకోమల పదముల లయ
క్రమమునను గదలించెనర్తకి
కమల నయన చలించు పట్టుల
కదలి నట్లుగు గాంతి రేఖలు

నాట్యమున కనువైన గతి చె
న్నారె వాద్యము లమలగతులై
నాట్య మొప్పెడు ప్రేక్షకుల ను
న్మాద వశులను జేయునట్టుల.

కంతుబాణము బోలు నర్తకి
కనుల దోచియు మనసు దోచిన
స్వాంతములు సత్కళా దర్శన
చతురతను మోదాబ్ధి దేలగ

కనులు దెరిచి కుమారగిరి గొ
బ్బునను నిల్చెను బల్కె దృఢముగ
"వినుత సచివా! కంటి నీశ్వరు
వినుతగతి జూపింతు మీకున్."

రసాభాసము గలిగె సభలో
రమ్యతకు భంగమ్ము వాటిలె
[illegible], 'యోగి కూర్చొను
గాక!' యని రొక్కమ్మడిన్ వడి.

చిత్రలేఖయు వినగ లే దా
సిద్ధుమాటలు, నృత్యమగ్నత,
ఆత్రపడె గోలాహలమ్మున
కైన కారణ మెంచు కొఱకై.

చంద్రగుప్తుడు సంభ్రముండై
సరగ మంత్రి మొగంబు చూచెను
మంద్ర గంభీరత నృపాలుని
మంత్రి కన్గొనె నర్థ పూర్ణత.

ఏమియో మాటాడ నెంచెడు
నీతడని మది నెంచి మంత్రియు
'ఓ మహా విద్వాంసులారా!
భూమి పతులారా వినండీ!

యోగి యైన కుమారగిరి యు
ద్యోగమున నీశ్వరుని గనెనట
యోగియే చూపించు నట మన
యొక్క సభ నందఱ కిలన్వడి.

భూపునకు నిష్టంబ యియ్యది
హాసగన్నృత్యము కొంత సేపును
ఆపివేయుట యుచితమై తగు
నంచు నానతి నిచ్చె సచివుడు.

కనలి రాత్మల యువకులెల్లరు
కనియె నర్తకి మంత్రి మొగమును
ఘనక్రోధముతోడ యోగిని
గాంచి ప్రక్కకు దొలగి చనియెన్.

'యోగి! ఇచ్చట నీశ్వరుని గన
నుత్సహించుచు నుండ్రి సభికులు'
నాగ యోగియు సభా మధ్యన
నాగి కన్నులు మూసి కొనియెను.

"ఉపస్థిత సామంతులారా!
యోగ్య ప్రేక్షక వర్యులారా!
విపశ్చిన్మణి గణములారా!
వేగ నొకమా రిచట గనుడీ."

అనగ నాతని వైపు జూచిరి
యజ్ఞవేదిక ననల శిఖ యొం
డును బయల్వెడలె న్దటాలున
చనగ సాగెను బైదెసన్

గ్రీష్మ మధ్యాహ్నార్క కాంతిని
గేలిసేసెడు కాంతి గల దది
భీష్మమై భవనోర్ధ్వ భాగము
భేదిల న్మింటికి గమించెను.

మెల్లగా నాయగ్ని శిఖ పెం
పెక్కి మించుచు నుండె నంతట
నెల్ల వారల నేత్రములు రవ
ణిల్లు కాంతిని గాంచ జాలవు.

కాని యందొక వింత కల దది
పూని దానికి దాపముండదు
కాని కాంతియు గల్గు 'నిదియే
కనుడు సత్య' మటంచు మునియనె

సచివుడంతట 'యోగి! ఏమిది?
సత్య మని పల్కుదు వసత్యము
ఎచట చూచిన తోచదేమిటి?
ఏమి నీవిట జూపునది?' యన

చకితులై రంతట సదస్యులు
చతురుడైన కుమారగిరి, 'సత్
ప్రకాశమ్మును గనగలేవా?
ప్రథిత సచివా!' యనిన వెన్కన్

'ఏ ప్రకాశ? మ్మది యెచ్చట
నెటుల యున్నది యెఱుగ' నంచనె
సత్ప్రభుండై యోగి సభగని
సత్వర మ్మిటు చూడు డనియెన్.

అనలశిఖ తరగలను బోలుచు
నవిరళమ్ముగ గదుల సాగెను
జనులు నందున గనిరి ప్రాణులు
చనుట వచ్చుట లుప్త మగుటయు.

నగరములు పల్లెలు జనమ్ములు
నదులు పర్వతములు వెలార్చుచు
పొగలు పొగలుగ బోవసాగెను
మిగిలె నొకటే నసల శిఖయును.

'ఈశ్వరుం డి తడే కనుంగొను
డెల్లవారని' యోగి బలికిన
నీశ్వరుని రూపమ్ము గని భూ
మీశు డాదిగ దృష్టి పొందిరి.

పిచ్చివానిగ మంత్రి యరచెను
" వెఱ్ఱులైతిరి మీరు యోగీ!
ఇచ్చ టేమియు గనుల దోచదు
ఏల యాడెదు ప్రల్లదంబును."

కనులుమూసె గుమారగిరి సభ
కనిన దంతయు మాయమయ్యెను
కనులు దెఱచి 'ఇదేటి మంత్రీ!
జనులు జూచిన దాని జూడవె?

సాక్షులగుదురు సర్వ సభికులు
సరగ నుత్తర మిత్తు' రిపుడన
'నక్షులను గనినార మీశ్వరు'
నంచు బల్కిరి సభికు లెల్లరు.

మర్మమున గాడిన విధమ్మున
మంత్రి రాజు దెసం గనుంగొనె
ధర్మ మూర్తులు నిజము చెప్పుట
ధర్మమంచను నర్థమునురా.

యోగి సత్యము వల్కె చూచితి
యుక్త మీశ్వరు గాంచి యుంటిమి
నాగ యోగికి ననియె సచివుం
డబ్బురమ్మున విషాదమ్మున

" మొదటి సారిగ నాదు కన్నులు
మోసపుచ్చెను నన్ను యోగీ!
ఇది పరాజయ మిపుడు గెలిచితి
వీవె!" యని కూర్చుండె నాతడు.

యోగి పోవుట కుద్యమించుచు
నొక్క యడుగటు వేయునంతలో
'ఆగుమా! మా భ్రమ నివారణ
మైనచో నిట కదలు' మను సడి

జనులు కౌతూహలత మునిగిరి
కనులు నిటునటు వెదుక సాగెను
మునియు నాగెను జిత్రలేఖయె
ముందునకు విచ్చేసి పలికెను.

"ఏది మీరిటు జూపినారో
ఇంతయును గనలేక పోయితి
మోదమందెద మంత్రి యొక్కడు
నాదు పథమున నిల్చె నంచును.

ఏది యీ సభ చూచినారో
యిందు మేమును జూడలేనిది
ఏది నీవును జూచినావో?
లేదొ? చెపుమా! దైవ సాక్షిగ"

యోగి నర్తకి కనుల జూచెడి
నువిద కన్నుల నవిశ్వాసము
యోగి కన్నుల గనును నర్తకి
బాగుగా వెలుగొందు భాసము.

యోగి విస్మితుడై తటాలున
ఊహుఁ !యని వినిపించె, సభికులు
బాగుగా నబ్బురము నొందిరి
చాగురే! యనె మంత్రి మౌళియు.

"ఇది నిజమ్మా పలుకు యోగీ!
ఈశ్వరునిపై యొట్టు సుమ్మీ!
విదితముగ నీ వాత్మ శక్తిని
వీరికిది చూపించి నావన.

జల్పితముగా బల్కు జూడకు
సత్యమును నీశ్వరుడు నీచే
కల్పితులుగా సభను దోచిన
గాథ నిజమగు, నీవు యోగివి."

అనిన నర్తకి మాట కాతం
డనియె నిదినిజ మనుచు, సభికులు
మనమునన్ సందియపు సంద్రము
మునిగి తేలుచు నుండు వేళను

నటియు మరలన్ బ్రచ్ఛసేసె 'నొ
కటి మరి నిన్నడిగెదన్ ముని!
జటిల మది నీ యాత్మ శక్తిని
జయించంగల వారికెందును.

స్తుత్యమగు నీ శక్తి తోడుత
చూపలేవీశ్వరు నటంచన
సత్యమా? కల్పితుడు, కానన
జనులగా భావించితే? మము.'

శాంతుడై యోగీంద్రు డనియెను
"కాంత! ఈశ్వరు నమ్మ వాడే
శాంతుడై దగు నాత్మ శక్తికి
శక్తి యుండదు నాస్తికునకున్.

ఎవని యం దలరారు కల్పన
ఎఱుగు మాతడె ప్రభావితుడగు
అవని నిచ్చట చచ్చె గల్పన
ఆవరించెను నాస్తికతయును

అట్టిచో నీశ్వరుని నెఱిగెడు
నదియసంభవమగుట నిజమగు
ఎట్టి వారిట సత్యమీశ్వరు
నెఱుగరో వారలు వితండులు.

నాస్తికులలో నాత్మ శక్తియు
నాస్తియగు " నని యూరకుండిన
శాస్త్ర మొగమును జూచె సచివుడు
సైగ చేసె నృపాలు డతనికి.

అంత జాణక్యుడు ముదంబున
నరిగి విజయ కిరీట మానటీ
స్వాంత మలరగ దలను బెట్టి ప్ర
శాంతిగా నిట్లనియె నామెతో.

"నర్తకీ ఓ చిత్రలేఖా!
నాశుభాకాంక్షలను గొనుమా!
వర్తిలున్ జయమిప్పు నీయెడ
బహుమతి న్గొని వరలుమా

ఏది ఈతని యాత్మ శక్తుల
నిటు దురుప యోగంబు చేసెనొ
ఏది భ్రమలను దొలగ జేసెనొ
ఇచట సత్యము చూపితివిగా"

అనుచు మంత్రి కుమారగిరి గని
'అనుచితం బొనరించి నాడవు
వినుము దీనికి దండనీయుడ
వనుమతించితి జిత్ర లేఖకు.'

అనగ రక్తారుణ రుచింగను
నట్టి కనుగవ 'నిచటి సభలో
నను బరాజితు జేయగల్గెడు
మనుజు డొక్కండుండ బోడిల.

అంతియే గాదెవడు నాకిం
దింత దండన సేయు సాహస
వంతు' డని నిలబడియె యోగియు
స్వాంత మదిరెను సభకునంతన్

సభాస్థలిలో క్షోభ పుట్టెను
చాన యోగిని దరియ బోవగ
ప్రభుం డబ్బుర పడుచు జూడగ
వనిత యిట్లనె యోగివరుతో

'నీకు దండన నిచ్చు బాధ్యత
నాకొసంగిరి మంత్రి వర్యులు
నీకు దగుదును శిక్ష వేయగ
నేడు గను నా సాహసమ్మున్.'

అనుచు సభ్యులు విస్మితులుగా
తన కిరీటము యోగితలపై
దనర జేసియు కరధ్వను లు
ప్పొనగ మ్రోగగ నాట్య మొనరిచె.

ఒక్కపరి మ్రోగెను మృదంగము
లొక్క దెస వీణయును సన్నా
యొక్క వంక నటీ పదమ్ములు
టెక్కులను గురిపించె నంతట.

గతము మరచిరి సభికులందఱు
కాంత నృత్యము న మ్మనింగిరి
ప్లుతానందులు జనులు, హర్ష
చ్యుతుం డొక్కడె యోగి సభలో.

శిక్ష మరియు పరాజయమ్ముల
చింత సేయగ వలె నటంచని
ఆక్షణమ్మె కదలె యోగియు
నతని పై పెవ్వరును జూడరు.

## ౬. నిర్వేదము

యోగి యొక యేకాంతమున గూ
ర్చుండి చింతన సేయ దొడగెను
యోగమేమిది వింత యనుభవ
యుక్త మయ్యెనుగా.

మొగము కాంతి విహీనమయ్యెను
మొయిలు మనసున గ్రమ్మి మించెను
ముగుదతోనా యోడిపోవుట
పొగడె నా వనితన్.

ఊహసేయగ లేదు దీనిని
యోగి కపమానమ్ము జరిగెను
సాహస మ్మెంతటిదొ నారిది
చతురబుద్ధి గదా!

గణన కెక్కిన పండితులతో
రణమొనర్చి జయించి నాడను
గణికతో నొక నిండు సభలో
గొణగ వలసెనుగా.

అంధకారము విత్ప్రకాశము
నావరించుక విజితుజేసెడి
సంధికాలం బేర్పడెన్ ని
శ్చలత గలుగునెటుల్.

జయ పరాజయములను నెప్పుడు
సహజములె కా నిది విచిత్రము
జయము పొందిన దత్యుదారత
చాన సభలోనన్.

విజయ మకుటము తలను వెలుగుట
వింత యాతని కింత తెలియదు
నిజాలోచన పరుడుగా నుం
డిన కతమ్మునసే.

మదికి నది తోచుటయె తడవుగ
మరిగి భూమికి విసిరి కొట్టెను
మదిని గల యవమానభర మెటు
మరువ గల డతడున్.

ఇంతకాలము చేయు సాధన
మింత సంసారమును వదలుట
స్వాంతమున విజయమ్ము పొందగ
నైన నేమయ్యెన్.

దృష్టి ముకుటము పైన బడియెను
ధిక్కరించెడు కరణి తోచెను.
'కష్టపడకుము యోగి గెలిచితి
గాని యోడవు' నాన్.

దానిపై పొకసారి కదలెను
తడవు చేసెను దాని జూచుచు
దాని నంటగ నధికృతుండను
గాను నే ననుచున్.

కాని నాకిది యెట్లు లబ్బెను?
దేని నందఱు విజయ సూచక
మైన దానిగ నెంతురో? అది
తాను పొందెనెటుల్.?

కాని నర్తకి నను బరాజితు
గానొనర్పగ బదులు లొంగగ
నూనె గారణమేమి టన నే
నోడితిని గనుకన్.

చకితుడయ్యె గుమారగిరి త..
సన్నిధిని దల వంచుకొను న
ర్తకిని జిరునవ్వుల వెలార్చెడు
దాని గనుగొనియెన్.

'దుమ్ము గొట్టుకు పోవు మకుటము
తొంటి విజయము మదికి నచ్చక
వమ్ముగా బడ వేసినారే
భావ్యమిదియౌనా?'

మారు వలుకని యోగి గని యా
నారి మకుటము చేత గైకొని
'మీర లోడుట మిమ్ము గెలుచుట
కేరు సాధ్యులిలన్?'

అనుచు మకుటము యోగి తలపై
నునిచె వద్దన కుండె నాతడు
కనులు మూసియు జింతనంబున
మునిగి నెందులకో?

'ఏమి యోచించెదరు యోగీ!'
ఇందు ముఖి పలుకుల్విసెన్వడి
నామె జూచుచు నను బరాజితు
నాగదలతువుగా.

యోగి సంసారమును విడిచె న
యుక్త ధారణ సేయుచుంటివి
భోగభాగ్యము లంబులున్వలె
సాగు నాతనికిన్.

కాన నా కిపు డేల చింతయు
మాన మపమానంబు నొకటే
కాని చేసితివేల శ్రమపడి
మాను మీ పనియున్.'

అనిన నటి శాంతమున బలికెను
'వినుము నిను గెల్వంగ జాలని
వనిత గని యనుచితము లాడుట
భావ్యమయ్యెడినా?'

అన గుమారగిరి ప్రబుద్ధత
వనిత కరములు వట్టి 'కానిచో
ననుసరించెదు నీడ వలెన
న్ననుక్షణమేలన్?

నన్ను లజ్జితు చేయనెంచిన
యన్ను కత్తెవో?' యనెడు సమయం
బున్న వాడున్నట్లు వణకెడు
సన్నగా నెలమిన్.

కన్నులిద్దఱు కలిపి చూచిరి
కాని యోగిని మించి కాంత ప్ర
సన్నయై నిలుచుండి యుండెను
కనుల మద ముండెన్.

మందహాసము సేసి యనియె గు
మారగిరి తో నతివ, 'స్వామీ!
అందు గెలిచిన వాని కడ దీ
క్షాప్తి కరుదెంతున్.'

చైత్ర మాసము మలయపవనము
చంద్రుహాసము తారకావలి
చిత్రలేఖ కుమారగిరి కడ
రాత్రి నిలుచుండన్

యోగి కోపావేశ ముడిగెను
హోరకాలము శబ్ద రహితము
యోగి పలికెను 'సుందరీ! సరి
యూహ చేసితివా?'

"నాకడన్ దీక్షనుగ్రహించుట
నాగ వాసనలన్ ద్యజించుట
నీకు నచ్చని యకర్మణ్యాత
గైకొనన్వలె సూ!

ఆత్మహననం బనెదొ దేనిని?
అదియె చేయగ వలయు సతతం
బాత్మ దేహము తప్త మయ్యెడు
నదియు సమ్మతమా?"

అనిన మౌనముగా దలంచిన
వెనుక వెలది యబద్ధ మాడగ
వెనుక ముందై తుదకు పూనిక
ననియె నిట్లనుచున్.

'అన్నిటికి సిద్ధంబ యోగీ!'
అనిన "నిజమా? కాని సుందరి!
ఎన్నరానిది తప్పు చేసెదు
నిదియ నీ తరమా?

ఇందు మమతను మరచి పోవలె
ఎవ్వరును నిది చేయగలరే?
ఇందు ముఖి! ఇది కష్ట సాధ్యము
ఏల యీ వెతయున్?"

అనిన వనిత 'నిజమ్ము యోగీ!
అవశ్యమ్మది కష్టమైనను
విను మసాధ్యము కాదు గద నా
వినతి విని చెపుమా!'

సుందరిని నా పాద శీర్షము
చూచు యోగికి జిత్ర మయ్యెను
ముందు సభలో గనిన వేషమె
మూర్తి మత్వ మదే.

మత్తు గల్గగ జేయు కన్నులు
మదన మోహన రతీ రూపము
చిత్తు గొరెడు తనను ముందఱ
చిత్తొనర్చెడినో?

ఎన్నడును సౌందర్య మెంచని
కన్నులీనా డేమి కతమో?
అన్నకత్తెను గనుచు వణకెడు
నెన్న వింత యగున్.

మదిని యోచన సేసి పలికెను
"ముదిత! దీక్ష యొసంగదగునా?
ఇది విచారణ సేయ వలసెడు
నిప్పుడేమందున్."

నివ్వెఱంగున వనిత, "ఏమిటి?
నీవు నన్నిటు విశ్వసించవె?
నెవ్వగన్ నిను నీవె నమ్మవె?
నవ్వు కొందు గదా!

నాకు దీక్ష నొసంగ చింతన
నీకు నెటు దోచినను సరియే
నాకు జీవన్మరణ మియ్యది
నాకు బాధ్యుడవే?

జలము గల్గియు దప్పి దీర్పక
చలమునన్ మరణించగను ని
ర్జలముఖుం డఘ భాగధేయుడు
చనెడు యమ పురికిన్."

తరుణి వాదము యోగి హృదయాం
తరములో దుర్వాద మయి 'సుం
దరీ! వివరించెదను వినుమిటు
దాని కారణమున్.

మత విరుద్ధా లోచనోద్ధత
మతివి, తార్కిక గతివి, తన్మతి
హిత మనస్కవు నిన్ను మార్చగ
నేను లోగుదనో?

కావునని నే వెఱచుచుంటిని -
భావి నని తెలిపెను మనోగతి
ధీవిశాలత పిరికి తన మిట
తెలియ కుండగనే.

ఎట్టి దుర్గతి పట్టె దనకిల
నిట్టి మాటలు వెడలుచున్నవి
గట్టి తన మెటు వోయెనో? యని
కనలె నాతడటన్.

పలికె నటితో' సుందరీ! నా
పలుకుతో బనియేమి వెడలుమ
కలికి నాకొక కొంత కాలము
తలపు కొఱకిమ్మా.'

"మంచిదే వెడలెదను నాదగు
మనికి నీ మది దుఃఖ హేతువె?
అంచితమ్ముగ నెంతు వతివల
నంధకారముగా

మాయగా దలపోతు వతివను
మమ్ము మా వాదమును వెఱతువు
మాయ మయె నవి దీక్ష గైకొన
మది దలంచుటతో.

నెలత శక్తిగ, సృష్టిగా, సం
చలన కారిణి యోగ్యుడైనచొ
మెలత నాశన కారిణియె సు
మీ! యయోగ్యుడుగా.

బెగడు నెవ్వడు నాతి గనుగొని
పృథ్వినాత డయోగ్యుడయ్యెడు
తగండెందు నపూర్ణుడౌటను
ధాత్రి పిరికియగున్.

మంచి దిక నే పోయి వచ్చెద
మరలి రేపిటు వత్తు నిందుకె
సంచితాదర! నమస్కారము
చరణ యుగళమునన్."

హాయలు చిందగ మరలు తన్విని
నోర్పుతోగని, యోగి పిలిచెను.
లయల నొలికెడు నడలతో నా
లలన మరలె వడిన్

వెన్నెలన్ వెలిగించు సుందరి
కన్నులన్ మత్తిల్లు మదిరయు
నన్ను దనమును నున్న దనమును
కన్ను చెదిరించున్.

స్త్రీని మరి సౌందర్య మేటికి
సృష్టి జేసె విధాత? యనె హృది.
మాను మీ యోచనము తగదని
మందలించెమదిన్.

'ఏమి తప్పితి రేల పిలిచితి
రేమి' టని ప్రశ్నించె నర్తకి
'ఏమి నే దప్పిద మొనర్తునె?
ఎఱిగి పల్కితివే?'

అనిన యోగికి వనిత మ్రొక్కెను
"నను క్షమించుము, నా గురుండిటు
నొనరుచునె తప్పిదము యూరక
నోరు జారితిగా"

"ఔను, చేసితి తప్పిదమ్మును
నేను నిన్నటు పిలుచు టేటిది?
కాని పిలిచితి గనుక చెప్పెద
ఖూని యిటు వినుమా!

ఎన్ని విధముల జూచినను నీ
వన్నటుల దీక్షల నొసంగగ
ఖిన్నుడను, నా యం దసంభవ
మెన్న నిది తరుణీ!

నీకు దీక్ష యొసంగు టున్నను
నేను దీక్షను గొనుట యొనది
నాకయిష్టం బగును గావున
నన్ను వదలు నటీ!"

అనిన నర్తకి "యోగివర్యా!
అంతనాదే తప్పిద మ్మిట
వినుత గుణ! నీవే యశక్తుడ
ననిన నే మందున్?

ముందు నా జీవనముపై నే
మందు? నేమి ప్రభావమౌనో?
మందభాగ్యను, జీకటిని, వెలు
గంద గోరితిగా."

అనుచు డగ్గఱి యతని కరమును
హార్దికత పట్టెను దటాలున
అనుకొనని యీ ఘటనతో గం
పనము పుట్టెనుగా

"అసంభవమా మనదు సఖ్యత?
అవును నారిని నేను పురుషుడ
వసాధారణ యోగి నీ వొక
యాటకత్తియ నేన్.

నాది వాసన నీది సాధన
నాకు నీకును బ్రతిద్వంద్విత
మేదినిన్ గలియంగ బూనెద
మింక నతిసేతున్."

అనుచు బదముల వ్రాలె నర్తకి
వణకి యోగియు లేవ నెత్తెను
తన కరమ్ములు వనిత గురు కుచ
తల స్పర్శ గనెన్.

చెలువ పులకిత యయ్యె నైన వి
చలితుడై యు య్యోగి యుండెను
తలచె పేరర్థమును సతిమది
పలికె నాతండున్.

'నా పదమ్ముల నంటు దగునే?
నర్తకీ మణి!' యనిన సుందరి
'మీ పదా రాధకను నే'న ని
మెలత వడి వలికెన్.

ముఖములో ముఖముంచి పలికిన
ముగ్ధ ముగ్ధనొనర్చె నాతని
సుఖ విభూతి దురంత తేజ
స్సులు వెలార్చెనుగా.

కనులు కనులు సమీప మాతటి
కనుల దోతురు పరస్పరమే
వనిత మెల్లగ ముందు జరిగిన
వల దనం డతడున్.

కళాపూర్ణుడు కనుల ముందఱ
కానబడి యంధులుగ జేసెడు
కళావతి కనుదోయి యోగిని
గాంచి మత్తిలెడిన్.

వనిత దగ్గఱ కొలది యాతని
తనువు వణకుట మొదలు జరిగెను
వినియె నట గురుదేవ! యనునుడి
వెఱచి జరిగె వడిన్.

ముందు తోచె విశాలదేవుడు
మునియు నాగుకు వెఱచు వడువున
క్రిందు సేసెను దలను దొలగుచు
క్రిందు మీదయ్యెన్.

ఓడి పోయెను యోగి వర్యుడు
నేడు నర్తకి తోడ శిష్యుడు
చూడ, గన్నుల మండె గోపము
చుఱంచుఱం గనుచున్.

"ఏల యువకా! ఇట్టి సమయం
బేల నీ విటు వచ్చి నా" వన
"వేళ మీరిన గురుడు రామిని
వెదుక వచ్చి" తనెన్.

'హా విధీ!'యని నెలత గురునకు
ననియె' 'వెడలెదనో గురూత్తమ!
పోవుటయె కా దెల్లి వచ్చెద
పూర్ణ దీక్షగొనన్

నేను జన సందోహమును విడి
నిర్జన స్థలి గోరుచుంటిని
పూని మాయను వీడి బ్రహ్మను
లీనమగు తెరువున్

సమయ మిచ్చితి జింతసేయుము
చానపయి గరుణించ దగు వడి
క్రమముగా వాసనల గెల్చిన
క్రమము నే గంటిన్.

నాథ! యిందుల చింతసేయుము
బాధ ఏలిక? పోయి వచ్చెద,
బాధ తో, శ్రీచరణ యుగళికి
వందనము సేతున్"

అనుచు వెడలిన వెన్క యోగియు
నని యె శిష్యుడు మూర్ఖ డీవని
చనియె చంద్రుడు పశ్చిమాద్రికి
వెనుక దిగి యంతన్.

## 7. పరీక్ష

రాజప్రాసాదమువదలుచు వడి
రథము కదలి యతిరయమున జేరెను
బీజగుప్తు భవనమ్ము పదంపడి
శ్వేతాంకుని తో జేరు లోదడవు.

"శ్వేతాంకా! నీ వేమి చూచితివి?"
"చిత్తము స్వామిని యోగిని గెలుచుట"
"ప్రాతియె నీకిది?" "పరమ హర్షమగు"
"బాధాజనకమునాకు." "కారణము?"

"వింత తోచునా?" "ఎంతో మదికిని"
"స్వాంత మేడ్చెడిని స్వామి! కారణము
చింతజేసినను చిక్కదేమదికి"
"చిత్తగించు మనుభవ శూన్యుండవు"

"చిత్త మది నిజం బుత్తల పడియెడు
శ్వేతాంకుని హృదయం బిటు స్వామీ!"
"అత్తఱి నర్తకి గెలిచిన దంటివి
అబద్ధ మం దిద్దరు పరాజితులె"

"ఆశ్చర్యంబగు దేవ! నా కిటను"
"ఐన కూర్చొనుము" "ఆజ్ఞ చిత్తమిటు"
"నిశ్చలముగ విను నేడు యోగి దే
నికి పరాజితుండై చనెనో తుది?"

"ఊహ కందదీ యర్భకునకు" "విను
మోయి! సుందరీమణి గద నర్తకి"
"ఊహకైనరా దాసందేహము"
"ఉవిదవిదుషి గద!" "ఉన్నమాట ఇది."

"కుమారగిరి యోగ్యుడు యువకుడు గదా!"
"ప్రమాద పడ రేరీ విషయమ్మున"
"సమాను లుండరు సభలో నతనికి"
"సందేహమ్మే? సాధనమగ్నుడు."

"చిత్రలేఖ వాసనావేశయగు"
"చిత్రమేమి యిది యంద తెలిగినదె."
"ఆత్రపడకు, వీరహంభావులన"
"అంతకు వివరణ గోరుచుంటినిటు."

"ఇరువురు తమపై నమ్మిక గలుగుచు
దిరుగు రిది నిజమని యూహించితె?"
"ఇరువురి సాధన ఉత్తర దక్షిణ
ధృవములగుట పరిచిత మెల్లరకును."

"అదియే వారిద్దఱి హృదయమ్ముల
నాకర్షించుట కసలు కారణము"
"మదిని దోచ దది విరోధహేతువు
మారుచెప్పుటకు వెఱతు మీ యెదుట."

"దీనిపైన వివరించబూనుటకు
మానసమ్ము హితమెంచ దెందులకొ?"
"ఐన ఆజ్ఞ ఏమయ్యెడు నాకిల?"
"ఆమెకడకు జని యభినందించుమ"

"సాహస మ్మనుచు స్వామిని దలచునొ?
స్వాంత మందు నన్నేవగించునో?"
"ఊహలేల? గమనించు మాస్యకళ
ఓయి వటుడ! నాకోరిక దీర్చుమ."

ఈ సంభాషణ వెనుక వటుడు చనె
ఇందు ముఖీ భవనమ్ము చేరగా
దాసి యొకతె యుపవిష్టుల జేయుచు
దర్శన మిచ్చెను వచ్చు వారలను

ఎల్లరామె కభినందనలీయగ
నేతెంచిరి, నర్తకి యనుపస్థితి
ఎల్లవారి మది కలవర పరచెడి
ఎంత రాత్రి యని వేచి యుందు రటు.

వటు నచ్చుట కూర్చొను మన నాతడు
ప్రశ్న చేసె, "దేవెపుడు వచ్చు"నని,
"కటు ప్రశ్న సేసితిరి తెలియ" ననె
కదలిరి వచ్చిన వారందఱు వడి

అర్ధరాత్రి గడువంగ జొచ్చినది
ఐన జాడ కనిపించ దాయమది
వ్యర్థుడుగా జనలేక కూర్చొనియె
వటుడు మందిరాభ్యంతర సీమను.

విసుగుచెంది వెడలగా దలంచెను
శ్వేతాంకుడు ద్వారమున రథముగని
ప్రసభానందముతోడ స్వాగతిడె
ప్రమద ప్రమదయై పలికె నాతనితొ.

"ఇంత రాత్రి నీవిట రా హేతువు?"
"ఏమి లేదు, మిమ్మభినందించగ"
"ఇంత గొప్పపని యేమి చేసితిని?"
"ఏమి చెప్పు దా యోగిని గెలుచుట"

"ఏమి నీ కదియ హర్షమయ్యెనా?"
"ఎంతో చెప్పగ జాల నంత" యన
కామిని ముఖము వికాసము తొలగెను
కాంచె వటుడు తొలిసారి యామెనిటు

"అభినందన పాత్రమ్మనుగానిట"
"ఆశ్చర్యము! జేతలె పాత్రులుగద!"
"సభికులెంచినను సత్య మోడితిని"
"సందేహించెద చూచుట వినుటను."

"ఏల నీకు సందేహము? చెప్పెద
ఏడ కేగితినో ఎఱుగు దేని పుడు?"
"లీల నేనడుగ నెంచి మానితిని"
"ఏల? "మీరు నా స్వామిని యగుటను"

"కుమారగిరి కడ కేగి వచ్చితిని"
"కోరియింత నిశ గడచు దాకనా?"
"క్షమార్పణమునే గోరి వచ్చితిని"
"క్షమయా? చేసిన తప్పు గుర్తెఱుగ"

"నీకు జెప్పు టుచితంబు గెలిచినది
నేనుగాదు, విపరీత తర్కమున
నాకుమారగిరి నిరుత్తరుండై
నాడు కాని నా డోడుట గా దది."

"ఈ మాటయు విపరీత వ్యాఖ్యయె?"
"ఏమి? తృప్తి గల్గుట లేదా మఱి?"
ఏమనంగలను? విదుషి మీరు.' 'నా
కిందు నీవు కల్పించకు మున్నతి.

"నిజము నేను గల్పించున దేమిటి?"
"నేను విజయినని తలచుటయేగద!"
"విజయి విజయిగా వినుతి తప్పగునె?"
"వినుము నిజము పరికించగ వలయును

విదుషి గాను మదమత్త శరీరను
విద్వాంసుల మధ్యను జనగూడదు."
"విదుషాంవరుల బురస్కరించు టిది
విజ్ఞానమ్మగు మేలుసెబాసిది."

"నేను చేసినది జగతి మెచ్చినను
నిక్క మాత్మ దుఃఖించుచునున్నది
తాను యోగి ఘనశక్తి యుక్తుడగు
తా గల్పించెను సత్య మీశ్వరుని.

కాని దాని కల్పన యసంభవ
మ్మోను మౌనులకు దప్పియన్యులకు
పూని పూనకము గలిగి వాని నవ
మాన మానసుని జేసినాను గద!

వ్యక్తి యొక్క యుత్కృష్టత ఖండన
వలనగాదు మండనమున గలుగును
రక్తి నాశనము వలన గలుగ దను
రక్తు చేయుటను గలదు తెలియు మిది.”

“మానవులను భ్రమ పెట్టు శక్తి నవ
మానపరచినను దోసంబగునా?”
“మానవీవు తర్కంబు చేసినది
మాత్ర మేను తప్పించు దలంచెద

దీనియొక్క పరిణామము మాత్రము
మానక నాకనుభవమున దప్పదు”
“దీని విపరిణామమ్మె? అదెట్టిది?
దేవి!” “నికటుభవితమ్మున దెలిసెడు

కాని భోజనము చేసి యుంటివా?
నేను చేయగా లేదు కైకొనుమ
దీని” ననుచు మధువిచ్చె వటునకును
తాను త్రాగిన పదంపడి వడిగా

ముందు త్రాగు నలవాటు గల్గుటను
ముందు వెన్కలాడడు శ్వేతాంకుడు
ముందు సంగతిని జ్ఞప్తి చేసికొని
ముగుద మదికి ముద మొదవగ దగునని.

“స్నేహశీల నగు దేను నీ పయిన
నెయ్య మన్న మది దాచ గూడ దిక”
“స్నేహమేమి? నా సహానుభూతిని
చెడనీయను నీ కడ” ననె వటుడున్.

"బాసచేసి చెప్పెదవె నీనుడిని?"·
'బాసయేమి తలగోసి యిచ్చెదను?'
"నీ సహాయమున కాస పడితినే"
"ఆస యేల? యాదేశించుట సరి"

"వినుము నేటి సభ యోగి పైన నా
విజయము గాదది విజితనైతి నా
మనుగడన్ జెడు ప్రభావితజేసెను
నను గుమారగిరి వినుత శక్తితో"

అచ్చువడియె శ్వేతాంకుడు, తనతో
తేడు చెప్పినది తోచె నిప్పు డని
వచ్చితి జల్లకు ముంత దాతునే?
ప్రశ్న సేతునని యడిగె నెట్టు లని

"ఎట్టు లందువా? ఎఱుగకుంటివే?"
"ఎట్లు తెలియు నూహించుట తప్పగు"
"చట్టు గురుని మతి నూహించును గద"
"స్వామిని వగుదువు భావ్యముగాదిల"

"కుమారగిరిపై ప్రేమ గలుగు నా
కును నాతనికి యుగాంతర సంబం
ధముగా దలతు" 'నదెట్లూహించితి
తరమా మాకిది?' యనె శ్వేతాంకుడు.

"నేటి సభను నా కుమారగిరితో
మేటి పండితులు గెలువగలిగిరే?
మేటి యయ్యొ నందఱ సమ్మోహుల
మేకొని చేసెను నన్ను తప్పనిల"

"ఏమి కారణము?" "ఆతని నెఱుగుదు
నెఱుగు నతడునను, నెన్నో జన్మల
ప్రేమ బంధమున మెలగిన వారము"
వినుచు నుండె శ్వేతాంకుడు నమ్మిక

"ఎన్న డాతనిని జూచినానో నా
కెన్నరాని యాకర్షణ కలిగెను
మున్నెఱింగెద మహాత్ముగానతని
నున్న మాట వచియించెద ప్రియుడగు."

"ఏమి సహాయము చేయగల్గుదునో
ఏర్పరింపు" మను నంతట దాసియు
స్వామినికిని శ్వేతాంకున కందుల
పళ్లెములం దాహారము తెచ్చెను.

దేవ్యాదేశము గొనె శ్వేతాంకుడు
దివ్య భోజన మొనర్చి రిర్వురును
నవ్యోత్సాహము తోడ వటుని గని
నర్తకి యిటు సంభాషణ మొదలిడె.

"నాకు సహాయం బొనరించుటకై
నీ కేమియు నడ్డంకు లేదుగద"
"నీకే కాదేరికి మాటిచ్చిన
నే గలలో జవదాటని వాడను."

"నమ్మమందువా? నా మనోగతం
బిమ్ముల దెలుపకు బీజగుప్తునకు
నమ్మిక రా బల్కుమి ఛేదిల్లిన
నా యభిమత మిది నడపగ గలవే?"

శ్వేతాంకుం డాలోచన మునిగెను
చేతగాని దిది చేయక తప్పదు
నైతికముగ వీరలు యజమానులు
నమ్మిక మోసము సేయగ దగునా?

చిత్రలేఖ శ్వేతాంకుని భంగిమ
చేత వెఱగు పడి చేతికిచ్చె మధు
పాత్రను, దటుకున త్రాగి వేసె ని
బ్బరమున నిల్చెను నారీ సన్నిధి.

"మా ప్రార్థన నంగీకరించుటకు
మనసొప్పదె నీ కో శ్వేతాంకా!"
అప్రాకృతు బలె నిలిచిన వటుగని
యతివ బలికె క్రోధోగ్రముఖమ్మున

"నేను నీకు యజమానురాల నా
నియమిత కార్యము నీ చేదగినది
కాన చేయు" మన చిత్తమ్మనుచును
పూని పలికె శ్వేతాంకుడు తృటిలో.

"నేను సేవకుడ, నీ పూజారిని
నీ వాక్యము శ్రుతియగు నా యెడలను
నేను నీకు నమ్మకముగ బలికెద
నీచుడ గా నిటు ద్రోహము సేయగ."

"వెంటు రావలయు విధి గలదా?" యన
"ఉంటి విస్మృతి విహీన వశుడనై
తొంటి వోలె వెడలెన్ వటు డంతటు
తొయ్యలి తొంగొన బోయె లోనికిని.

అధ్యయన గృహమ్మున కరుదెంచియు
అధిపుని జింతా మగ్నుని గాంచెను
అధ్యయనం బొనరించ లే దతని
యందీ భావము వటు డేనాడును.

మదిరా రిక్తత పాత్ర కనుల బడె
మది చింతా సాగర మగ్నత గనె
మృదు శీతలతా పేక్షిత వన భూ
మెదిరె వేడి వడ గాల్పుల కలిమిని.

ప్రశాంత మానస సరో మధ్యమున
పరిఢవిల్లె నా వర్త గర్తములు
నిశాముఖేన ప్రకాశభాతిని
నీరు గారె సామంతు ముఖాబ్జము.

వటుని గాంచి నిద్రను విడు చందము
తటాలునన్ "వచ్చితివే? తడసితి
విటు లేటికి?" నన నిరుత్తరుండై
వటుడు శీతజల మొకింత ద్రావెను

సమాధానమున కొలస్యంబయి
సంభ్రమంబు గలుగన్ సామంతుడు
"సమాధానమున మౌన మ్మేటికి?
సత్వరమ్ము కారణము తెలుపు" మనె

"ప్రతీక్షనిలిచితి జిత్ర లేఖకయి"
"ప్రతీక్షయా? ఏమంటివి?" "నిజమిది"
"సతీగృహమ్మును జేరు నెడల ని
చ్చలు నర్తకి యట లేదటుందువా?"

బెదిరె వటుడు మది దోచె బ్రతిజ్ఞయు
"ఇది నిజంబు, లే దతివ గృహంబున"
"విదితమె నీకెటు వెడలి యుండునో?"
"విదితమయ్యె జాణక్యుని పిలుపని"

బరువు దించు కొనినట్లు నృపాలుడు
శ్వాసవిడిచె దూషించె మనమ్మును
తరుణి కుమారగిరిన్ గన బోవుట
తలచి యుండుటకు దన భ్రమ తొలగగ.

"చిత్రలేఖ నభినందించితివే?
శ్వేతాంకా!" "చిత్త మ్మిది వినుమా!
పాత్రను గాననె నభినందన కిల"
"పడతి వింతగా బలికె నేమిటిది?"

"అంతగాదు గర్వించదింతయును"
"అది యాయమ గంభీరత తెలుపును"
"వింతయగును దుఃఖమ్మగు నం"చన
"వెనుక నేను జెప్పిన దింకేమిటి?"

"ఇద్ద ఱోడి రని యుంటిరి మీ రటు"
"ముద్దరాలి యోటమి తెలిపితిగద"
"ఇద్ది నన్ను సాలోచను జేసెడు"
"నిందలి మర్మం బెఱిగించెద విను.

స్వయం విచార ప్రజ్ఞ గల్గియును
పరిస్థితికి దాసుడు ప్రతిమనుజుడు"
"స్వయం వ్యక్తుడై దాసుండెట్లగు?"
"పరిస్థితులు జన్మాను బంధములు."

"పరగ వాని దప్పించుట యెట్లగు?"
"వరల నిమగ్నుడు గాని వాడెయగు
పరిస్థితుల చక్రంబున బడినను
గురుతు తెలియవలె గర్తవ్యమ్ముల"

"మీ రనునది వివరించగ గోరెద
మీరను మీరను మానము దీర్చిన"
"నారీతిలకము పరిస్థితులలో
నంబడె యోగియు జిక్కె నంతటను

కుమారగిరి నటి జీవన ఘటనన్
బ్రమాదపడు, నటి యోగి ఘటనతో
సమాను లిర్వురు పతనావస్థకు
సాధనలో భ్రష్టులుగా దలచెద."

"అగణిత మగు మీ యూహా శక్తియు
దగుదు రీరు నిజమెంచి కీర్తిగన"
"భగవానుడు సాయం బొనరించుత
పడతి కెయ్యెడల పరమ యోగికిని

శయనించుద" మని చేరిరి వారలు
శయనాగారంబున సామంతుడు
అయోమయపుటాలోచన మాణవ
కాగ్రణి యంతికమున శయనించెను.

## 8. పారదర్శనము

వాత్యారంభ ప్రథమ దశా
వార్ధి స్థితి నిస్తబ్ధత యలమిన
అత్యంతం బుత్తలపడు హ్రాది
యందీ విశ్వ విలయ మగు శంకన్.

ప్రచండ వేగ ప్రభంజన
ప్లవితవీచికా విప్లవ గీతుల్
విచిత్ర గతి నర్తన విధి త
ద్వీచీవిలసన విలయ ఘోషలున్

నభో మధ్య జ్వాలాముఖియు
విభేదిల్లు నెడ విస్తరిల్లెడిన్
ప్రభూాత దమితా శాంతి భయ
ప్రతీక వహ్ని జ్వాలలు లయమున్.

సాయం సంధ్యారుణ సమయ
స్థాయి దినకరోష్ణ తాప ముడుగన్
రేయి దిరుగ సామంత రథా
మేయత నొప్పెను రాజమార్గమున్.

పుష్ప హారముల లావిక లా
భూషణ గతి సామంతుల దీర్చిరి
పుష్పసువాసిత శీత రసా
పూర్ణ పాత్ర ధనికుల చుంబించెను.

రాజవీథి జన సంకులమై
రాజిలె నుత్సవ మనెడు చందమున
బీజగుప్తుడా జనతతిలో
నోజ దిరుగు చుండెను గుతుకమ్మున

శ్వేతాంకుడు తానును జనగా
సిద్ధమగుట రథమొప్పెను బయటన్
స్ఫీత విచారము గనె నతడున్
చేరె నటీరథ మను సడి వినుచున్.

బీజగుప్త ననుపస్థితితో
బెగ్గడిలెను శ్వేతాంకుడు మదిలో
"రాజముఖీ! వచ్చితి విపుడే
ప్రాప్తం" బనుకొని బయటకు వచ్చెను.

"ఏమి యాజ్ఞ దేవీ!" యనగా
"స్వామిని గన వచ్చితి నిపు డతడున్
లేమిని దోచెడు చింత లేదు"
"ఏమీ?" "నిన్నలు వంగ వచ్చితిని."

"మీ యనుగ్రహము వింతగదా!
మీ యందెప్పుడు దాసుడు సిద్ధుడు"
"నా యం దశాంతి ప్రబలుటచే
నడచితి జన సముదాయత దిరుగన్"

"ఒకటి సాహసించెద నడుగన్
ఒంటరి దిరుగ నశాంతి పోవునా?"
"నికటమ్మున సామంతుడు రా
నేనెంచితి నీవుంటివి గాదా!"

మంచిదనుచు జను వటుని కరం
బంచితముగ నటి పట్టి నిలిపి యనె
"కొంచె పడకు నా రథ మునసే
కూర్చొని రావలయును నీ వీతటి."

మంత్ర ముగ్ధవలె వటుడు నటీ
మణీ రథంబున కెక్కి నిలుచుచున్
యాంత్రిక గతి సారథియై పే
నదలించెను ఘోటకముల నతడున్.

రాజమార్గమున జేరువయై
రాజనర్తకియు బగ్గములు గొనెన్
రాజులనే ఆడించు నటీ
ప్రాభవ విదితగతిన్ వాజులు సనె.

ఆమె చెలువ మారామసుధీ
స్థేమము దామములయ్యె రాజులకు
ఆమె నాట్య వైదగ్ధ్యమె సూ
హాయి నింపె మనసుల నెల్లరకున్

ఆమె యెదురుగా నెదురగ దత్
భూమి పతులు తమ రథముల నిలిపిరి
సమస్త జనులభివాదములన్
సంస్తుతింప మది మెచ్చె నర్తకియు.

వెంటను శ్వేతాంకుని గనుచున్
వెక్కిరించ దొడగిరి జనులెల్లను
వింటి ననుట తోచగ నటి న
వ్వెను ముభావమున వారలు గనగా

ప్రతి సామంతుడు హారముతో
వణల జేసె నా చిత్ర లేఖ నిల
కృతార్థు లైనటు లెంచి రటన్
కేవల భవాని యను నటు లుండెన్.

రాజమార్గమున నర్తకియున్
రాజిలు టాళ్ళ ర్యమ్మను సడి వినె
బీజగుప్తుడొక రథము పయిన్
తేజో మూర్తిగ నిలిచె నంతటన్.

"వింత యయ్యెనా మదికి నిలన్
బీజగుప్తు డింటను లేకుండుట"
ఇంతి పలుకు ప్రత్యుత్తరమా
నెంతో గూఢత వారే తజ్ఞులు

"స్వాగతమో తరుణీ! నేడున్
సమ్మతమా? మా యింటికి రాగా"
"స్వాగత మొప్పదె చిత్రలేఖ
సరస బీజగుప్తుండిడుదానిని."

అనిన బీజగు ప్పుడును దా
నాయమరథమెక్కెను, వటుడాతని
పనుపున దద్రథమెక్కి చనెన్
వనితారథమల్లన గొన సాగన్.

"దేవీ! నీ యాగత వేళన్
దెలివ! యింత లేకుండుట గుండెద"
"ఈ విచారమది యేల మదిన్
రావలసిన కాలమునను రానిది

నాయది తప్పగునన మౌన
స్థాయిని మించిరి వారలు తడవై
కూయని కోకిల పికములుగా
కొంతకాల ముండిరి నిశ్చేష్టత.

"కతి పయ దినములనుండి మదిన్
కనలుచుంటి, గారణ మజ్ఞాతము
సతి! నిన్నడిగెద రాకుండన్
కతమే మింతటి దాక నీకిలన్?"

'కారణమా? రాలేక పోతి
నైరాశ్యము నిండెను నా మదిలో'
'నైరాశ్యమునకు గారణమున్
గోరగ నధికారము గలదెపుడున్'

'అధికారమ్మా? అచ్చెరువౌ
ఆవంతైనను నెఱుగ నైతినే'
'అధికారము లేదా నాకున్?
హార్దికతత్వ మెఱింగిన వానికి'

'ఎఱుగనేను మానవుపైనన్
మరొక మానవుని యధికారమ్మును'
'గుఱుతున గారణ మడిగితిగా
కోర్కి తీర్పుటది భావ్యంబయగున్

ఉద్వేగితమౌ నామదియున్
ఓహో! మరచితి నన్నిట నన్నిటి
నుద్వేలంబగు నది నాకున్
హోరను నా మదిలో సుడియై"

ఇంతలోన రథ మరుదెంచెన్
కంతుని భవనము గా వెలుంగు సా
మంతుని భవనము సన్నిధికిన్
మాటలలోనే వచ్చిరి వారలు.

వెడల బోయె బయటకు చెలియున్
శ్వేతాంకుడు వారలలో జేర్చుచు
పుడమి వల్లభుండాపెను గా
పోవలసిన పని లేదను చంతట.

ఉవిద పలికె నా భూపతితో
'నుండవలయు పని యేమిలేదుగా'
"జవరాలా! ఆతండుండన్
చయ్యన హాని యొకింత లేదుగా.

అంతేగా దాతని లాభం
బెంతయొ గల దింతీ! విను మిప్పుడు
సుంతయేని యనుభవమ్ము తో
చును వానికి నీ విషయము వినగా"

అనుచు వాని మది రందించన్
పనుపు చేసె నా బీజగుప్తుడును
తన మది నాలోచనల గుమిన్
తడబడి తే నరిగెను వటుడంతట.

అభ్యస్తంబగు కార్యముగా
నవలీలగ జేయగ ముదమందిరి
సభ్యతగా దన కిచ్చుటచే
సరగ(తావి దూరమున కూర్చొనెన్.

బీజగుప్తుడారంభించెన్
వెలదిపైన ప్రశ్నలు గురిపించగ,
రాజముఖియు సిద్ధంబయ్యెన్
ప్రత్యుత్తరముల నందజేయగా

'దేవీ! విస్మృతి యంటివిగా'
దేని వలన? తత్కారణమేమిటి?
'ఈ విశ్లేషణ తగు పనియా?
ఇంతి మనో వృత్తికి పరీక్షయా?'

'కాదు, కాదు ప్రార్థించితిగా
కాదే జ్ఞాతము మీకును సైతము
లేదొకింతయును, ఐన విచి
త్రోదంతమ్మిది చెప్పగ లేనిటు.'

శ్వేతాంకుని గనె నటి, అతడున్
స్థిరముగ గూర్చొని యుండె, భూపుడున్
నాతిని గని 'యసమర్థవుగా
నా ముందట దాచగ వలసెన్నద.'

'దాచుట యేమిటి? యున్న దిదే'
'తరుణీ! మారెను నీ హృదయంబిల
తోచెడు నాభాసత నదియున్
తొంటి యఘమ్మిది యేమి చేయుదున్'

మదిర కొంత మరి త్రాగగనే
మగువ పల్కె "సామంత నరపతీ!
ఇది సహజము గద మారుటయున్
విదితముగా బరివర్తిత జగతిని."

బీరిపోయె నిస్తబ్ధుడయెన్
బీజగుప్తు డీయుత్తర మెంచడు
"మారి పోవునే జగతి వడిన్
నారీమణిలో నాపై ప్రేమయు?"

పెదవి జారుటకు మది గలగెన్
ముదిత యెంత పొరపాటొనరించెను
మదిరా మత్తత తొలగిచనెన్
మదినెమ్మదిగా నిట్లని పలికెను.

"కాదు, మిథ్య మీ యనుమానా
కాశము నిస్సీమ మ్మగునదియును
యాదోనాథుని గభీరతా
హ్లాదిత మీ నారీ ప్రేమంబును.

అది మారుటయు నసంభవమౌ
నయిన నొకటి తలచెద నమ్మె దమది
అది మాత్రము పరివర్తనయే
ప్రధాన శీలముగా గల దెన్నడు.

ప్రకృతి భావమే ప్రేమ గదా!
ప్రకృతి నియమములు పరివర్తితములు
ప్రకృతి శక్తియే ప్రేమ పయిన్
ప్రభావ ముంచుట నీవెఱుంగవా?"

కటువైనను సత్యంబెంతో
కలికి పలికె, దగు సమయములోనన్
పటుతరోపయోగం బిదియే
పారిపోవు నటి తనను వదలుచున్.

అదృశ్య శక్తి యెదో కలిగెన్
సుదృఢమనస్కుల వేరుసేయగా
సదృశ స్థితి తొలగుట తోచెన్
సరవి నగాధము కనులకు దోచెను.

"పొర పడెదవో చిత్రలేఖా!
గురి తప్పకుమా ప్రేమను తెలుపగ
చిరముగా నది యాత్మతోనే
చేరి యుండు ప్రకృతిని చేరదుగా.

ఏది ప్రకృతిని గలియునో మది
యెంచుమి వాసనగా నద్దానిని
కాదనగలమే బాహిరమై
కాయమునకు దగు కర్మమగున్ గద."

"ఆత్మ తోడిదే ప్రేమసుమా!
అది శరీరమున గలుగ దెప్పుడును
ఆత్మమారునది కాదు గదా
అమర మగును తత్సంబంధ మిలన్."

చిరునవ్వున నావెలది యనెన్
"చిత్రము బలికితి బీజగుప్త! వే
మరణింతురు పుట్టిన వారల్
మరణములేనిది పుట్టుక యుండదు.

చింతసేయగా దెలియునుగా
సృష్టి యెక్కడో విలయ మక్కడని"
"వింత అమరమే కాదదియున్
విను మాత్మయు పుట్టదుగా నెపుడున్.

పుట్టుక లేనిది చావదుగా
పుట్టుక లేనిది ప్రకృతి కాదుగా
పుట్టె వానిపై ప్రేమ యనన్
పుట్టుక కలుగుట యొకటే కాదా?

సంబంధము శాశ్వత మగునా?
సరవి నెక్కడనో ఆగిపోయెడిని
సంబర పడుటయు క్షణికమెగా
సకలవాసనలు పిచ్చి పనులుగద.

పిచ్చి తొలగుటే ప్రేమ కదా!
ప్రేమ యెపుడు గంభీరత చెలగును
పిచ్చి వాడవై యాత్మయనన్
ప్రేమ బంధమని భ్రమ పడుచుంటివి."

చిత్రలేఖ తార్కిక శక్తిన్
చెదరి పోయె నా బీజగుప్తుడును
ఆత్ర పడుచు నసె "నటీమణీ!
అంతయు సత్యము పలికితి వొప్పెద.

ఇది నీ విశ్వాసంబగుటన్
ఇంత చెప్పినను యుక్తమే యగును
ఇది విను, వాసన ప్రేమములన్
విదితముగా నున్మాద జ్ఞానత.

ఉన్మాదం బస్థాయి గదా!
సన్మతి యే చిర మ్మైయుండునుగా
సన్మతి లోపంబగు నయినన్
సరవి నాశనము కాదు గదా భువి.

ఉన్మాదము వేసిన ఘాతన్
సన్మతి లుప్తం బగునది వోయిన
సన్మతి చిరమ్మై వెలుగు గదా!
సత్యమిద్ది గుర్తించిన క్షేమము.

జ్ఞాన మమరమ్మై యుండినసే
సరవి ప్రేమ యమరంబగునెపుడున్
జ్ఞానం బమరము నాబుద్ధిన్
సత్ప్రేమయు నా కరణీయె నాకున్."

అర్ధని మీలిత నేత్రములన్
అర్థవంతముగ నర్తకి చూచెను
"వ్యర్థముగా భ్రమ పడితినిగా
వల్లభ! నన్నిక మన్నన సేయుము."

అనుచు గౌగలించెను సతియున్
అటులె వటుడు చూచుచు నిలుచుండెను
'వినుమోయీ! శ్వేతాంకా! యిటు
వెడలుము రథమును సిద్ధము చేయుము.'

## 9. సంచలనము

మృత్యుంజయుడను నార్య శేష్ఠుడు
వృత్తి బ్రాహ్మణుడు జన్మక్షత్రియుం
డత్యంతం బేకాంతము గోరెడు
నట్టివాడు జనక ప్రతి మానుడు.

త్యాగశీల సుగుణోత్తరుండు, స
న్యస్తాత్మసుఖా ప్రతిమ ప్రభుడున్
భోగవైభవాభోగభాగ్యు డత
డౌ గణనీయుడు సామంతులలో.

సభాస్థలిని ప్రత్యేకాసనమున
సన్నివిష్టుడగు, సమస్త జనులును
ప్రభూతభక్తి ప్రచురత గొలుతురు
ప్రబలాత్మబల ప్రాభవు డాతడు.

వయోవృద్ధుడగు మృత్యుంజయునకు
వయస్కయగు నొక కూతుయశోధర
అయస్కాంతమగు చూచు వారలకు
హాయి నిచ్చునది నెంచు వారలకు.

అష్టాదశసద్వసంత పోషిణి
హార్దికతా పరిపూర్ణ వచస్విని
కష్టనికృష్టార్ద్రిత సుమనస్విని
కరుణా పూర్ణ విలోక తపస్విని.

అగాధ సంపద కఖిలాధీశ్వరి
అమలిన శృంగారాబ్ధితలోదరి
ప్రగాఢ జనక ప్రేమామృతఝరి
పరిఢవిల్లు ముక్తా ఫలసుందరి.

ఆర్య శ్రేష్ఠానంద విహారిణి
ఆకర్షిత పురయువక గ్రామణి
హార్యక్ష ప్రతిమాన గభీరిణి
అమాయికాత్మాభరణ శ్రీమణి.

చంచల దృగ్వ్విజితాఖిలహరిణీ
సంకోచాకుంచిత కపోలినీ
చంచల చంచత్తనూవిలాసిని
సరసమధురమ్మృదు తరళ సుహాసిని.

కనకశలాక లతాలలితాకృతి
కాయోత్థిత లావణ్య భరప్లుతి
జనక హృదయ సకలాశా విస్తృతి
సత్కవి సన్నుత స్రష్టృ మహత్కృతి.

ఈ దృశ కన్యామణికిని వరు న
న్వేషణ చేసెడు మృత్యుంజయుడును
తాదృశగుణ మణిగణఖనిగావలె
దన కోరిక దీరుట మది నమ్మెను.

బీజగుప్తుడాకర్షింపంబడె
వృద్ధుని మృత్యుంజయుని మనమ్మున
రాజసమ్ము గలవాడు, మాధురీ
రాజిత సువచోభాసురు డాతడు.

పుంసాం మోహన రూపుడు, వనితా
పుణ్యఫల ప్రాప్తుడు సుఖభోగ రి
రంసుం డరుణ ప్రదీపు డుజ్జ్వల
రాజు బీజగుప్తుడు సుగుణోదధి.

యశోధరను ప్రేమించెడు వారలు
యశస్తిలకు డా బీజగుప్తు నప
యశంబుగా కీర్తింతురు నర్తకి
యం దాతడు లగ్నంబగు నంచును.

మృత్యుంజయుడా మాటలు పెడచెవి
నెల్లవేళలను నుంచుటయే గా
దత్యంత మ్మనుభవశాలి కదా!
హర్షించడు వారల హిత వాక్యము.

ఉన్మాదపు కాలంబిది యాతని
కున్నది భవితవ్యము ముందెంతయొ
సన్మతి ననుభవ సాగరమగ్నత
చతురుడౌ ననుచు సన్నుతి సేయును.

బీజగుప్తు డాహ్వాన పత్రికను
విప్పిచూచి యాశ్చర్యంబందెను
పూజనీయుడా మృత్యుంజయుడే
పొగడి పిలిచె దన నుత్సవమునకును.

పుత్రికా మణీజన్మదినోత్సవ
మునకు బిలుచుటకు మించు వింతమఱి
చిత్రలేఖయును దనతో రాగా
జిత్రమగును పిలువంబడియుండుట.

యశోధరను దానెపుడు చూచెనో
అబోధబాలవయః కలితుడుగా
యశోధనుని మృత్యుంజయు పిలుపే
యాశ్చర్యము తనవంటి వానికిల.

"ప్రియా! ఎఱుగుదే మృత్యుంజయనృపు?"
"వింతయేమి? పరిచితుడెల్లరకును"
"అయారె! ఆతని కూతునెఱుగుదే?"
'ఆఁ! కనియుంటిని యొండురెండెడల.'

"ఆహ్వానించెను మృత్యుంజయుండు
యశోధరా జన్మోత్సవమునకై
విహ్వాలింతు పరిచయ రహితుండను
వింత తోచె నా మంత్రణ పొందగ.

ఇంతకన్న మఱి వింత కలదు నా
చెంతన నీవటు కాహ్వానితవై
తింతీ!" యన మీ పలుకుల యర్థం
బేనటు వచ్చుట యనుచితమని కా?

"కాదు చిత్రలేఖా! నాద్వారా
కా దంతియు నావెంటనెరాగా
నాదునీదు సంబంధము పూతము
నాఁదలచు సమాజం బుచితం బిది."

కొంత మౌనమున బలికె గాంత "శ్రీ
మంతుల నుచ్చకులోత్సవముల న
త్యంతము నర్తకి గతి నభ్యస్తను
కొంతయైన గౌరవమును బొందెద.

కులీన యువతుల కలిసిన నవమతి
సలుపుదు రని యాశంకించెద మది
కలిగిన యవమతి కేమి సేతునో
తెలియ జాలనొక పరిహారమ్మును."

"నమ్మము నాతో నుండు తరుణమున
నహి -యెవ్వని కా సాహస మొనర్చు
దమ్ములు" వెనుకకు బలికె వటునితో
త్వరగ రథ మ్మాయత్త పరచగా.

ముప్వురు మృత్యుంజయు నింటికి జని
రివ్వలనే యెదురయ్యె వృద్ధు చిరు
నవ్వున స్వాగతి నిడె, యశోధరయు
జవ్వని కంతటు, వటుడును నడిచెను

నృత్య భవనమున బ్రవేశించు తటి
నిండె నచటి సభ్యుల కోలాహల
మత్యంతముగా, యశోధరయు నటి
యతివల కడ, వృద్ధునితో నాతడు.

చిత్రలేఖ ఆశ్చర్య చకితయై
చెలగి యశోధర గాంచి, యేలనన
చిత్రలేఖ యతిలోక సుందరిగ
చింతించును సతతం బిదివరలో.

యశోధరా సౌందర్యము గాంచిన
యంత దూరమై పోయె గర్వమును
ప్రశాంతిగా నాసనమున గూర్చొన
రాగిల దెంతయు దోపనీయ దది.

జంటగ వా రిర్వురు నొకచోటున
యుంట నోర్వలేకుండిరి యువిదలు
తొంటి నాట్యమును దాన గాంచినది
తోచి కలియ దృష్టిని గనె గన్యక.

చిత్రలేఖ నలువైపుల గాంతలు
చేరి గుంపులుగ గుజగుజవోయిరి
చిత్ర చిత్ర సంభాషణ గొందఱు
చిత్రలేఖ నిర్లిప్తత నుండెను.

ఒక సామంతు తలోదరి పలికెను
"ఓహో! నర్తకి చిత్రలేఖ! మా
మక సమాజమున సమత పొందుటకు
ప్రకటముగా నభినందించెద" నన

"సౌందర్యబల స్ఫోరకతాగతి
స్వాగత మేమిటి? సేవలు గొనగల
సుందరాంగి కభినందన లేటికి?
సుదతుల తలదన్నగ గలదానికి."

ఎంతకటువుగా ప్రశ్న యుండెనో
అంతకన్న గటువయ్యె నుత్తరము
కాంతలెల్ల రొకరొకరి మొగమ్ముల
గాంచి వెలవెలయి పోయిరి క్షణమున

ఈ ప్రసంగముల బురుష పుంగవులు
వించుక చలించ బీజగుప్తుడును
క్షిప్రమె యటకేతెంచి, 'ఏమి ట'నె
'చిరుహాస్యం' బని పలికె నర్తకియు.

ఉద్ధతి యడంగి యుత్తరక్షణము
యోషముగంబున శాంతి యంకురిలు
పద్ధతి కబ్బురపడిన యశోధర
పలికె "భగిని వ్యవహారకుశల" యని

"అందులకే నే(ప్రభావశాలిని
నై జీవించగ గల్గుచుంటి" ననె
అంత యువకులా బీజగుప్తునితో
స్వాంత మలర బాడగ వాంఛించిరి.

వీణగైకొనుచు బీజగుప్తుడును
వేడ్క పాడె వాగీశ్వరీస్తుతిని,
వీణయశోధర కీయబడగ ద
న్వీమణి వాగీశ్వరిపై బాడెను.

కల్యాణీ రాగము నాలాపన
గావలె నని యెను చి(త్రలేఖయును,
కల్యాణీ స్వరభరిత వీణపై
కాంత యశోధర యాలాపించెను.

సభికులెల్ల హర్షధ్వని చేసిరి
సంతృప్తిని (బకటించె దం(డియును
రభసమ్మున నా చి(త్రలేఖయును
అభినందించెను యశోధరను వడి.

"చి(త్రలేఖ! నేధన్యవాదములు
చెప్పెద నాకూతురి పక్షమ్మున"
చి(త్రలేఖ చిరునవ్వు నవ్వె లే
చెను సామంతుడు నటితో బలుకగ.

"మీ నృత్యము దర్శింపగ గోరిక
మెత్తురె యామోదింతురె వినతిని?"
'ఆనయగును నాబీజగుప్తునిది
యాకాంక్షయు (ప్రార్థన యన నేటికి?'

మృత్యుంజయుడును వీణగైకొనియె
మృదంగమును నాబీజగుప్తుడును
నృత్యం బారంభించె దలోదరి
నిండె ముద మ్మందఱిమనములలో.

చిత్రలేఖ తన ప్రజ్ఞ చూపెడిని
చిత్రములై ప్రేక్షకులు వెలింగిరి
ఆత్రపడుచు నొక ప్రతీహారి "యొక
డాగమించెముని కుమారగిరి" యనె.

మృత్యుంజయు డాతని దోతేరగ
మెఱపున బోయెను వీణప్రక్కనిడి
నృత్యంబాగెను, లోనికి వచ్చిరి
నిలిచి రందఱాయోగి సమక్షము.

బీజగుప్తుతో నర్తకి పలికెను
వెడలి పోద మవమానము జరిగెను
"రాజముఖీ! ఏ దవమానం బిట?
"రమణా! కళ కున్నతి నేనిచ్చెద."

"కాదను వాడెవడీవిషయమ్మును?"
"కళ కవమతి గావించిన మనుజుడు
కాదు, పశువు" "ఎవరిక్కడ? దేవీ!"
'కళా పశువు మృత్యుంజయుడ కదా!'

"ఉత్తమ వీణా విద్వాంసుండగు"
"ఉచిత రీతి సత్కార మెఱుంగడు"
"నృత్తమాగుటకు జింత సెందితే?"
"నిలుచుట తగదీ చోటు పాయుదుము"

నీ చిత్తం బన జిత్రలేఖయును
నిలిచె యోగి సన్నిధి నతమస్తక,
లేచి "పోయి వచ్చెదమృత్యుంజయ!
లేమ కోర్కి కనుమతి దయసేయుమ."

మృత్యుంజయునకు మున్నుమారగిరి
మెలతగాంచి "ఇదియేమి? నర్తకీ!
అత్యరుచికరంబా మదుపస్థితి?
ఔను, స్వభావ విరుద్ధము గాదిది."

కొంత సేపు నాలోచన చేసియు
కాంత పలికె, "యోగీ! తలచకు మఱు
కొంతవేరు కారణము పోవుటకు"
'కాంత! నీవు పోదలచ ననుచితము'

"ఐన నుందు" నన మృత్యుంజయుండు
అందుకొనెను వీణను, నర్తనమున
కూనదు నర్తకి, యశోధర వడిన్
బూని నాట్యమును కోరె వినతయై

యశోధరా ప్రార్థన చే నర్తకి
యాటకొప్పె నాకుమారగిరియును
యశోధర చిత్రలేఖల పైపే
నిశితముగా గని బోల్పగ దొడగెను.

ఇద్దఱు నుచ్చస్థితి గల సుందరు
లిద్దఱిలోపల దోచు భేదమును
కద్దు చాల పోలికయును నర్తకి
కలదు మాదకత, శాంతిని కన్యక.

నృత్య సజీవ ప్రతిమయె నర్తకి
నీరధి గంభీరతను యశోధర,
మత్య మరాధిప గురువౌ నర్తకి
మత్యమాయికా మంజు యశోధర.

జీవన సంక్షోభమ్మగు నర్తకి
చిత్త శాంతి మృత్యుప్రదకన్యక
భావవీచికా జలధి నటీమణి
భావుకభావాతీత యశోధర.

కుమారగిరి కొక యనుభవ మయ్యెను
ప్రమాదమున దా సంసారమునన్
సమాకర్షణము చెందుట తోచును
సమాప్త మయ్యెను నాట్యం బప్పుడు.

భోజన శాలకు వెడలి రందఱును
పూర్ణ ముదంబున గూర్చొని యుండిరి
బీజగుప్తుడెస యశోధరయు నటి
వినోద వార్తా లాప మొనర్చిరి.

"యశోధరా! మీ పరిచయ మబ్బుట
కభినందింతును నేటికి ధన్యుడ"
"యశోధనా! నా పరిచయ మంతగ
నభినందన పాత్రమ్మన వింతగు."

"ఈ పరిచయము ఘనీభవించి యా
త్మీయ బంధనముగా రహి గాంచుత"
ఈ పలుకను నా చిత్ర లేఖ గనె
కృతజ్ఞతాకుల యశోధరవడిన్

కౌతుహలమున బీజగుప్తు డ
క్కాంత మొగంబును జూచుచుండె, నా
శ్వేతాంకుండు యశోధర గాంచెను
వెంటనే వటుని గాంచె యశోధర.

ఇంత వరకు శ్వేతాంకుని జూడని
యింతి యశోధర విస్మయ దృష్టుల
కొంతచూచి ప్రశ్నించె నృపాలుని
గూర్చి ఈ యువక నవ్వ డెవ్వరని.

'నాసేవకు డాత్మీయ సోదరుడు'
నాగ 'ఎట్లు సేవకు డనుజుండగు?
వాసి కొఱకు బల్కుదురె మీర లిటు?'
"వాచిలేను మొగమేను దానికయి.

ఇతడు క్షత్రియుం డిద్ధగుణుడు, భూ
పతి కులీను డమలవ్రతు డుత్తమ
హిత చరిత్రుడఖిలాగమ వేద్యుడు
ధృతి శ్వేతాంకుడు నాగ బిలువబడు.

ఇతనిగురుడు పాపాభిజ్ఞతకై
అతుల రీతి వదలెను నా కడనే
నితని ప్రపంచాభిజ్ఞత సమాజ
మెఱుక జేయు చుందును పదపదమున"

వింత యశోధర ప్రశ్న సేసె 'నో
బీజగుప్త! పాపాభిజ్ఞతకై
చెంతజేర్చెనా? గురుడీతని నీ
యంతిక మఘ సంవేద్యస్థలమా?'

అమాయకత గల యశోధరను గని
హసించె మనసున బీజగుప్తుడును
సమాధానమున సందియ ముడుపుట
చతురుకృత్యమని పలికె నీగతిని.

"పాపి పాపి యని పాపిని బలుకడు
ప్రతి వ్యక్తి తన పని మంచిది యను
పాపిననుచు శ్వేతాంకుడు తలచిన
పాపి నౌదు నిక్కంబిది వినుమా!"

విచలిత యయ్యెను యశోధర, ఎవనిని
వేడ్క తలచి నంతన బులకితయగు
ప్రచురత నాతడె పాపపరిచయా
స్పదుడౌనని గుఱుతున గురుడెంచుట.

శ్వేతాంకుని దెస గనెను యశోధర
వింత యెంత నిశ్చలు డమాయికుడు
స్మిత సుందరుడు యువకుడు కానీ
బీజగుప్తుడో? అనుకొనె నంతట.

భోజనములు పరిసమాప్తమయ్యెను
పోవుట కెల్లరు నుద్యమించగా
బీజగుప్తుడా మృత్యుంజయునకు
శ్వేతాంకుని పరిచయ మొనరించెను.

హర్షమొందె మృత్యుంజయు డందఱ
నానందముగా వీడ్కొలిపెను సం
ఘర్షణ రేగెను యశోధర మదిన్
కదలి రతిథు లంతట గృహములకై.

## 10. మనోనిశ్చయము

అనావశ్యకాతిథులు వెడలగా
నతిముఖ్యులు కొలువై యుండగనే
మనోమోదమున మృత్యుంజయు డనె
మహితు బీజగుప్తుని కై బట్టుచు.

"సామంతా! ఓ బీజగుప్త! ఈ
సంబరమున నొక రహస్య మున్నది
ప్రేముడి దానికి నీ సంబంధము
పేర్కొన ఘనిష్ఠమై యొప్పునుగా."

అని యశోధరా బీజగుప్తులను
నర్థపూర్ణ దృష్టిని గని పలికెను
కనులలోన దద్విచార సరళిని
గనుపడ నీయడు సామంతుం డటు.

"ఆశించెద మృత్యుంజయు పల్కుల
కస్వీకృత విపరీతోత్తరగతి"
"ఆశయేల? విషయాను షంగ మది
అడిగిన ప్రశ్నను బట్టి యుత్తరము."

"బీజగుప్త! నీ వివాహ విషయము
వేడ్క నడిగెదను వినిపింతువా కో?"
బీజగుప్తుడా చిత్రలేఖగని
"విధి వద్వివాహవిధి గాలే" దనె

కుమారగిరి గొబ్బునసె పల్కె" "ఓ
కుమార! శాస్త్ర విహితముగ వివా
హము జరుగుట పొసగునె?" యన నాతం
డాశ్చర్యముతో ననియె యోగికిని.

"స్త్రీ పురుషుల చిర సంబంధమ్మె
చెలగు వివాహాభిఖ్య జగమ్మున"
తాపసి నవ్వుచు, "వివాహ శబ్దము
తా నిర్మించె సమాజము మున్నిల

ఆస్త్రీ పురుషుల సంబంధమ్మును
అతి పవిత్రమొనరించుచు మన్నన
శాస్త్ర మొసంగును సమాజమ్ములో
సత్య మర్థ మాధారము గొంటివి?'

"యోగి రాజ! సత్యము పూర్ణంబగు
యుక్తసమయ మిది గాదు వాదనకు
ఆగియుంటి నేనందు కొఱకు సూ"
అనుచు పలికె మృత్యుంజయు గనుగొని.

"ఆర్య! నావివాహము శాస్త్రీయ మ
టంచు చెప్పలే దే నిసు మంతయు
కార్యమిపుడు మీకును స్పష్టమ్మును
గాగ, లౌకికముగా ననుద్వహుడ.

కాని వాస్తవమునకు వివాహితుడ
నేను, పత్నియగు చిత్రలేఖ, నా
కూని పాణి సంగ్రహణ శాస్త్రవిధి
గానులేదు, సాంఘిక నియమంబున

ప్రేమపైన విశ్వాసము గలుగుట
పెండ్లియగుట నా కసంభవమ్మగు
ఏమి కతం బన జిత్రలేఖనే
ప్రేమించెద నితరుల బ్రేమించను."

ఈ మాటల ననునెడ సామంతుం
డెత్తడు తల చింతను మునింగెవడి
సామముగా నాతని గదిలించగ
చతురత మృత్యుంజయుడనె నట్టుల.

"సామంతా! నీ మాట లుచితములు
సమాజ మవివాహితుగా దలచిన
ధీమంతుం డవివాహితుడే యగు
తెలిపెద దద్విధి నవసరమగునని.

పుత్రోత్పత్తికినై యుద్వాహము
హొసగు నవసరంబగు విను మియ్యది
చిత్రలేఖ సంతానము నీ కను
చిత ముత్తర కర్మాధికారముల.

ఆలోచించితివే యిది యెపుడే?"
ననిన నిరుత్తరుడయ్యె నాతడును
ఆలోలాక్షి దెసంగని వృద్ధుం
డనియె "జిత్రలేఖా! విదుషివి గద!

నీతో నెక్కువ పలుకనేల? నీ
వీతని గూర్చిన చర్చ సేసితివె?
ఖ్యాతి గలుగు నర్తకివి గతాగత
కర్మల బాధ్యత బూన దలతువే?"

"ఆర్య శ్రేష్ఠుని పలు కుచిత మ్మగు
నగుదు నర్తకిని సంఘచ్యుతనై
ఆర్య బీజగుప్తున కర్ధాంగిగ
అసంభవమ్మిది యతని మేలుకై

బీజగుప్తునకు మేలగు కర్జము
వేడ్క సేయుదానను, మీరెఱుగరె
పూజనీయు? లిద్దానికి త్యాగం
బును జేయగ వలె నేను నిశ్చితము"

కుమారగిరి చిరునవ్వున బలికెను
"సమాధాన మతి విచిత్రమైనది
ప్రమాదపడితిని త్యాగంబనుకొని
పలికితి విరాగిగా జీవించగ.

త్యాగ మంటి వది యిపు డావశ్యక
మాగరీయమొ నాలోచించకు"
యోగి మాటలకు బీజగుప్తుడును
యోచన వదలి తటాలున బలికెను.

"యోగిరాజ! విశ్వసింతువేని వి
రాగ మ్ముపదేశింతువె యొకరికి?
భోగిని నన్బంధనముల జిక్కగ
పూన్కి వదలు టిది న్యాయంబగునా?"

నావుడు "నీవు విరాగ యోగ్యుడవు
కావు కావుననె యుపదేశించను
ఏవిధి నిట్టి సమాజనియమముల
కే విపరీతము చరింప గలవిక.

కనీస మీవు సమాజపు నియమము
లను బాలించుము మేలు నీకగును"
విని సాలోచన చిత్రలేఖ యనె
"విప్రవరా! దయ సేతురె దీక్షను?

మీరు దీక్ష నొసగంగ నొప్పునెడ
మీర మీ యెడల బల్కు పల్కులను
మీర లింతటితో శిష్యగ నెంచుడి
మీరతుల మహాత్వమ్మును జూపుడి"

విశాలదేవుడు కుమారగిరియును
వీక్షసేసి రొకరొకరి ముఖమ్ముల
విశాల యోచన యోగి పల్కె "నో
వెలదీ! దీక్ష యొసంగుట జరుగదు"

కిలకిల నవ్వుచు జిత్రలేఖ వడి
పలికె యోగితో "చెప్పుట యెప్పుడు
సులభమె కానీ చేయుట దుష్కర
మలఘు మహాత్ములరగు మీకైనను.

నాకు గఠినమగు విరాగ మనునది,
నాస్థితి యింతటి దా కనురాగము
లోకము దానికి నపవిత్రత యిడ
లోకు వగునె ఈశ్వరు, నా సన్నిధి.

ఆక్షేత్రము విడనాడి విరాగము
నందు దగుల్కొన పాపముగాదా?
నాక్షేత్రము నాకెపుడు పవిత్రము
న న్నపవిత్రగ లోకు లెంచినను."

మాట కుదిరి మఱి బెడిసె నంచు సా
మంతుడు మృత్యుంజయు డనుకొనె మది
మాట చెడుచు మఱి బాగుపడేనని
మఱిమఱి తలచెను బీజగుప్తుడును.

ఎఱుగు యోగి యా చిత్రలేఖ నటు
లెఱుగు నర్తకియు యోగి పుంగవుని
ఎఱుగుదు రా శిష్యులు వారిర్వురి
హిత సంభాషణ గలుగు రహస్యము.

ఒకతె యశోధర యోచన మునిగెడి
నొకటి బోధపడ దొకటి తోచ దటు
ప్రకటు పరిచె దంద్రికి నిశ యగుటను
భామ లిద్దఱను గాంచె వృద్ధుడును

దైవీ రాక్షస శక్తులు శాంత్యు
న్మాదము లగుదురు భామ లిర్వురును
భావుకుడైన పరిస్థితి వశ్యుడు
పరమ మానవుడు బీజగుప్తు డగు.

మృత్యుంజయు డానెలత గనుచు ననె
"మీ క్షేత్రం బపవిత్రత బలికిన
వ్రాత్యుడెవడు? నీ యిచ్ఛకు వచ్చిన
పగిది నడచితివి ప్రేమా పూర్ణత.

ప్రేమ పవిత్రము పెండ్లి పవిత్రము
ప్రేమించెడు వా డవధి దాటినను
ప్రేమకు సార్థక మేది జగతిలో
ప్రియునెడ నీకర్తవ్య మిది గదా!

ప్రేమలోన ద్యాగం బవశ్యకము
బీజగుప్తుకయి నీత్యాగం బిటు
ప్రేమ మీర నది మహత్కార్యమగు"
వెలది పలుకు నెడ బీజగుప్తు డనె.

"ఆర్యశ్రేష్ఠా! చిత్రలేఖతో
ననదగినది కా దీవిషయ మ్మిట
కార్యము కలియుట చెడగ కారణము
కలదు బాధ్యతయు నా పక్షమ్మున

చెడుట చెడక యుండుట నా బాధ్యత
చిత్రలేఖ సంబంధము పవిత్ర
మడుగడుగున వచియించెద నమరము"
అనుచు నడచె నా బీజగుప్తుడును.

చిత్రలేఖ మృత్యుంజయుతో నను
"చిత్తము మీరను మాట మహాశయ!
చిత్రలేఖ చేయునది తనకు గా
దాత్రపడకు డార్యుని కై చేసెడు.

బీజగుప్తుడుత్తమ వరుడు సుమా!
వెలయు యశోధర కనుగు భర్తగా
బీజగుప్త! ఈ సుందరి తగినది
పెండ్లి చేసికొను టుచితం బియ్యది."

అప్పటికే ద్వారము కడ జేరిన
యట్టి బీజగుప్తుడు, "తగదిది నీ
విప్పటికే బహు భాషలాడితివి
ఎఱుగ జెప్పలేనిది నిజమగుగద.

వెడలుదు"నని యా బీజగుప్తుడన
వెలది నిలిచి వృద్ధుని తో బలికెను
"పడుచువాడు పల్కిన నలుగకుమా?
పటాపంచలావేశత జ్ఞానము.

నమ్మ బలికెదను బీజగుప్తునకు
సమ్మతి యశోధరా కన్యకకును
నిమ్ముల సంబంధము యుక్తమ్మగు
నిది కలుగుట కందఱ కానందము."

శ్వేతాంకునితో జిత్రలేఖ యా
బీజగుప్తు ననుగమించె నంతట
చేతము లెల్ల విషాద సంగతిని
చెలగగ మృత్యుంజయాదు లుండిరి.

వారలు బయటకు వెడలిన తదుపరి
పరిస్థితి సమీక్షించెను వృద్ధుడు
కోరిన దేమిటి? జరిగిన దేమిటి?
కొంతయైన మది దోచదుగా.

మౌనముడిపి మృత్యుంజయు డనియెను
"మౌనిరాజ! ఈప్రసంగములతో
మానినీ ప్రభావము సామంతుని
పైన మహత్వ సమన్వితమైనది."

"నిజమే నర్తకి హృదయము స్వచ్ఛము"
నిలిచె మౌని నిర్భర మౌనమ్మున
గుజగుజలాడెను గురు శిష్యుల కను
గొలకులు చిరునవ్వులు ప్రకటించుచు.

"బీజగుప్తు బలవంత పెట్టుటయు
పెండ్లి కొఱకు నుచితం బగునా మఱి?
బీజగుప్తుదెస చిత్రలేఖ తన
విధి పలికినగతి నడచు కొనినచో

మరల దోచు వదలుట యుక్తంబని
తరుణి మనసునకు నాఘాతంబగు
కరణి హృదయ మాశంకించునుగా
కర్జమేమి? వివరింపు యోగివర!"

'మది కాఘాతం బిది యబద్ధమగు
మగువ తానె విడ దలచె మున్నె మే
లిది యాతని గతి మారుట యుచితం
బెంచెద వారలు పాసి పోవుటయె.'

పోవలేచి ముని పలికె 'యశోధర
పుణ్యము పండును బీజగుప్తుతో
వైవాహిక గతి నుత్తమ వరుడగు
వచ్చెద' నని వడి నరిగె యోగియును.

## 11. సమీక్ష - దీక్ష

చిత్రలేఖ తన జీవన మందున
చింతించెను ప్రేమకు వ్యాఖ్యానం
బాత్రపడుచు దన నిర్ణయ మింతకు
నబద్ధమగుటను గుర్తించెను దుది.

మొదట తాను ప్రేమించిన ప్రేమయు
ముగుద ఈశ్వరీయముగా దలచెను
హృదయ పూర్తిగా భర్తను గొలిచెడి
నిద్దఱి కొకటే బ్రతుకని తలచెను.

పతికొఱకే తన బ్రతు కను కొనుటకు
బ్రతిగా బతియే సర్వస్వమ్మనె
పతికై నవ్వుట పతికై పలుకుట
ప్రతిక్షణము పతికై సమర్పితము.

పతియె సమస్తము పతియే దైవము
పతియె యుపస్థితి పతియే గతియగు
పతిప్రేమలో వరలు సుఖమ్ముల
ప్రతి లే దాత్మ నివేదన తృప్తియు.

ఆత్మనివేదన యందలి సుఖమును
హాయి జీవనా మోదము దెలియగ
ఆత్మనివేదన పరులకె శక్య
మ్మగును జన్మ సార్థకత వెలుంగును

భర్త్రృ మరణమున నంధకారమ్మై
బరువై పోయెను విశ్వవిశ్వమును
భర్తకొఱకు దన తపమ్ము సాధన
వ్యర్థమైన యను భవమ్ముతోచెను.

ఆత్మహత్యకై పురి కొల్పెను హృది
హాయి యనుచు ననిపించె గాని మఱి
ఆత్మహత్య పాపమ్మని యెఱిగిన
యతివ గనుక నుద్యమము మానుకొనె.

హితులు తపమ్ము ప్రధానాంగమ్మగు
బ్రతుకున, విధవకు సంయమ సాధన
హితమని పలికిన నదియు నొనర్చెను
సతికది కఠినమ్మై తనరారెను.

పతిజీవించిన యంతకాలమును
పడతి యొనర్చె దపమ్ము పూజలును
బతికేంద్రకమ్మై ప్రవర్తిల్లుటను
బరిఢవిల్లె నవి క్రమబద్ధముగా.

కేంద్రము విచ్ఛిన్నం బైనంతనె
సాంద్ర సాధనా పటిమ సన్నగిలె
మంద్రమయ్యె విశ్వాసము తన్మయ
మందు విచలితస్థితి చెలువారెను.

పిదప జేరె గృష్ణాదిత్యుండా
వెలది ప్రేమ కాధారభూతుడై
ఇదిదైవికమును గాక ప్రాకృతిక
మిందు భక్తి లే దాత్మ విస్మరణ.

ప్రేమలోన దా లీనమౌట కా
దీ మహి ప్రేమికుతో ననుబంధము
ప్రాముకొనుటయే, వాని ప్రేమలో
ప్రథమముగా గనుగొనెను బిపాసను.

పిపాసయొక్క మహత్వం బెఱుగమి
పిదప నెఱిగె ననుభవసారమ్మని
తపించె నుద్వేగమ్ముల భయపడి
తానే సుఖముగ తనివి చెందినది.

ప్రేమ భక్తియని నమ్మిన భామిని
ప్రేమ బంధమని తెలిసెను కామిని
ప్రేమ యిద్దరికి సంబంధించిన
విషయ మ్మని గుర్తెఱిగె దలోదరి.

పరమ పవిత్రాత్మీయ బంధమే
పరగు ప్రేమ, కంపనయు పిపాసయు
పరమముగా మది నాత్మవిస్మరణ
పరిఢవిల్లెడు నతృప్తి నిలయమై.

ఇరువు రాత్మ బలదాన మొనర్చుట
ఎంచ ప్రేమనా జగతి బరగెడిని
కరుణ కురియ నమృతో పమానమై
వరలువారి జీవన మధుకలశము.

కృష్ణాదిత్యుడు మరణించగనే
క్షీణించిన దా వనిత మానసము
తృష్ణతోడియా ప్రేమ యెన్నటికి
మృత్యుంజయ మిల గాదని తలచెను.

కృష్ణాదిత్యుని మధురక్షణములు
స్మృతి పథమ్మున దుమారము రేపు స
హిష్ణువుగా నర్తకి గా మారెను
హేలనగా దోచును జీవన మిల.

చిత్రలేఖ జీవన పథమందున
చిత్రముగా జేరెను సామంతుం
డాత్రపడుచు నాయమ పిపాసలకు
నాత్మ విస్మరణ కంకిత మయ్యెను.

ప్రేమలోని మత్తతను గ్రహించెను
శ్రీమనోహర విలాసము గాంచెను
భూమి నఖిల భోగావళి జూచెను
బాగడె వాని రూపాతిశయమ్ముల.

ప్రేమ యొక్కటే కాదు లక్ష్య ము
ద్వాని కొన్ని దినంబులు సుఖమిచ్చును
ప్రేమ చిరముగా నాత్మవిస్మరణ
విధిగా మదిరా సేవన గలుగును.

మదిరా సంసేవత జగత్తు సే
మరచె, మరచె సకలమ్మును సంతత
మదిరా మత్తాక్షి భ్రమణమ్ముల
మది దామత్త భ్రమర మ్మయ్యెను.

తదుపరి కుమారగిరి యువసుందర
తజ్ఞత... మఱి యూహించ నశక్తత
మదిని దద్గాకర్షణ కారణముల
ముదిత సమీక్షించెను చింతించెను.

ప్రత్యేకాలంబితప్రేమము లవి
వ్యక్తినిష్ఠతాన్యోన్యపరోక్షము
లత్యంత మ్మిది ప్రత్యక్షమ్మగు
నందులకే సాహసమున జడిసెడు.

మృత్యుంజయు భవనోత్సవ మందున
మెలతకు సమధిక సాహస మబ్బెను
మత్యంతర్గతమందు విచారము
మరగి మరగి యొక నిర్ణయ మలరెను.

బీజగుప్తు సుఖిగా జేయుటయే
వృత్తి తనది, జీవన సార్థక్యత
నోజగోరి త్యాగమ్ము సేయవలె
నుపాయ ముత్తమ మైనది దొరకెను.

గజిబిజి యాలోచనలను గడచెను
కడమరాత్రి కనుమూత వడదు మది
గుజగుజపోవును దనలో దానే
కొసకు బొడుపు సంజను నిదురించెను.

మానసికాలోచన సంఘర్షణ
దానవియ్యై నిశిరాత్రి వెంటబడె
గాన నిద్ర కవరోధము కలిగెను
కాని లేచు సరి కయె మధ్యాహ్నము.

"బీజగుప్తు విషయం బేమేనియు
వినబడెనా" యని దాసి నడుగ "నో
రాజముఖీ! లేద" నిన బదంపడి
రక్తిని స్నానమొనర్చి సిద్ధపడె.

సకలాభూషణ సమితిని దీసెను
చయ్యన గాషాయ వస్త్ర మూనెను
బ్రకటముగా భోజనమును మానెను
రథ మరుదెంచెను బనుపు తక్షణము.

పత్రమొకటి పే వ్రాసి దాసితో
పలికె "నేడు సాయంతనమ్మైనను
చిత్రలేఖ నీ కగుపించనిచో
చేర్చుమి దీనిని బీజగుప్తునకు.

కొంతకాల మిది వదలుచుంటి నో
కాంత! వింతగా నెంచకు మిది నీ
వంతకాల మధికారిణి వస్మత్
హర్మ్యసురమ్య సమస్త సంపదకు."

అరదము కుమారగిరి కుటికరిగెను
తరుణి దిగుచు సారథితో ననె నిటు
"పరువడి యామము వేచి వెళ్లు మిక
వత్తు" ననుచు లోనికి జనె సుందరి.

ధ్యానావస్థితుడైన మౌని గని
యతివ నిశ్చలముగా గూర్చుండెను.
కాని యామ మొక్కటి కడచుటతో
మౌని వదలె దన సమాధి నంతట.

కనులుదెఱచి చూచుటయె తడవుగా
కనులు మూసి కల కాంతను జూచెను
గనులు చెదరె నాతనికి 'ఏమిటిది?
కనుట సత్యమా? కలయా? వింతగు.

ఎంతటి విభవోన్మత్త సువేష, య
దెంతటి యాహార్యక రమణీయము
కాంత యేమిటిది? కాషాయాంబర
శాంత వేష లోలుపత వచ్చినది.

నిజమేనా? ఈ కాంత వేషమును
నే(భ్రమలో నిటు చూచుచుంటినా?
నిజవైభవ సంపదలను బాయుచు
నిజముగ రా గలుగునె యీ సుందరి?

ఏ యుద్దేశ్యము తోడవచ్చినది
హేలగాదు సర్వస్వత్యాగము
మాయయే పరంజ్యోతిని జేరగ
మాయవేషమున వచ్చిన దేమో?

కావి గుడ్డలను కాంత యంద మం
దావిర్భవమగు నెంతో శాంతం
బీ విశాల దృక్పథమెటు లబ్బెడు?
నీవిడ నిట మాటాడించెదనా?

"నర్తకీ!" యనెను ధీరముగా ముని
నటి కన్నులు తెఱచెను దటాలుమని
"పూర్తి యయ్యెనా సమాధి? గురుదే
వునకు భంగమేర్పడెనె? నావలన."

"దేనికి వచ్చితి వీవు నర్తకీ!"
"దీక్ష పొందుటకు వచ్చితిదేవా!"
"నేను నీకు దీక్షను నొసంగుటకు
పూనిక లేనని ముందే తెలిపితి."

"కాని నేను త్యాగం బొనర్చితిని
నానిఖిలైశ్వర్యమ్మును నే డిట
కాని మమత్వము శేష మ్మున్నది
దానివదల్చుట మీ భార మ్మగు."

మృగాక్షికన్నుల ముందు వణకె ముని
"మృషయిది నాతోగాని పని నటీ!
నగుబాటగుదును నీకు దీక్ష నిడ
నగునా నాకియ్యెడ దలోదరీ!

నీకు దీక్ష నిడు టునగా బతనము
నేలలేని పాతాళము దాకగ
నీకు నాకు నంతరము నెఱింగెద
నిజముగ నీహృదయంబు చిత్రమగు.

నిను నే లేపుట కఠినము సుమ్మీ!
నేను క్రింద బడుటిది సులభమ్మగు"
ననుచు నిలిచి మతిచలించు చందము
వెనుక ముందు లా కుటిలో దిరిగెను.

చిత్రలేఖ మౌనమున గూర్చొనియె
"చెప్పుము నిజమో చిత్రలేఖ! స
ర్వత్ర జ్ఞానాపేక్ష వచ్చితివె?
వైభవమునకు దిలాంజలి నిజమా?

ఇది సంభవమా? నిజము చెప్పుమా?
ఏల మౌనమో యింతీ!" యనగా
ముదిత ముదిత మానసమున బలికెను
మునికి శాంతమున మునిగి మునుకలిడ.

"యోగీ! మీరొక మారు జయాజయ
యోగమందు నిజమూని పల్కితిరి
భోగినైన నిజమిపుడు చెప్పెదను
పూని మిమ్ము ప్రేమించ వచ్చితిని."

"నా యనుమాన మబద్ధముగామికి
నర్తకి! చెప్పెద ధన్యవాదముల
నాయందీవు నిజమ్ముగ ప్రేమా?
నాతోనా? యీ జడదారినిగా

ప్రేమ తెలియ ప్రేమించుట తెలియని
విచిత్ర మానవు నను ప్రేమించితె?
ప్రేమ యెట్టులగు? ప్రేమ పుట్టునని
వేద్యుడ, కలుగుట తోచుట తలతును."

పకపక నవ్వేడు కుమారగిరిలో
వ్యంగ్యాత్మకత విరాజిలుట గని
చకితయైన నర్తకి "యోగీశ్వర!
ప్రకటముగా దిచ్చుట మీ భావము.

ఏను మిమ్ము ప్రేమించితి నెఱుగుదు
రీరు మున్నె బహునాళుల ముందే
కాన వచ్చితిని నను ప్రేమించుట
కర్తవ్యమ్మగు నిజమును బలికితి."

"నీవు నన్ను ప్రేమించెదవామది?
నేను నిన్ను నాటంకపరచ నిక
జీవి యెదుటి ప్రేమకు నాశించుట
చెల్లు సఫలతకు చేష్ట యనధికృతి."

చిత్రలేఖ వెలవెలయ్యె మొగమున
చెలగె క్షణము సవరించుక యించుక
గాత్ర మపుడు గంభీరత పలికెను
కాంత కాంతమగు మధుర స్వరమున

"నిజము చెప్పితివి యోగి పుంగవా!
నేనీ సారియు దప్పుబలికితిని
నిజముగ దన్విని, తనివిని దీఱని
నిండు ప్రేమ దాహమున వచ్చితిని

ఎవనినేను ప్రేమించి యుంటినో
యువతశించు తచ్చరణ ధూళి తల
సవదరించ మీలో మునుకలు గన
జనుదెంచితి నే దృష్టి చెందగా.

సేవయు శక్తియు నాత్మవిస్మరణ
చెలగు నతృప్తత చిరప్రేమలో
నా వివాహ సమయమున గాంచి తిది
నే విశ్వాసావరణములోపల.

కాని యట్టి యావరణములోపల
నే నిజంబుగా సత్యము నెఱుగను
మౌనీ! ఎఱిగితి నందుకె వచ్చితి
ఋానిక నను సంతృప్త నొనర్చుము!"

"ఏమీ! వాసన లేని ప్రేమయా?"
ఎంచె మనసులో లేదనె నమ్మిక
ఏమీ! శుద్ధప్రేమ వాసనా
తృష్ణ రహితయా? హృదయ మేమనియె?

'సమయ మిమ్ము కలినమ్ము నర్తకీ!
సమస్య యిది యన చిత్రలేఖ యును
"సమయమిచ్చుటకు సమయము లేద" ని
చరణమ్ములపై వ్రాలి యిట్లనియె.

"ఏది కావలెనో అదియే జరిగెను.
ఎంతో ముందుకు వచ్చితి నిక నే
పోదునెట్లు వెనుకకు మీ కుటి విడి
పోవగాదు నివసించ వచ్చితిని."

మాట మార్చుటకు మౌని పలికె, "నో
మంజు చరణ!వే నడచి వచ్చితే?"
ఆటకత్తెయను "అరదముపై- నది
యరిగి యుండు నీవరకే వెనుకకు"

"ఓభగవాన్! నీయిచ్ఛయెట్టులగు
నో?నేనెఱుగను కా ని" మ్మనుచును
శోభిలు సుందరితో నను 'దేవీ!
చోద్యమ్మగు నీ భగవదిచ్ఛయును

దీక్ష యిత్తు సాంసారిక వాసన
పక్షమునను నే యుద్ధము సేయుట
సాక్షి పరాత్పరు డగా కట్టుల'
యని విశాల దేవుని పిలిచెను వడి.

"విశాలదేవా! చిత్రలేఖకై
వేగమె కుటీరమును నిర్మించుము"
విశాల దేవుం డచ్ఛము సెందుచు
విశాలార్థమున గురువును జూచెను

చిత్రలేఖ కళి వందన మొనర్చి
చెలగి దేవి! స్వాగత మిపు డంచను
చిత్ర లేఖ యంగీకరించె ముని
శిష్యుని భావము గ్రహించి యిట్లనె.

"వత్సా! నీకాశ్చర్యము కలిగెను
పరిశీలించితి వొకటి దుర్బలత
ప్రోత్సాహమ్మిడె నీకు నభ్రపడ
బూన్కి తెలియుమా కర్తవ్యమ్మిది.

బలహీనతల జయించగ వలయును
పరమేశ్వరు నిది ప్రకటన చేసెడి
నిల వాసనల రణంబున గెలుచుట
కెంచి చిత్రలేఖను మన్నించితి"

నవ్వి వటుడు 'గురుదేవ! కుటీరము
జవ్వనికై యీ నిశలోనా?' యన
నవ్వుట విద్యుద్ఘాతముగా ముని
నరనరమ్ముజివ్వుమనన్ దేరుక.

"వద్దు వద్దు పే కుటీర నిర్మితి
వనిత నానివాసముననె యుండెడి
ఒద్దిక తెలిసితి విశాలదేవా!
యువక! నాదు నిర్బలత హసించితి

జ్ఞప్తియుంచు కొను మే నీగురువును
సర్వోన్నతు దను బ్రదర్శించెదను
తృప్తిగలుగ సాధనము తపస్సున
దీక్షగల్గు వ్యక్తికి గల బలమును"

రౌద్రరూపమున వణకెను వటుండు
ప్రణతుండై క్షమియింప వేడుకొనె
"క్షుద్రబుద్ధి నని కుటి నిర్మించగ
కోరి యేగుచుంటిని" నా వద్దనె

"ఇప్పుడు కుటీర మనవసర మ్మొ
క్కప్పుడు మీగురు నవమానించితి
నిప్పుడు దానికి దండన మయ్యెడి
నిందుమీ గురుం డుంచె నిన్నిటను

పాపాభిజ్ఞతకై యేతెంచితి
పాప మ్మెఱుంగు సమయమ్మయ్యెను
పాపమె కాదిక తద్విజయమ్మును
పరిచయ మగు నిక వెడలుము త్వరగా

సంధ్యావందన సమయ మాయె" నన
సరగున విశాలదేవుం డరిగెను
వంధ్య హర్షమున జిత్ర లేఖతో
బలికె యోగి నిర్భర కంఠధ్వని

"ఐనది యేమో యైనది నర్తకి!
అది స్వప్నమ్ముగ నెంచెద, నైనను
మానసగతి ఖీతిలును నగ్నితో
మాఱాటుం బొనరించెడు చందము"

నాగ మధుర హాసమున జవ్వనియు
హాయిగొలుపు గాత్రమ్మున బలికెను
"యోగిరాజ! భయ మంద నేల? మీ
యోగమ్మున కాటంక మొనర్చను

నమ్ము మస్మదీ యాలాపమ్మును
వమ్ముసేయ మీ తపమ్ము సాధన
నిమ్ముల మిము ప్రేమించితి ననగా
నెంతటి త్యాగమ్మైన చేసెదను

దేనిలోన మీ సుఖము గలుగునో
దానిలోన నాసుఖమ్ము వర్తిలు
దేని మీరు గోరుదురో? దాని నా
మానస మవిరళ గతి చరించెడును."

తథా స్తనుచు గూర్చొనె గుమారగిరి
దర్భలు వటునితొ పొంది కుశాసన
ప్రథితస్థితి గైకొనుము సంధ్యకై
వరలెద సమాధి" నని కను మూసెను

## 12. అనుభూతి

మృత్యుంజయున కకార ణావమతి
మేకొని చేసితి నని మదిలోపల
నత్యంతవిషాదము సామంతున
కహర్నిశలు వ్యథ పడగాజేసెను

"శ్వేతాంకా! మృత్యుంజయుభవనము
చేరియుంటి వీవును నామాటల
వాతెఱ జాఱిన విధము దోచెనా?
బాగుగ నీమది జ్ఞప్తి యున్నదా?"

"ఏది పల్కితిరొయది యుచితమ్మొ
ఏది దాచలేదెందును మీరలు
కాదు కూడదని తప్పుగ నెంచిన
కారు మీర లందుల బాధ్యులుగా

సత్యము వలికితి" రని శ్వేతాంకుడు
మృత్యుంజయున కనౌచితి యౌనని
సత్య మప్రియము గాగూడదు త
త్సన్నిధి వేరొక తీరు పల్కదగు

యశోధరాహృదయమ్ము బాధపడు
ననౌచిత్యమిది సుందరి ప్రేమకు
వశమ్మగుట పరమావధి యువతకు
ప్రతిమా కృతి దోచును గనుగవకును

ఆ యమాయకత యాప్రశాంతతయు
నాయమృతమ్ముల గురియుగన్నుగవ
ఆయమ లజ్జ మనోహర రూప
మ్మఖిలము నాట్య మొనర్చగ సాగెను.

చిత్ర లేఖలోగల మాదకతయు
చిల్లగింజ యంతైన యశోధర
నేత్రములం దగు పడదు, మంజులత
మాత్రము సమానమై చెలువారును

భార్య కాకయును భార్యయైన దా
పడతి చిత్రలేఖామహితాకృతి
ఆర్యబీజగుప్తుని హృదయమ్మున
అధివసించినది నర్తకియయ్యును

ధనాశతో ప్రేమించ దెవ్వరిని
ధనవతి మంజుల తనుగత మదవతి
మనః ప్రేయసిగ ప్రేమకొఱకునై
మథన పడెడు మదనాశుగ మయ్యది.

"శ్వేతాంకా! మృత్యుంజయు వేడుచు
విపుల లేఖ వ్రాసెద మన్నించగ"
శ్వేతాంకున కందించె నిట్లనుచు
చెంగున వాడటు చేరగబోయెను

మృత్యుంజయునింటకు యశోధరా
మృగాక్షి యెదురై కారణమడిగెను
"మృత్యుంజయునకు బీజగుప్త డొక
లేఖవ్రాసె నది తీసుక వచ్చితి"

"జనకు డిప్పుడే వచ్చు నంతదా
కను నిలుచుట కష్టమ్మగునే? మీ"
కనిన 'పాటలీ పుత్ర సుందరీ
మణి సన్నిధి కష్టంబే,?' యనియెను

ఇట్టి మనోహర సంభాషణ తా
నెన్నడు విననిది కాన నద్రపడె
నెట్టులైన నతిథిని మర్యాదగ
నెంచవలయు నని యిట్లనె వటునితొ

"ఆర్యబీజ గుప్తుని వృత్తాంతం
బంత యెఱుగుదురె మీరు చెప్పుడీ!"
"ఆర్య శ్రేష్ఠుడు బీజగుప్తు డ
త్యంతము సద్గుణగణ గణనీయుడు"

"చిత్ర లేఖ విషయమున మీ మతము?"
"చేరు నుచ్చకోటికి దత్తరుణియు"
"చిత్ర మియ్యదియ నిజమా?" "దేవీ!
చెలువ చెలువ మతిలోక సుందరము"

"మీ శుభనామము శ్వేతాంకుండగు"
"మీ యనుమానము నిస్సందేహము"
"ఆశయ సిద్ధికినై ప్రశ్నించెద"
"అడుగుమీవు సంకోచ మదెందుకు?"

"గురుడు పాపమును గుర్తెఱుంగుటకు
కోరి పంపె నిది నిజమేయౌనా?"
"తరుణీమణి! నీచతురత మెచ్చితి
సరియగు ప్రశ్న మొనర్చి యుంటివే"

"పంపిన సామంతునివ్యక్తిత్వము
పాపాభిజ్ఞత కనువగు నెలవా?"
"పంపుటనిజమే, పాపాభిజ్ఞత
పరిధిని నసమంజసగతి నెంతును."

“కారణమేమిటి?” “కుమారగిరికడ
కలడు నా సహాధ్యాయి యిందుకే
మీరలిందు కను గొంటిరా తనిని
మేర మీరె నాశ్చర్య మువిదకును.

“వింతయేమి? మాకేంద్రములగు ధీ
మంతులె పాపులు కానవసరమే?
చెంత గల్గు వారలు కావచ్చును
చింత చేసినను జిక్కుట లే దిది”

“మీ ధీ సందేహాస్పద మౌనా?”
“మిగిలె పాప మను మాట నిర్ణయము
గాథలె కానీ పాపాభిజ్ఞత
కలవు విభిన్నాభిప్రాయమ్ములు”

“దైవ నిర్ణయము పుణ్యము పాపము
దైవ విరుద్ధము పాపము గాదా?”
“దేవీ! యొకండు పాప మ్మనునో
దేనిని? కాదను వేరొక్కడు మది

మనకు దృష్టి గోచరము గాని వె
న్నని లెక్కింతుము మనుష్యకర్మల
జనులు కొంద అవి పాపములనగా
ఘనపుణ్యములుగ కొందఱు దలతురు”

“సద్గుణలేశము గని తృప్తుండవు
సమ్యగ్దర్శన శీలివి.....కానీ...
తద్గతి”.....నను నంతట మృత్యుంజయు
ద్వారము కడగని లేచె యశోధర

శ్వేతాంకుని యభివాదము గొనుచును
“బీజగుప్తననుగామి వీవెకద!
బ్రాతియగును నిన్నన కూర్చొను” మనె
శ్వేతాంకుం డౌనని కూర్చొని యెను

పత్ర మిచ్చినను జూచి చదువుకొని
"బాగుబాగు! మన్నింపవేడుటకు
పాత్రు డగునె సామంతుడు? మెచ్చితి
పనులు లేనిచో రాత్రికి రమ్మను

భోజన మిచటనె చేయవచ్చు నని
పూన్కి చెప్పు మొక మాట మరచితిని
బీజగుప్తుతో నీవును రావలె"
వికసించెను శ్వేతాంకుని ముఖమును

"ఆర్య శ్రేష్ఠుని యాజ్ఞయును శిరో
ధార్యంబగు మఱి రాగల నతనితో
ఆర్యు డను మతించక నేనొక్కడ
కార్యమెంత యుచితమ్మొ వచ్చుటయు"

"సంతసించితిని శ్వేతాంకా! నీ
శాంత గంభీర కర్మ నిష్ఠ కిటు
కొంతనీపరిచయము గోరెద" నన
"కోసల దేశము-తండ్రి విశ్వపతి

"కోసల వాసియొకండు విశ్వపతి
వాస మొనర్చెను కాశి విద్యకయి
నాసహపాఠి యతండు, ఆతడా?"
"మీ సందేహము నిజమగు నార్యా!"

"ఐననీకు స్వాగతము మత్సుత స
మానుండవు" నా శ్వేతాంకుడు త
న్మానసమున బరమానందముతో
మది యశోధరకు మను వూహించెను.

అసంభవ మ్మను నాత్మఘోష వినె
నఖిల పైతృకాస్పదము సన్నగిలె
నసంగత మ్మగు నాశయుండినను
హార్దికతయె సరిపోదు పెండ్లి కయి

మౌన మున్న వటు గని మృత్యుంజయు
"డూని చెప్పలేదేమిటి? మీ పిత
నానికటుమ్మున కీవు వచ్చుటన"
నా 'నాతడు వానప్రస్థం' డనె

"మాయింటను భోజనవెునరించగ
మన సొప్పునె?" "సంకోచముండునే?"
చేయికడుగుకొనుమైన' 'కానినే
సేవకుడను గా బీజగుప్తునకు

విలంబమ్మైనది వెడలి వచ్చెదను'
"భళా! మెచ్చితిని నీకర్తవ్యము
తులనాసహామిది పోయిర మ్మనగ
తొందఱగా మరలెను శ్వేతాంకుడు

శ్వేతాంకుని యాగమనము తోడనె
బీజగుప్త డానందమ్మందెను
చేతము చింతిలె మృత్యుంజయుడును
చిత్త మలర పిలిపించు టెంతయును

రెండు యామములు విచారించెనటు
తేచె హృదయమున దర్క-వితర్క-ము
లొండు కారణము లేమి యొప్పుకొనె
నుచిత మ్మని సా యంతన మయ్యెను

మరల యశోధర జూచుట కాదా
మానిని తో సంభాషణ కోరెను
త్వరగ జేరె శ్వేతాంకునితోడుత
నరదముపై మృత్యుంజయుగేహము

వారియిల్లు నిన్నటి కోలాహల
భరితము కాకుండుట సామంతుడు
కోరియుండుటను గూడె నటులనే
చేర బిలిచె మృత్యుంజయు డప్పుడు

విశ్రమ భవనము లోపల జేరిరి
వేచె యశోధర అంతకు ముందే
అశ్రమమున దన కోర్కి దీఱుటకు
నానందించెను బీజగుప్తుడును.

"ఈ శ్వేతాంకుడు నీకు సేవకుం
డెంతయు వినయ సుశీలుం డీతడు
విశ్వపతి యనెడు నాసహపాఠికి
ప్రియ తనూజుడని నేడే తెలిసెను"

'శ్వేతాంకుడు నాసేవకు డగునే
స్ఫీత సద్గుణుడు నాసహపాఠియె'
చేత ముత్సహ ప్రీతము కాగా
చెలగి మాట మార్చెను వృద్ధుండటు

"మీదు రాక యాలస్య మయ్యెగా"
"మిత్రులు కాశిక నుండి వచ్చుటను"
మోదమాన మగు మాట యశోధర
ముగ్ధయగుచు ప్రశ్నించె నాతనిని

"ఎంత సుందర పురమ్ముకాశి మీ
రేగు దెంచి వచ్చితిరే యటకును?"
"కాంత! నామధుర కాలమంతయును
కాశిలోననే గడిపి వచ్చితిని.

నాగురుడగు రత్నాంబరు నెల వా
నాళ్లలోన, నికటుమ్ము నిచ్చుటకు
నాగురు డుత్తర దేశపర్యటన
నన్గొని యేగు నిరంతరమ్ముగా"

"ఐన హిమాలయ నగము గంటిరే?"
"అది యేమిటి? హిందూకుష్వరకును"
"దానిలో గలుగు విశేషమేమిటి?"
"తరుణీ! ఓపిక యున్న చెప్పెదను"

'మానస మంటిన విషయము చెపుడీ!'
"మరువరాని దానిని వినిపింతును
నేను ఛాత్రుడను గురు ననుగామిగ
పూని యేగి కడచితి జనపదములు

పల్లెల పట్టులు పట్టణమ్ములును
వనములు నుపవన సమితిని జూచితి
పేల్ల ద్వీచీ విలసిత గంగా
విమల ధునీ తటమున దిరుగాడితి.

వర్షాభంగా భంగను, రంగత్
వళక్ష రుచిరాపాంగను, జహ్నుమ
హర్షి కృపాపాంగాంగను గంగను
హర్షోత్తుంగ తరంగను గంటిని.

తాపసలోక నివాసతటిని, సం
తాపనివాప జలోద్వృత్తటినిన్
పాపఘనోచ్చాటన పటు శక్తిన్
పరీవాహశీలను గని మ్రొక్కితి

హరి ద్వారమును జేరవచ్చితిమి
సుర గంగాద్వారము గని యుంటిమి
సరగ బ్రహ్మకుండమున గ్రుంకు లిడి
సమానతలముల బాసిపోతి మిక.

తల లెత్తె వియత్తలంబు దాకగ
నిల పర్వత శిఖరంబులు పదపడి
నిలిపి గురుని ప్రశ్నించితి 'దేవా!
కలుగు నేమి ముందఱగా మనకును."

అదియే అజ్ఞాత ప్రదేశ' మనె
నత్తటమున ముని యొకడు దీని విని
"అది యజ్ఞాతం బంటివి నిజమే
అఖిల సురల కావాసస్థల మది.

ఈకొండలపైనే కైలాసము
ఈశ్వర నిలయము గంధర్వతతుల్
మేకొని నాట్యమొనర్తు రచ్చరలు
మెలగు చుందు రిట క్రీడాగతులను”

ఈమాటలు విని రత్నాంబర గురు
డింతయేని నమ్మక హసించె నటు,
లామాటల నమ్మితి యువకుడగా
ననుబవరహితుట నౌట కారణము

‘మహాప్రభూ! ఈపర్వత పంక్తులు
మహిత గతిని దాటుచు దత్ప్రదేశ
మహా! తిరుగు టాపత్తి కాదు గద!’
‘ఆకాంక్షించిన నేను సిద్ధ’ మనె

ముందు కరిగితిమి ప్రకృతి సుందరా
నంద దృశ్యముల యందు ముగ్ధతను
ముందుగ మే మూహించ మింత పెం
పొందు నందముల పొందు సీమయని

వికచ పుష్ప వల్లరులు, వాయు స
ద్వీచి శీతలా శాంత వాసనలు
రకరకమ్ములై కలగానమ్ముల
ప్రాతి పడెడి పక్కులు హిమరుక్కులు

శాంతి యేలు సామ్రాజ్య మ్మల్లరి
ఇంత లేదు పోటిగ బైలేచెడు
నంతె పర్వతపు బంక్తులు త్రోవను
నచ్చు టచట గ్రామములు తోచెడిని

అచటి వారు రూపసులు -పసులు కృషి
అబలలు సుందరు లతి బలయుక్తలు
విచిత్ర వస్త్రము లోలి ధరింతురు
వింతగ నవ్వుదు రాడుచు బాడుచు.

సిగ్గు వొడమ దా నిగ్గు బోడులకు
మొగ్గలాంటి నును బుగ్గల గాంచిన
మొగ్గతొడిగె నాలోని మోహమును
మొగ్గరంబు సేసెను మదిలోననె

గుములు గుములుగా నాడిరి పాడిరి
గుర్తు తెలియ దవ్వారి భాషయును
సుమధురకవితా సుందర మని మా
త్రము గ్రహించితిని ప్రేమ పూర్ణమని,

ముందు పోవగా గ్రామము లంతట
పొడగా దోచును దూర దూరమున
మంద మయ్యె నుష్ణోగ్రత శిశిరము
మహిమ పెరిగె వణకాడె శరీరము.

ఒకవేకువ నేనాగి దూరమ్మున
నొక నగమును గని యున్మాద స్థితి
ప్రకటముగా "నోగురుదేవా! యది
వరలు కుబేరు సుమేరు పర్వతము"

నామాటల మౌఢ్యము గని నవ్వుచు
స్వామి యనియె "నది హిమాలయమ్మగు
హేమ సూర్య కిరణములు పడుటచే
హేమకూట మను భ్రాంతి గలిగెడును"

సిగ్గు పడితి పయనించితి మంతట
స్థిర యంతట మం చగ్గలించినది
నిగ్గు దేలు యొడలంత కొంకరలు
నిలిచి మరలుటకు గురుడు పూనుకొనె.

సాహసమున నే వలదంటిని మును
చనుట కుత్సహమ్మును గనబరచితి
సాహసినని నను మెచ్చి గురూత్తమ
చతురాస్యుం డనుగమించె నంతట

హిమ భరిత గిరీంద్రము పాదమ్మున
కేగి చూచితిమి యట గల దొాక కుటి
ప్రమద యొకతె కనిపించె స్వాగత
ప్రమద వచనముల బిలిచెను మమ్ముల

"నిరపాయమ్మిది కాదు బాలకా!
త్వరగ మరలుదము" గురువచనమ్మిది
"అరుదెంచితి రిది యపాయ దేశ
మ్మైన గనుడి వింతలు" సతి పలు కిది.

మాట కాదనుట పాడి గాదనుచు
మహాప్రభునితో సాగితి ముందుకు
బాటసాగ హిమవచ్ఛిలపై నొాక
పాటలాంగు డగు యోగి తోచె నిక.

జడలు పాదముల దాక దాకు, ని
చ్చలును మమ్ములను జూచు చుండె మ్రొ
క్కిడితి మేము దీవించె నాతడును
కేల గూర్చొనగ సన్న యొనర్చెను

"ఎంత కాలమున కిచ్చట పురుషుల
నేండ్లను పూండ్లను బట్టె జూడకయు"
"చింత నెందుదురె" యనె గురుండు భా
వింతును సుఖ దుఃఖమ్ముల" ననియెను

వెనుకకు సంకేత మ్మొనరించెను
భీతి తోడ వణకితిమి యిర్వురము
వెనుక రుధిర కుండమ్ము మెట్లతో
విహ్వాల దుర్గంధాకులిత మ్మగు.

ఎంత భయానక దృశ్యమో సుమా!
ఇంత యేని వర్ణించగ జాలను
స్వాంత మదిరి గురు సత్తము డనియెను
"స్వామీ! యిచ్చటు విడి పోలేరా?"

"విడిపోదలచెద విడలే నంతే
వేమాఱును యత్నించి మానితిని
విడలేనెందులకో తోచదుమఱి
వితమ్మై పోయెను నా|శమ మంతయు."

విపుల చర్చ సాగెను వారలకును
వింత యనుచు నిలు చుంటిని- సమయము
అపూర్వదుర్గంధము భరియించుచు
అటులే నిలిచితి గంటల కొలదిగ

సాయంతనమ్మై పోవు చుండగా
చయ్యన యోగియు సమయ మైన దనె
పోయె బరుగులోగుండము దిక్కుగ
పోయితి మేమును యోగి వెంబడిని

పిచ్చివానివలె దూకె గుండమున
విమల జలము తో వెలిగె గుండమును
విచ్చిన కమలములయ్యె |బేతములు
విస్మయ మందితి మే మవాక్కునను.

కుటిలో దోచిన కుటిలాలక త
త్కుండములో నాతనితో నాడెడు
తృటిలో లీనమ్మయిరి వార లటు
తృప్తిదీఱ నీదుచు మముగాంచిరి

యోగి పల్కె "నోమూర్ఖులార! మీ
రాగితి రేటికి? రాగిల రేటికి?
భోగించుడి జీవన సౌఖ్యమ్ముల
మునుక లిడుచు నీకుండములోపల."

స్నాన మొనర్చ దలంచితి గాని, |ప
సన్నుడు గాక మహా|ప్రభు వంతటు
మానిపె నాకర మూనె వెనుకకై
మరునిముసమ్మే పరుగు దీసెనిక

కుటి దాటిన తదుపరి మునుపటి గతి
కోరి చనుచు నాతో గురు డనియెను
'నిటల ఘటిత కరపుటయుగళులమై
నేడు, పరాత్పరు మ్రొక్కెద మిప్పుడు.

బ్రతికి వచ్చితిమి' నా నామాటల
పరమరహస్యము మనసున దెలియక
నతివరూపు పలు మాఱు తలంచితి
నతుల ముందఱ నాట్య మాడెడును

వింత విషయమును వినిన యశోధర
వేడ్క గలుగ బ్రశ్నించె నాతనిని
"ఇంతకు దీని రహస్యము మీగురు
డెఱుగ జెప్పెనా? లేదా?" యనగా

"జగతి లోన బలువింత లుండు"నని
సమాధాన మిచ్చెను గురుదేవుడు
సగము తెలిసి యాలోచన తగదని
సరిపుచ్చు కొంటి స్వాంతములోపల"

భోజనశాలకు బోయిరి వారలు
బీజగుప్తు డిటు శ్వేతాంకుండటు
భోజనమున దోడుగ యశోధరకు
ముందున మృత్యుంజయు డాసీనుడు.

ఆరగించు మధ్యమున యశోధర
"అపూర్వ మీయెడ మీ కథానికయు
మేర మీఱుకుతుకమ్ముగల్గు నీ
మేదినిగల వింతలు చూచుటకై"

బీజగుప్తు డను 'దేవి! యశోధర!
వినుము పరిస్థితు లనుభవమిచ్చును'
రాజముఖిని మాటాడించగ నా
బ్రహ్మచారి సమయముకై వేచెను.

"అనుభవమ్ము గడియించగ జీవన
మంత మిగిలి యున్నది తలోదరీ!"
"అని జీవనమున క్షణము వ్యర్థ మౌ
టనుచిత మగుగా" కనియె యశోధర,

మందహాసమున బీజగుప్త డనె
"మగువా! ప్రతికార్యము వెన్వెన్కనె
చిందులాడు నొక అదృశ్యశ్యక్తియు
చెలగుదాని, యభిమతమే భువిలో,

మతములు రెండగు, నొకటి జీవితము
మార్చును కోలాహల భరితముగా
ధృతిని రెండవది ప్రశాంతమ్ముగా
దేన నిజంబు గ్రహించుట కష్టము"

శ్వేతాంకుడవకాశము వెదకును
బీజగుప్తువలె యశోదరా మతి
చేత ప్రభావిత, మెఱుంగడు కడకు
చిన్న సాహసముసేయు ఖూను కొను,

"దేవియశోధర! తెలియ వినుము, ఈ
జీవనమున సుఖ శాంతులు గల్గియు
కావలె గోలాహల మొక కొంతయు
కంపన, తత్సుఖ సంపద తృప్తియు,

ప్రేమక్షేత్రము లివి యశోధరా!
ప్రేమికులాత్మ పరిస్థితి యెఱుగరు
గోమున సహాను భూతి దోచవలె
గూఢ రహస్యము సుందర లక్ష్యము"

యశోధరయు శ్వేతాంకుని గనుగొనె
నతని మేను పులకించె ద దేకత
యశోధరను గనె శ్వేతాంకుండటు
లర్ధ ఘటిక మరచిరి సర్వమ్మును.

ఇదే జీవనమ్మని సామంతుడు
బదులు చెప్పగా బడతి తబాలున
పదపడి మరల్చె వటుపైజూపును
బ్రహ్మచారి తలవంచెనుసిగ్గున

## 13. సంఘర్షణ

ఆకర్షణ కల దతులత కన్యక
యశోధరా ముగ్ధారూపమ్మున
ప్రాకట సుందర మధురతాభరిత
పరమ పవిత్ర చరిత్ర తలోదరి

ఆమెయెదుట నిలుచున్న మనుష్యుం
డతుల పవిత్రత గాంచ గల్గెడును.
భూమి పవిత్రమ్మగును, బీజగు
ప్పుండు మాత్ర మసుఖమ్ము గాంచెడును.

యశోధరా వ్యక్తిత్వ మాతనికి
నమాయకత పరిపూర్ణత దోచెను.
విశాల హృదయనివిష్ట గభీరత
వెనుక ప్రహేళిక దాచబడియెనో?

స్పష్ట నిష్కపట కవితావిరహిత
వార్తాలాపము సాధనాలసిత
మిష్టపడును నృపు డతివకు నివి గని
కష్టపడును దనవని తలపోయగ.

యౌవనమొక యుచ్ఛలన్మహోదధి
ఆటు పోటులను గోరుచుండునది
జీవన నదీలసిత జలసంపద
చెలగురఝరీ పరివాహగభీరత.

అడుగడుగున గష్టములను వెదకెడు
నవి తరించి తృప్తిని గను చుండును
నుడుగునుడుగులో దనవ్యక్తిత్వవి
నూత్నత విస్పష్టముగా గోరెను

ప్రభావశాలిత స్పష్టమ్మగు జీ
వనపూర్ణత గోరును యౌవనముల
విభిన్నశక్తుల సమ్మేళనమే
వెలుగు క్రాంతి నామేదిని లోపల

విభిన్న శక్తులు సమ్మేళనమై
పేరగు చుండును పృథగ్భావమున
ప్రభాసమగు తగు సమయములందున
పార్థక్య మ్మనుభవమున వచ్చును

యశోధరాస్మృతి భయ మిశ్రిత సుఖ
మతల కుతల మొనరించె హృదయమును
యశోధరను హృదయమున నిల్పుకొని
అర్చన సేయ గలట్టి మూర్తి యది.

నారీత్వాదర్శ పవిత్రాకృతి
భూరిధర్మ విశ్వాసప్రతినిధి
ధీరశాంత పీయూషాక్షి ద్వయి
దివ్య శీతలాపాంగ దయామయి

బీజగుప్తుడుద్ధత యౌవను డగు
విస్తరిల్లు మాదకత నరమ్ముల
మోజు పడడు తద్య శోధరాకృతి
ముగుద యశోధర యందు నెప్పుడును

మదిర నొక్క-పరి మాత్రము చవిగొని
వదుల లేడు వా డెంత వాడయిన
ముదిత చిత్ర లేఖను ప్రేమించియు
వదలు టాతనికి నవశమ్మయ్యెను.

చిన్న లేఖ కనిపించె నింటిలో
బన్ను కుతుకమున బఠించె దానిని
చిన్నదయ్యు జీవన కథ తెలిపెడు
చిత్తజ్ఞానమహా గ్రంథమ్మిది.

"పూజనీయ! నేనూహించని పని
పూని చేయగా బోవుచుంటి నిటు
బీజగుప్తు ప్రేమించితి నిపుడును
ప్రేమించుచు నుంటిని సత్యమ్ముగ

త్యాగమవసరము ప్రేమలోన దత్
త్యాగ మొనర్చుచు నుంటిని మీతో
భాగధేయమును గాను నేను మీ
బ్రతుకు నిరర్థక మయ్యె నావలన

రాగభోగముల బరిత్యజించితి
ప్రతిక్రియన్ను బొనరించ దల్చితిని
యోగి కుమారగిరిని గనబోవుచు
యుక్తముగా దీక్షను గొనుచుంటిని

మీకు పెండ్లి యుచితమ్ము, హితమ్మును
మీకొఱకై కాకున్న మా కొఱకు
లోకమునకు, నేనుండ వివాహము
కాకయుంట నేనెఱుగుదు నీహృది.

అందుకె వేరైపోవ నెంచితిని
ముందే విధవను, కర్మభ్రష్టను
చిందులు త్రొక్కెడు ప్రేమ వశత ను
చితానుచితముల పాడిని దొలగితి

మరియొక మారుగ కర్తవ్యమ్మును
బరిపాలించ దలంచితి నంతే
చరణమ్ముల (వ్రాలిన తలోదరిని
కరుణ జూడుమా చిత్రలేఖ నిటు"

పత్రము జదివెడి బీజగుప్తునకు
వణకు పుట్టె వెలవెలయ్యె మొగమును
చిత్రలేఖ హృదయమ్ము విచిత్రము
చింతించం డావంత నింతయును.

తలబరువయ్యె జలించె మానసము
తలగడపై దల, తలలో నెలతల
తలపులవల వలపల దాపలగా
వలవల నీరొలుకును గను గొలకుల

ఎంతచేసె నాయింతి? యింతకును
స్వంతబుద్ధియా? యోగి చెంత కా
కాంత యె ట్లయస్కాంతమ్మయ్యెను
కొంతకాలమేనా? సొంతమ్మా?

తంబురశ్రుతిదప్పిన చందంబున
అంబుజాక్షి సంబంధము నాయెడ
నంబరంబుగా సంబరంబుగా
డంబు మీఱునా కుమారగిరి యిక?

ఆత్మబంధ మస్థాయియె యగునా?
అంతరంగమున కర్థమెలేదా?
ఆత్మయొక్క సంబంధ మనాదియ
యౌనే? యనె దన్వీమణి నిజమా?

తనను వీడ దన్మన మెటులొప్పెను
మనసు చంపుకొనెనో మరపూనెనొ?
తనను బరీక్ష యొనర్చుచున్నదా?
తనకై త్యాగము తప్పని సరియా?

సర్వోచ్చాదర్శముగల ప్రేమిక
సకల త్యాగ మొనర్చు నాత్మబల
ధూర్వహ యైన నిరాలంబ గుణ
స్తుత్య యెట్లు తను బాసిపోయినది.

ఉత్తమురా లొనరించె దప్పు నిల
నొకని సుఖము గోరుచు దుఃఖమ్మును
జిత్తమ్మున యోచించక పొందెను
జెలువ చెలువ మడవుల పాలయ్యెను.

బీజ గుప్తునకు పెండ్లి సేయుటకు
విడిచె ననిన నది యసంభవమ్మగు
భోజనమున వడ్డించు పదార్థము
భుక్తి సేయు వానికి రుచి గావలె.

ప్రేమ యొకరితో బెండ్లి యొకరితో
బీజ గుప్తు జీవితమున జరుగదు.
ప్రేమకు బెండ్లికి నంతర ముండిన
పెండ్లిమానుకొని ప్రేమనెకోరును.

కన్నుల మబ్బొక యింతరాదు, ని
ల్చున్నపళంబుగ నర్తకి గనవలె
నన్న కోర్కి పెల్లుబికిన తత్క్షణ
మున్నవాడు నున్నట్లు పయనమయె.

కుమారగిరి యాశ్రమము చేరుకొనె
కూర్చొని యుండెను యోగిధ్యానమున
సుమాంగి దర్భాసనమున బడుకొనె
సుమారుగా నడిరేయి దాటినది.

నర్తకి శాంత గభీరత గాంచెను
నాడు, వైభవ స్థితి యానాడును
మూర్తిమత్వసంపూర్ణతనేడును
భూషణాళి భూషిత తను వప్పుడు.

చిత్రలేఖ తలవైపు కూర్చొనియె
నాత్రపడుచు గనుగొను దద్రూపము
చిత్రమయ్యె నాతని పరిస్థితియు
చిత్రమంతలో భ్రాతఃకాలము.

కుమారగిరి తన సమాధి వీడెను
కోమలి తన కన్నులు వడి తెఱచెను
సమానముగ సామంతుని గనుగొని
భ్రమవడి "ఓహో! బీజగుప్తు"డన

యోగి ముఖమ్మున నాశ్చర్యమ్మును
యోషముఖమ్మున భయవిహ్వలతయు
యోగిముఖమ్మె బీజగుప్తుడును
యోగి యోగినుల కంజలించె వడి.

కుమారగిరి దీవించె నాతనిని
కోమలి తన నేత్రమ్ములు మూసెను
బ్రమాదపడకను బీజగుప్తు డో
"పడతీ! గట్టిగ నిర్ణయించితివె?"

అపరాధినివలె తలను వంచినది
అతివ, అశ్రువులు రెండురాల్చినది.
"కృపామయా! మీకనుల ముందరిది
కేవల మంతిమ నిర్ణయమ్మెసూ!"

"తిరిగి నీవు యోచించుట మంచిది"
'పరువడి నాయోచన తగదందురె?'
"తరుణీ! నీపని తెలుపుట తగదను
కరణి తోచెనే అవిశ్వాసమును?

ఒక రిద్దఱిలో భేదముగనుటే
ఒగి ప్రేమ యటం చూహాభావ్యమే
ఒక రిగ నిద్దఱ జేయున దయ్యేడు
నొప్పగు ప్రేమయె దానికారణము.

నావివాహమున కాశించితవే?
జీవనమున నది జరుగదు. నీవను
దేవితోడ నీతోగాకుండగ
గావలయునె? నాసుఖమ్ము కోరిక.

నావివాహ మత్యనావశ్యకము
నాతోగాని ప నియ్యది యెప్పుడు
దేవీ!" యనిన బదమ్ముల వ్రాలుచు
తేకువ నాతని వెంట బోదలచె.

హఠాత్తుగా తన యత్నము మానెడి
నతి దూరమ్ము గమించి వెన్దిరుగ
కుటిలాలక హృదయ మ్మొప్పదు మఱి
బొటబొట యేడువ దొడగెను నర్తకి.

లేవనెత్తె నటి నట సామంతుడు
లేడి కంటి శాంతమున నిట్లనియె.
"దేవరవారు మహాత్ములు పూజ్యులు
దేవతలే; మానవు లిక గారని

నే నెఱుంగుదును ప్రేమించితి నిను
కాని జీవనము వ్యర్థ మొనర్చితి
మానక నీవిటు పెండ్లి యాడవలె.
మాసంతుష్టికి బాధ్యులు గావలె.

ఎంతవరకు నీ పెండ్లి చూడనో?
ఎంతవరకు నీ సంతానము న
న్నింత మాతృభావమున జూడదో?
అంతవరకు నేసుఖి గాజాలను.

ప్రేమింతును ముమ్మాటికి నిన్నిల
ప్రేమ కర్థ మార్థిక విలాసమా?
కామ తృప్తి యేనా ప్రేమంబన?
గాజాలదె భోగాతిరిక్తముగ?

ప్రాపంచిక సంబంధము భిన్నం
బై పవిత్ర హార్దిక సంబంధము
తో పదె శాశ్వతమై మహోదయా?
తొందఱ పడుట చలించుటయేకద!"

"అసంభవ" మ్మనె బీజ గుప్తుడును
అతివయ తన మెడపై చెయి వేసెను
"అసహ్యా మా ప్రియ తమా వియోగ?
మ్మనతిదినమ్ములు, మనసుమారదా?

పేచి చూత మొక కొంతకాలమును
వివాహమునకు ప్రస్తుతుడవుకావా?
తోచు వియోగము ప్రేమలో సయిత
మోచెలికాడా! సహింత మిప్పుడు"

బీజగుప్తు డొకపరి లేచెను వడి
"వెలదీ! చెప్పితి జెప్పవలసినది
రాజీపడుటయు మానుట నీవిధి
గ్రహింతు వీవే పోయివచ్చెదను."

రథ్య దాక వెంబడించె సుందరి
ప్రమద వాని యధరోష్ఠము ముద్దిడె
మిథ్య యిన్ని వర్షముల నింతటిది
మెలత నుండి పొందని సుఖ మియ్యది.

ఎంత మాదకత నిండి యుండె ద
న్నెంత విమోహితు జేయుచుండె ద
త్కాంత పదమ్ముల వ్రాలి క్షమార్పణ
"తప్పు చేసితిని' నాగ వేడుకొనె.

వీడికోలుతో వనిత వెన్దిరిగె
ఱేడు గృహోన్ముఖుడై పయనించెను
జోడు వాయు పెంటికచందమ్మున
సుందరి కుటీరమున కాలిడియెను

ఆలోచించుచు కుమారగిరి వ్యథ
నాసనమున గూర్చొన ననుమతి నిడి
ఆలోలాక్షికి ననియె నిట్టులని
"అతివా! నను బ్రేమించితి నంటివి?"

"అబద్ధమేమున్నది? యోగీశ్వర!"
"అబలా! సామంతుని ప్రేమించితి
వబద్ధ మా ఇది?" "నిజమే యదియును"
"ఐన నెట్టు లిద్దఱిని ప్రేమగన?"

అవిశ్వాస మేఘ మ్మలమెను హృది.
"అగును, కాదెటులు? పురుషు డిర్వురను
వివాహమ్మై ప్రేమించు, నిద్దఱిని
యువతి కసాధ్య మదెటు? గురుదేవా!

వనిత పతిని దానెంత వలచునో?
తనయు నంతయే ప్రేమించును గద.
మానసికప్రేమము పలువురితో
మహిలో పొసగుట అనుచిత మౌనా?"

"మోసపుచ్చునది నన్నా? నృపునా?
ముదిత! నీకు నీవేనా? ఏమిటి?"
"మోసగించు టది మిమ్ముగాదు కా
దాసామంతుని కాదా నన్నే"

"కాదు చిత్ర లేఖా! యోచించుము
కలవు నాతో ఆతని బ్రేమించుట
కాదు, నమ్ముమిది, నాసహచరత
కావలె నిర్మోహత, నిర్దంభత

నాకడ దపమే సాధనయే గల
దోకలికీ! శుష్క క్షేత్ర మ్మిది
లోకోన్నతి సాధించుటకొఱకై
లోలాక్షీ! దౌర్బల్యము తగదిట.

సమయ మిచ్చితిని మరియొకమారును
సరిగా యోచన సేయుమం" చనిన
"మమత్వ విచ్ఛేదమున సిద్ధమై
మనగ నెంతు యోచించితి స్వామీ!"

కుమారగిరి యా చిత్రలేఖ తో
సమాధానపడ డీ యుత్తరముల
సమర్థమగు వ్యక్తిత్వము గలయది
చతుర యీామె యని చింతచేసెనిక

"నిన్నవగత మొనరించ నశక్తుడ
బన్నుగ నీవ్యక్తిత్వము సమముగ
నున్నదినాతో, దీక్ష నిచ్చుటకు
పన్నుదునా? మానుదునా? తోచదు."

అను నంతట నావిశాలదేవుని
అచట ప్రవేశము గని యాగెను ముని
వినమితుడై శిష్యుడు బయటకు జనె
దినకరు డుదయించుట కారణముగ.

పిదప యోగి "ఓ వెలది! తప్పది క
విధినిర్దేశముగా దలంచెదను
ముదితా! నీతో నాపరీక్షయగు
హృదిలోనుంచకు మిప్పటి మాటల"



## 14. విచిత్రగతి

దినము వెనుక రాత్రియగును
దినము రాత్రి వెనుక యగును
మనిషికి సుఖ దుఃఖమ్ముల
వెనుక ముందు లిట్లేయగు.

రాత్రిలేక దినమున కే
మాత్రము కళ పెరుగబోదు
రాత్రికి దినమును వినాగ
రమణీయత కలుగ దెపుడు

సుఖ దుఃఖము లట్లే యగు
సుమ్మి! జగత్పరివర్తన
నిఖిలత గనుపించుచుండు
నిజ మిది ప్రతి మనిషి యందు.

బీజగుప్తుడును నరుడే
విదిత మతనికిని సుఖమ్ము
రాజిత గతి దుఃఖమ్మున
రాజిలు నవసరమున్నది.

కాని దుఃఖ మన గంపిత
మానసుడై పోయె నతడు.
దీని స్వప్నమున నెంచడు
మానక దలపై బడియెను

పాటలీ పుత్రమున నుండిన
పాటలాధర గనుట గల్గెడి
నోటుమియె తద్వియోగమ్మున
నోర్వలే డిది బీజగుప్తుడు.

ఇంతకును ముఖ్యమ్ముగల దా
కాంత తన నెడ బాసి సాధన
చెంత గాలము గడుపు నన సా
మంతులకు ముఖమెట్లు చూపెడు.

ఇంత చేసి యశోధరయు దన
కింతటిగ ప్రేమ ప్రభావము
సొంత మొనరింపన్ సమర్థయె?
సుళ్ళుదిరుగు మనమ్ము లోపల

విప్పరాని పొడుపుకథయు
చెప్పలేని మనోవ్యథయు
చొప్పులేని సమస్యయై
ముప్పుతెచ్చి పెట్టె దనకు.

దేశ పర్యటనము సేయ
ధీశక్తి పరిష్కారం
బాశయసిద్ధికి మూల
మ్మని వటుతో బలికె నతడు.

శ్వేతాంకుం డాశ్చర్యము
చేత గొంత గడువు గోరె
చేత గాదు తప్పదనియె
శ్వేతాంకుడు చల్ల బడియె.

నిద్రలేదు శ్వేతాంకున
కద్రిపైన గూలినటు స
ముద్రమ్ములు పొంగినటులు
ముద్రవేసె భీతి హృదిని.

"మృత్యుంజయు కడకుపోయి
మేలు చెప్పివచ్చినచో"
"సత్యము, వేగమె తెలుపుము
సత్వరమున బోవలయును."

శ్వేతాంకుడు ప్రమదముతో
జేరెను మృత్యుంజయుకడ
నాతడు బయటుకు వెళ్లుట
యశోధరకు దెలిపె రాక.

అభివాదనముల వెనుకను
యశోధరను గూర్చి పలికె
ప్రభుడు బీజగుప్తుని తో
బాటలి పుత్రమును విడుట.

పెక్కునాళ్లు పోవుచుంటు
వీడుకోలుకై వచ్చుటు
మక్కువగా దెలిపె నతడు
మగువ పెల్చగా బలికెను.

"బీజగుప్తు డీ విషయము
నోజ దెల్పలే దదేమి?
రాజుల చిత్తములు దెలియ
రాదు మాకు గాబోలును.

యశోధ రోదాసీనత
నబ్బురమ్ము సెందె నతడు
"విశాలాక్షి చిత్రలేఖ
వీడె నతని, యోగి జేరె!"

వింత పడుచు యశోధరయు
"ఎంతమాట? విరాగియై
కాంత చనిన బీజగుప్తు
కంత చింత కలిగియుండు.

బీజగుప్తు కొఱకై యా
వెలది త్యాగమును జేయుట
నోజ నేను గుర్తించితి
నొకటు నామె గనిన యపుడె"

"చిత్రలేఖ తప్పనొరుల
చేరువ గోరడు భూపుడు
చిత్రలేఖ వియోగమ్ము
చేత బయట బోవగోరు.

బయట పోక నుండెనేని
బ్రతు కనుమాన మ్మతనికి”
భయముసెంది యశోధరా
వదనము వెలవెల పోయెను.

“ఆర్యుని గుణ గణములు నే
నట నట గని యుంటి వింటి
అర్యమ్ము ప్రతి మానుం
డందుకు శ్రద్ధను బెంచితి”

శ్వేతాంకుడు క్రోధమ్మున
బిచ్చివానివలె నయ్యెను
“పూతచరితు డత డేమిటి?
పురుషు డెవని కుచిత మ్మిది.

నర్తకిపై ప్రేమలోన
కర్తవ్యము మరిచిపోయి
పూర్తి పిచ్చివా డౌటయు
పొగడ దగిన విషయమ్మొ?

అంతియెకా దామెకొఱకు
నధీరుడై చింతించుట
అంతటి వానికి దగునా?
ఇంత దుర్బలత్వమ్మా?”

శ్వేతాంకుని కోపమునకు
చింత సెందె యశోధరయు
చేతనైన గాంభీర్యము
చేత బలికె నతని కిటుల

“ఉచితమ్మగు మీపలుకుల
నొప్పుచుంటి, బిజగుప్తు
శుచిగా దలపోసెదనే
సుదతి నర్తకియె వారికి?

ధర్మపత్ని సదృశ యామె
తప్పదు తెలియుదు రెల్లరు
మర్మం బెఱిగిన వారికి
మాత్రమ్మది తెలియనగును

నేనెఱుగుదు నీవెఱుగుదు
మానిసి మది బలహీనత
కానబడును కష్టమ్ముల
గాన బూర్ణు డెవడు జగతి?

దుర్బల సామాన్యమ్మున
దూఱు నెవడు నెదిరి? నతడు
దోర్బల మెంతటి దైనను
దూష్యుడు ద్వేష్యుం డయ్యెడు.

ఆ యలవా టుండినచో
నత డెవ్వరినైన నను
దాయ యగును బ్రతివాడును
దాన బ్రతుకు భార మగును.

ప్రతిమనుజుని కర్తవ్యము
బలహీనుల సానుభూతి
హితమిది. యభివృద్ధికారి
హేలన సేయుట తగ దిట''

''బలహీనత నిందించుచు
దొలగించుట కర్తవ్యము
తెలుపు సానుభూతి దయయు
తెంపు సేయ నీయ వనిన''

చిరునవ్వున యశోధరయు
''నరుడు తనదు బలహీనత
గురుతించియు దొలగించగ
బరువడి కృషి సేయవలయు

తనతప్పులు గురుతించక
ననయము పరుతప్పు జూడ
చనుట దోషమై యెసగును
మనుజుం డిది యెఱుగవలయు."

కన్యక మాటలు శరములు
గానై హృది గ్రుచ్చె నతని
కన్యత్ర చరించు బుద్ధి
యంత కేంద్రమున జేరెను.

సవరించుక నిట్లనియెను
"చంద్రముఖీ! బీజగుప్తు
నవమానించుట నీకడ
యనుచితమే? మార్చుకొందు."

వటుని మాట కుటిలాలక
కుటిలతగా దలచి 'యిటుల
కటుత వటుని కెటు లబ్బెను
జటిల' మ్మను కొనె మదిలో

తలవంచుక నెలతవలికె
"కలితగుణా! బీజగుప్తు
వలిచితినని తలచినావు
కలలో నిది జరుగబోదు."

కన్నీ రొలికెను గన్నుల
కాంతముఖము దాచు కొనియె
బన్నుగ శ్వేతాంకుడు త్వర
పడి పలికిన మాట కడలె.

చేతులు జోడించి పలికె
శ్వేతాంకుడు 'మన్నించుము
పూతచరిత! పొరపడితిని
మూఢత గలిగెను నాకిల.

నన్ను నేను దమాయించు
కొన్న నిట్లు జరిగెడిదా?
ఉన్నరూపు నీకు దెలిసి
యున్నదె నామాటతీరు'

నెలత "ఏల పలికి" తనియె
"వలచితి నిన్న" నియెవటుడు
నిలిచి కనులు చూచుకొనియె
"నిజమా? ఇది ఎంత వింత?"

"నిజమా? ఇది ఎంత వింత?"
నిస్తేజుం డయ్యె వటుడు
నిజ హృదయము యశోధరయు
నింపె జిన్న వాక్యములో

శ్వేతాంతుని బ్రేమించదు
చెలువ యశోధర మున్నటు
నాతడు నిట్లనియె "దేవి!
అత్యంతము విషమమ్మిది.

నీవు నన్ను బ్రే మించమి
నేనెఱుగుదు. ప్రేమించెద
పావని! నే బల్కలేను
పలుకరాదు, వలచుటయే.

ప్రసంగ వశమున బలికిన
ప్రల్లదముల కలుగకు మది
ప్రసన్నతను గనగోరెద
వటుని నన్ను క్షమియింపుమ"

"అవసరమ్ము లేదు క్షమను
యాచించుట, జీవితమున
నవికలతను జరుగు చుండు
నన్నిట మన్నన గోరుదె?

ఇపుడే వచ్చెద" నని యా
చపలాక్షియు లోనికరుగ
దపించె మదిలో వటుండు
తా వచ్చిన పని యేమిటి?

అధిక ప్రసంగమ్మయ్యెను
వ్యథ కలిగించితి నామెకు
విధి విధానమెఱుగ మనుచు
వెడల దలచె శ్వేతాంకుడు

మృత్యుంజయు డాగమింప
మిన్నక నమస్కరించెను.
"సత్యమ్మా? శ్వేతాంకా!
సామంతుని దేశ యాత్ర

ఎందాక ప్రయాణ"మ్మన
"ముందువారణాసి కనియె
"ఇందుల కెపు డాగమనము?"
"ముందు ముందు దెలియనోపు"

యశోధరా విజ్ఞప్తికి
హర్షించిన మృత్యుంజయు
విశాల హృదయము వలికెను
"బిడ్డా! మన కెట్లు గూడు?"

"ఏమున్నది? వెడలుద"మని
ప్రేమ మీఱ బలుకు కూతు
తో మృత్యుంజయుడు "సరే!
తొందఱగా దెములు" మనియె

"ఆర్యా! మీ వెంటవత్తు
మని తెలుపుము, బీజగుప్తు
కార్యమ్మున కడ్డంకా?
కడలి వంటి గంభీరుడు."

శ్వేతాంకుడు యశోధరను
జింతసేసె బీజగుప్తు
నాతివలచి యుండు ననుచు
నాతడు మాత్రము సేయడు.

వెంటనుండి చూడవచ్చు
వెనుక ననుచు మది నెంచుక
తొంటి వలెనె వచ్చెదనని
తొందఱగా జనియెనతడు

వీరలు రాగోరుట తెలి
సెను, బెనుచింతను దను సే
కారణమున బోవుచుండె
దూర ముండుటను గోరెను.

ఒకటి వెంటనే పడియెను
యుక్త మిదియు నెటు లోర్చెద
సకలమ్మును మును గనదగు
సరి యనుకొనె సామంతుడు.

## 15. పరిశీలనము

అనుకున్నవిధముగా బయనించి రందఱును
వినుతరమ్యస్యందనారూఢులైవారు,
గ్రీష్మసంధ్యాకాల సుభగమోహితులయ్యు
రూష్మ నిశ్వాసు డొక్కడె బీజగుప్తుండు

శుద్ధ చతుర్దశీ సోముండు పూర్వదిశ
బుద్ధమౌ తాపాగ్ని బీజగుప్తుని హృదిని.
కర్పూర హారతుల గాంత లాత్మగృహాల
నార్పజాలని జ్వాల లార్యుహృదయములోన

నిర్మల వినీలాభ్రనిధులు తారావళులు
నర్మమధు రాలాప శిథిల సంస్మృతులు హృది.
ఆశాంత విశ్రాంతరజనీకర జ్యోత్స్న
ఆశాంత విభ్రాంత రజనీ చరీభ్రాంతి

రథలగ్నరవలయానందరతి యటు, మనో
రథభగ్నవిలయతాండవకేళి యార్యునకు
రాత్రిసగమ్మై పోయె ప్రతి వారికిని నాడు
రాత్రి సగమయ్యె నార్యుని వేదనను జూచి

సుందరోద్యానసౌరభము దెచ్చెను సుఖము
సుందరీ ధైర్యవర్తన విస్మయము గూర్చు
లోచనానంద దృశ్యత తృప్తులైరి. ఆ
లోచనాగ్రీష్మ తప్తుడు బీజగుప్తుండు,

కనులు పర్వతములై గ్రాలె నవ్వారలకు
కనులు లోయల జూచుకొను నార్యు దృష్టితో
తోచె సమయాతిక్రమణ భార మందఱకు
దోచె సమయాతిక్రమణ భార మాతనిని.

రథ మాగుటకు బలిమి రమణి సేయగ, మనో
రథము మూగగుట కార్యుడు మౌన మూనె నట
వివిధమై చెలగు వారలు వారలైరంత
వివిధమై చెలగు నాబీజగుప్తుని దృష్టి

గ్రామనిరపేక్ష నిద్రాసక్తి వారలకు
గ్రామణి గ్రామ సంఘర్ష మాతని మది.
విశ్రామ వాటి కాన్వేషణ పరుల్వారు
స్వశ్రీఘ్ను చేటికాన్వేక్షకీభరు డతడు.

ఒకవాటికను రాత్రి విశ్రమించిరి వారు
ప్రకట శ్రమాపనోదన పరత తప్పదని
నిద్రాసమున్మీలితాక్షులై రందరు. స
ముద్రకల్లోల కల్లోల మానసు డతడు.

పోదలచు టెక్కడకు? పొవు టెందుల కిప్డు?
పొదలు ప్రశ్నలతోడ మెదడు విచలితమయ్యె.
కాశి కేగుట శాంతికై మానసిక వృథా
వేశ ముడుపగ స్వీయ కర్తవ్య దీక్షకై

పాటలీపుత్ర మెడబాసినది నర్తకీ
పాటలాధర యశోధరల నెడబాయుటకు
ఆచిత్రలేఖ యే మాశించి వీడె, దో
బూచులాడెడు యశోధర వెంట బయనించె.

నాయెడల దప్పదా ఈయశోధర తగుల?
మా యతివ చిత్ర లేఖ ప్రేమ దొరుకదా?
చిత్రలేఖయు నన్ను బ్రేమించ లేదనిన
చిత్ర మాయోగికడ జెప్పినది సత్యమ్ము

ప్రేమించె నన్నుచో విడనౌనె తన నిట్లు
ప్రేమ కొఱకై మదిని వేదనల ఱేపినది.
కలవరముతో నిట్లు బీజగుప్తుండుండ
కలరవము చెలగె బ్రాతఃకాలమని తెల్ప.

ప్రకృతి ధర్మవిరుద్ధ పథి బీజ గుప్తుండు
వికృతు డౌటకు నెఱ్ఱబడె పూర్వదిక్తలము.
బీజ గుప్తుని పరిస్థితి చూచి తారకలు
రాజువెంబడి బిక్క మొగములను మరుగయ్యె.

మలయు తాపము దీఱు మార్గమ్ము వెదకి కొని
మలయ పవనుని కొఱకు సామంతు డటు చేరె.
హిమబిందు మందహాసము చిందు కళికలో
రమణి రమణీయ జీవన సత్యమును గాంచు

ఆదృశ్యమును గాంచి సామంతు డాశ్చర్య
మేదురాదర దృష్టి మెలతకడ కరుదెంచె.
"చూడు మిదియార్య! సుందర సన్నివేశమ్ము
కూడుకొనె నుల్లాస శాంతిసౌందర్యములు

రంగు రంగుల ప్రకృతి రాగిల్లు వాని హృది
భంగపాటును దృష్ణబాధలను గెల్లెడిని."
నలువైపులను గాంచి యనె బీజగుప్తుండు
"చెలువ! నాకీప్రకృతి చెలువమ్ము కనుపడదు."

వింతగా నతని గాంచెను యశోధర, అడిగె,
"ఇంత ప్రకృతిని సుందరత తోచదే మీకు?
సత్యమా? హాస్యమా?" అనిన సామంతుండు
"సత్యమిది ప్రకృతి కృత్రిమముగా దోచెడిని."

"ఈపచ్చికల కోమలము లెంత గంటిరే?
ఈ పట్టుననె నిల్చి పోవుటకు మన సొప్పు"
"వద్దు వద్దిచట వెఱ్ఱుం డుండ డొక్కండు
కద్దు శీతముగల్గి కనలుటకు గారణము.

ప్రకృతి యెంతటి యంద మొలక బోసినగాని
ప్రకృత ప్రకృతి వాస సహనశీలవు గాదు
కీటములు విలసిల్లు చోటు మంచును గూడి
కాటువేయును దృష్టి కలిగి చూడగలేవె?

కావుననె ప్రకృతి సంపూర్ణత గన బోదు.
దేవి! సౌకర్య రహితమ్ము తెలియుము నేడు"
"ప్రకృతి యపూర్ణమా? బాగు మీ వచనమ్ము
వికృత సిద్ధాంతమ్ము విన్పించితిరి నేడు"

"అవును దేవీ! అది యసంపూర్ణమౌట మా
నవుడు కృత్రిమ సౌఖ్యముల శరణు కోరెడిని.
పచ్చికల పట్టు ల న్వరలు నసుఖమ్ముచే
ముచ్చటై నట్టి భవనములు నిర్మించుకొనె.

ప్రకృతిసమ సుందరము లతుల సుఖ మంజులము
లకృత్రిమ భ్రాంతి హరణ సుధాభరితములు.
శాద్వలామోద సౌధముల వే గల్పించు
నుద్వహుండై ప్రకృతి లీల మించు నతృప్తి.

శీతవాతాతపత భీతిల్లియే గాదె
చేతనైనంత దచ్ఛమనమున యత్నించు."
"ఎంత కోమలములీ పుష్ప రాజమ్ములును
స్వాంతమ్ము తన్మయం బగు వాని వాసనల

ఎంత మధురము పక్షిసంతాన కలరవము
చెంతనే కోకిలా కలగాన మధురిమము."
"కోమల సుమమ్ములో గొనలుదే ఱెడు ముండ్లు
దీమముగ దిరుగాడు తేటి గమి మంజరులు

కలిగినసుగంధమ్ము గాలి పాలౌచుండు
వలచు వారల గొద్దికాలమే భ్రమ నింపు.
కలరవమ్ములయందు గాన మహిమము లేదు
కలుగు మానిసి కంఠమున మించు మధురతయు

భావ హీనము నైన సంగీత మయ్యదియు
రావ మొక్కటి యెత్తుగడ లేమియును లేవు.
పంచమత్వము నెందె గోకిలాగానమ్ము
పంచు కొందుమె వినుచు పరవశత్వము నెందు

తరణి! ప్రకృతిని గల్గు నసుఖమ్ము చూచితే
ధరణి దానిని మించు దాని చేసెను నరుడు."
చకితయ్యెనది యశోధర వానితర్కమున
ప్రకృతి సౌందర్యముగ్ధగ విభ్రమతపల్కె

"బీజగుప్తా! ముందు వెలయు ప్రపాతమున
రాజిలెడు కాలువన్ బావురాయిల గుములు
నిఖిల దుర్గుణ సమితి నిండు మనుజుల కన్న
సుఖులు గాదా కేళులందేలు పావురాల్?

నాకు రెక్కలు గల్గి పారువమ్ము గమూరి
చీకాకు లెడల నేపారుచుండ దలంతు"
మంద హాసము చింద సామంతు డిట్లనియె
"మగువ! కపోతిగా మానవత గోరెదవు

ఈకపోతి సుఖాప్త నిశ్చింత నిశ్చరతు
తాకలిత యం చెంచెదవు చంచ లేక్షణా!
భ్రమయేల? వినుము, కోరిక తీరు టేసుఖము
రమణి! అదితీరమియె ప్రబలదుఃఖం బంద్రడు

ఈ పశులకు గోర్కి తీఱు టటు లుండని
మ్మెపగిది కలుగు గోరికలు వానికి నెప్డు
మనుజు డిందులకె శ్రేష్ఠుడు విన్మ వనజాక్షి!
కనును కోరికలు దీరుట చేత సుఖములను.

కర్తయగు మనుజుండు కర్మజేయుట కొఱకు
బూర్తిగా నధికారి పుట్టె నందుల కిందు
పశుపక్షి గణము లబ్ధాన్నమున దగులాడు
పశువు కన్నశ్రమించు మనుజు డన్నముకొఱకు.

కృషిచేసి యన్న ముత్పత్తి సేయును నరుడు
కృషి వినా ప్రకృతిలో వస్తువుల్ దిను నవ్వి
పురుగు పుట్టను దినుచు బులుగు వృద్ధిని గాంచు
పరజీవి దిని పశుప్రతతి జీవిక బుచ్చు

పగ బట్టు కొనియెనా పశులకు దురవస్థ
పగవాని బారి తప్పక జింతిలుట దోచు
అనుకొందు వీవు సుందరి! ప్రకృతిలోన నీ
వనుకున్న తృప్తి తప్పక లభించు నటంచు

రాజభవనములందు రాజిల్లు నీ వట్లు
మోజు తొలగుచు బ్రకృతిలో నుండ గోరెదవు
ప్రకృతిలో సుఖ మంచు పరమప్రశాంతి యని
సుకృతి ప్రకృతిని నిల్చి చొప్పారు చుండునని

భావించి యుందు వోదేవి! గ్రామీణులవి
భావములు గుర్తించు ప్రశ్నించు వారలను
దాసదాసీ జనంబుల సేవ గొనుచుండి
వాసిగల సుఖులు నీ భవన వాసుల టంర్డు

కృత్రిమోపవనంబు గీర్తింతు వింకేల?
చిత్ర మిం దేముంది? చేరు మిపు డడవులను
క్షుధిత పంచాస్యం బస్రుగ్రక్త జిహ్వాతో
వ్యథితమ్మై తిరుగు టకుల దోచు నెంతయును.

పొదలలో బొదలు సర్పములు లోకుల గఱచి
మది నకారణ బుద్ధి మృతుల నొనరించుటయు
నదులలో మకరములు మెదలు మానవు మ్రింగు
హృదయముల నవకాశమును పేచియుండుటయు

చూచి గుర్తించెదవు సుందరీ! ప్రకృతిలో
చూచెదో? కృత్రిమత చూచెదో సుఖములను"
చకితయయ్యె మృగాక్షి, శ్రద్ధ భక్తిగ మారె
ప్రకట విద్వాంసు డీ బీజ గుప్తుం డంచు.

మన్నించ ప్రార్థించి ప్రశ్నించె "నోయార్య!
ఇన్ని యెక్కడ? యెన్ని నాళ్లలో నేర్చితని?"
"విశ్వ విద్యాలయము విశ్వవిద్యాలయము
శశ్వత్ప్రణాళికల జెలువొందు సుందరీ!

వికట పరిస్థితుల్ విప్పార బోధించె
ప్రకటాను భవ సార పాఠ పాఠనశక్తి."
జల పానసమయమ్మై "జవ్వనీ! పోదమా!"
"చల మేల? పోద" మని చనిరి భవనము వైపు

అప్రసన్నుండైన బీజ గుప్తున కనియె
కప్రమ్ము చల్వ చిందెడు పల్కుతో దన్వి.
"అన్యమనస్కు లై యనఘ! యుంటిరి మీరు
ధన్య నయ్యెద గారణము తెల్పియుండినను."

"దేవీ! యశోధరా! దుఃఖినౌ కారణము
భావింప నీకు ననుచిత మంచు నెంచెదను."
"ఏమి? ఆకారణము గుప్తమా? వల్దైన"
"ఏమి గుప్తము గల్గదీ బీజగుప్తునకు

గుప్త ముంచుట భీతి కాలవాల మ్మౌను
దప్పుడై దోషిగా దనకు దానే మారు
ఏది నేజేసితినో? హిత మెంతు గావుననె
ఏదియును నాయందు గుప్తమై యుండ దిల

చెప్పగా నొప్పుమికి చిన్న హేతువు కలదు
తప్పు తన దుఃఖ మ్మితరుల బాధించినన్‌'
మౌనమున నయ్యశోధర యుండ భవనమున
గాన బడి రెదురు చూచుచు వటుడు వృద్ధుడును.

బీజగుప్తుని బొగడె, శ్వేతాంకుడును గనలె
రాజముఖి యిద్దఱిని బ్రతిమగా దిలకించె
బీజగుప్తునివ్యథకు జింతించెవృద్ధుండు
సాజమని తలపోసి జవ్వనియు జింతించె

తన పరాధీనతకు గనలె శ్వేతాంకుండు
మనసా సహించు భూతిని దెల్పె వృద్ధుండు.
పయనమ్మై చనియుభాగీరథిని గాంచి రట
భయభక్తు లొప్ప నీశ్వరుపూజసేసిరట

ఆశ్రితార్తుల కర్థి దానాదికము సేసి
విశ్రాంతి భవనమున విశ్రమించిరివారు.

## 16. అవాంఛితము

ఆకర్షణ శక్తి గలుగు
నట్టివార లెదుటివారి
నాకర్షించుక దాసులు
నైన సంతసం పడుదురు

చిత్రలేఖ లోని శక్తి
చెలువ తెలియలేదుగాని
చిత్రముగా వశముగాగ
శ్రేష్ఠుల దాసుల చేసెడు.

అనుద్దేశ్యపూర్వకముగ
నాకర్షించును వారల
వినుత గుణుడు కుమారగిరి
వింతగ లోబడె నామెకు.

కుమార గిరి కుటిలోపల
కోమలి నివసించి యుంట
ప్రమాదముగ నాతంకత
పడతి గాంచు యోగివరుడు

ఎంత దూరముండ దలచు
నంత నికటమగు చుండును
స్వాంత మెంత బిగబట్టిన
కాంత చెంత గరుగుచుండె.

గాధిసుతుడు మేనకతో
కర్మభ్రష్టత గాంచుట
బాధగ మది స్మరణకలిగి
వేధ పొందు యోగి వరుడు

మఘువు వంటివాడు కూడ
మగువ తగుల మాశపొంది
అఘుడై ముని శాపమ్మున
నవమానితు డయ్యె గదా!

ఈ యాలోచన మదిలో
నెంతో కలవర పరచెను
మాయ యైన తరుణి యెడల
మనసు దగ్గ ఉగుట తోచె.

ధ్యానావస్థితివేళను
చానలోన ప్రవేశించి
తానె చేయు గుటీరమును
తగురీతిగ పరి శుభ్రము

గజగమనా గమనము పొడ
గాంచి నంత ముని వర్యుడు
నిజ హృదయము నాపలేక
నేత్రయుగళి విప్పు, మూయు,

క్షణములోన నేణాక్షిని
కని తన్మయ మందుకతన
ప్రణయకళామూర్తి యనుచు
భావించును మనమందున,

చిత్రలేఖ కుమారగిరి
చే నాకర్షింప బడియె
నాత్రపడియె నతని ప్రేమ
యందు మునుక లిడ దలంచి,

ఆశ్రమవాతావరణము
నం దడు గిడి నంతనె మది
సుశ్రోణి మరల్చె దపము
చొప్పు సాధనమున మనము,

మార్చు కొనె నభిప్రాయము
మాని కడ్డు గాదలచదు
చేర్చుకొనిన దాని కౌఁగి
చిత్తమున గృతజ్ఞత గొనె.

గత జీవిత మందు గలుగు
వెతల సుఖమ్ముల భేదము
వితగా ముక్తికి దెరువును
వెదుక దలచు జిత్రలేఖ.

దీపము కొండెక్కె నంత
రూపు తోచ దాచీకటి
తాపసి జపమున మునిగిన
తరుణి రాక చప్పు డయ్యె.

చీకటిలో గనులుదెఱచి
చిత్రలేఖ వంక జూచి
తేకువ గొని కుమారగిరి
"దేవి! చిత్రలేఖా!" యనె.

చకితయైన చిత్రలేఖ
సరగ లేచి యిట్లు పలికె.
"అకటా! మీరలు ధ్యానము
నం దుండుట భావించితి.

ఇప్పుడు మీ ధ్యానమ్మున
కింత పేధ కలుగనయ్యొ
తప్పుసైచు గురు దేవా!
తక్షణమే వెడలి పోదు."

"పోవలసిన పని లే దిట
పొందుట లే దేసమాధి
దేవి! వినోదాలాపము
గా వలచెద నీరోజున.

'ఆలోచించెద దరుణీ!
అవనిధర్మ కర్మములను
లీల గలిపి జీవించగ
లేకపోవునా మనుజుడు?'

"అర్థము గాలేదు స్వామి"
"అతివా! నీ విటకును దీ
షార్థము చనుదెంచితి విం
ద బద్ధమున్నదె? చెలువా!

నాడు నన్ను ప్రేమించుట
నాతో ననినావు గదా!"
"నాడు వల్కినది నిజమే"
"నాతి! ప్రేమ కర్థమేమి?"

"రెండాత్మల సంబంధము
నిండుగ నిలబెట్టు కొనుట"
"మెండుగ నీపరిభాషను
రెండాత్మల సంబంధము

ఇద్దఱు మనుజుల బంధము
ఈశ్వర మనుజుల బంధము
కద్దు గదా! అవకాశము
కలదా? లేదా? చెపుమా?"

"మీ మతమున నాత్మ యనగ
మేదిని నీశ్వరు భాగము
ప్రేమ కావునని యిద్దఱి
రీతి బద్ధమగును గదా!"

"ఈ దిన మొక యాలోచన
ఏర్పడె నాకు దలోదరి!
ఏది యనిన విరాగ మన
నిల మనిషి కసంభవ మని"

అకుటిలతను జవ్వని యను
"ఆర్యా! ఇది యెట్టులగును?"
"నకారాత్మకము విరక్తి
సకలశూన్య భరిత మ్మిది.

ఈతండు విరాగి యనుచు
నెంచులోక మిది వింతగు
ఖ్యాతిగ నీ విశ్వమందు
కలుగునే విరక్తు డొకడు.

ఐహిక వాంఛల విరాగ
మదియు ముక్తి కనురాగము
దేహి గోరు ముక్తి సదా
దివ్యత్వము గూడ గదా!

సృజనాత్మక శక్తి గదా
సృష్టి, నాశనాత్మకమా?
నిజముగను విరాగి కూడ
నిశ్చలానురాగి యగును.

పురుషు డెటు విరక్తు డగును
ముక్తి గోరి తప మొనర్చు
పురుషోత్తము పైని భక్తి
భూతలవస్తు విరక్తియె?

విరాగి యన బడు వాడిల
విరాగి గా డెపుడు గాని
పరాత్పరుని యనురాగిగ
పరిఢవిల్లు జగతిలోన.

ప్రపంచమున విరాగియై
పరబ్రహ్మ ననురాగిగ
తపంబును బొనర్చుటచే
తలచదగునె యొక్కనిగా?"

బెదిరిపోయె చిత్రలేఖ
ముదిత మదికి నతని శక్తి
విదిత మతని బలహీనత
విహ్వాలమున బలికె నిటుల.

"గురుదేవా! అసమర్థను
గురుతించగ లేను దాని
గురుతు తెలియ నరు దెంచిన
గరితను బ్రహ్మను దెలుపుమ!"

"సత్యమొ్మ చిత్రలేఖ!
జ్ఞానము తార్కిక వస్తువె?
నిత్యానుభవ ప్రాహ్యము
నిర్మల చిత్తమున గలుగు."

ఈ కుతర్క మేల గలిగె
నెఱుగజాల నాత్మలోన
ఆకులతను బ్రబలమగుచు
నంతరాత్మ గలచివేయు,

విశ్వమున నుదాసీనత
ఈశ్వరు ననురాగ మందు
శాశ్వతమా? తెలియువరకు
శాంతియుండ బోదు మదికి

తనలో నిది యేటి మార్పు?
తరుణి చింత సేయ దొడగె
మునుయోగిని ప్రేమ గోరి
తనకు దానె వచ్చిన దిటు.

తాను తెలిసె యోగివలన
దరము గా ద టనుచు, నగర
మానసికాశాంతి తోడ
మహాబ్రతుకుట దుర్భరమని,

ఏకాంతమునందు శాంతి
యేర్పడునని నమ్మియుండె
లౌకిక దృష్టికి జూచిన
సాకల్యంబుగ దెలియును.

ఎంత సుఖము లనుభవించి
యేమి? మదికి దృప్తిలేక
శాంతస్థానమ్ము కుటిని
కాంత మనసు కరుగజేసె

తృప్తిగలిగె సుఖముగలిగె
తేజరిలుచు యోగిచెంత
తప్త హృదయ మార్ద్రమయ్యె
తరుణి చింత లోన మునిగె.

మౌని కొంత మౌనమ్మున
మసలి పలికె, "మధుర భాషి
ణీ! నీతో సంబంధ మ
నేక జన్మ లను కొందును"

తాను గూడ తలచె నిట్లు
తాను యోగి జేరు మున్ను
"కాని పూర్వజన్మగతుల
కల దస్పష్టత తెలియగ"

చిరునవ్వున యోగి యనియె
"తరుణీ! పొరపాటువడుట
నరున కసహజమ్ముగాదు
నా నమ్మకమును దెలిపితి.

ఐన నొకటి తెలుపవలయు
నాకర్షణ శక్తి మతివి
దీని నేడ గ్రహించితివో
తెలియ జెప్పు మోమృగాక్షి!"

బుగ్గ లెఱ్ఱనయ్యె నటికి
పొసగ నెన్నొ యేళ్ళ పిదప
సిగ్గు వొడమి నట్లు తోచె
శిరమువంచి యిట్లు పలికె.

"ఆకర్షణ శక్తి గలదె?
ఆశ్చర్యము! నేనెఱుగను
ప్రాకృతనోగురుదేవా!"
పరమయోగి లేచి నిలిచె.

"నేడు సమాధిని జిత్తము
నిలుచుట లే దంబుజాక్షి!
నేడు నిరాకారార్చన
నిలువదు మది యేలకొ మరి?

ఏల యిట్లు తోచుచుండె
హృదయము సాకార మనును"
లీలగ నటి కడ కరుగుచు
కా లాపెను నటి జూచుచు.

"నెలతా! నేనింతవరకు
నిరాకార ముపాసించి
వలంతినిగ సాకారో
పాసన చేయందలంతు.

నేనొకటి ప్రయోగించగ
బూనితి, నీసాయ మిష్ట
నేను గోరు చుంటి లెమ్ము"
నెలత వణకె నిలు వెల్లను

యోగిముఖము వికృత మగుట
యోష గుర్తు పట్టెనట్లు
యోగి ముఖజ్వాలలుగని
యువిద భీతిసెందె నపుడు

లేచి నిలిచె దనశక్తులు
లేనియటుల తోచ దొడగె
చూచునంతలోన యోగి
సుందరీకరమ్ము వట్టె.

జ్వలితలోహమును దాకిన
సరళి దోచె నర్తకి కటు
జ్వలించెడును యోగితనువు
సొంతము, వచియించె నిట్లు

"వనితా! నా సాకారో
పాసన దోడగుట వలతు
నిను." "నది యేమిటి" "తెలియుమ
నీవే లక్ష్య మ్మయ్యెదు."

తాను వచ్చె నందులకే
కాని కోరి నదియు పేరు
మానుగ మలయానిలముల
గాని విలయరోచు లివియ

"గురుదేవా!" అనునంతనె
తరుణి గౌగిలించె నతడు
పరువడి పెదవుల గలిపెను
వణకె నపుడు బింబాధర,

"చిత్రలేఖ! నిను ప్రేమిం
చితిని" యనుచు జుంబించెను
చిత్రలేఖ యోగి పేడి
చేత గనలి పోవు చుండె.

విద్యుద్వాహిక దాకిన
విధముతోచె నబల మదికి
సద్యస్సాహసము తోడ
జవ్వని తల దిప్పికొనియె

ఆలింగన పాశమందు
నాలోలాక్షియు దడబడె
తేలిపోవునట్లు తోచె
తేజోయోగమున నాడు.

కౌగిలింత విడదీయుచు
యోగి కనియె జిత్రలేఖ
"యోగివరా! మార్గచ్యుతి
యుక్తత తగునా దేవా!"

వెనుక కొదిగె గురుదేవుడు
వెలవెలగా ముఖముగాగ
తను చేసిన దేమిటనియు
దరుణిని "క్షమియించు"మనియె.

వేగముగా బయటకేగు
యోగి గనుచు గూర్చొనియెను
రాగాధరములు వణకగ
రమణి చింతసేసె దీని.

తాను వచ్చినది దేనికి?
కాని జరిగినది యేమిటి?
తాను నిలువ దగ దిటు యని
మానసమున దలంచినది.

ఏమి చూచి యాకర్షణ?
ఎంతలోన వింత మార్పు?
భూమిపైన బండుకొనియె
పొలతి వెక్కి వెక్కి యేడ్చె

తన సాధన పతనమునకు
దారితీసె, యోగియంత
ఘనుడే పతనుండౌటకు
వనిత మనమునందు గలగె.

తాను కోరినది యేమిటి?
తాను చేసినది యేమిటి?
కాని పొందినది యేమిటి?
మానరాని వేదనయా?

దీనికన్న మునుపటిగతి
మాననీయమని తలచుచు
చాన చింత చేసి చేసి
సరగున నిద్రను మునిగెను.

మైదానమునందు యోగి
మాటికి నటునిటుదిరిగెడు
నేదిగూడ తోచకుండ
నేదె దనదు శక్తులెల్ల

మండెనపుడు శరీరమ్ము
మస్తిష్కము మండునిపుడు
నిండు సుఖము మొదటి దాన
రెండవ దానిని దుఃఖము

తన కార్యక్షేత్రమున బ
తన మగుటయు జరుగుచుండె
తన నిర్బలతా విజయము
తప్పక సాధించవలయు.

చిమ్మచీకటికి నెదురుగ
చిన్నవెలుగులును వెనుకగ
"నమ్మకమ్ము పతనములో
నాకు నిగ్రహ మలతియా

కా ద దెన్నటికైన నే
గాచుకొనగ వలయు గదా
కాదనం గలనే యనం
గా ననుచును దూరము జనె

పిరికి వి సోమరివి యనుచు
విన వచ్చెను మది నుండియు
పిరికివిగాకేమినీవు
విడిచితివే సాధన నిటు?

నిర్బలత జయించుటయే
నిస్తుల సాధన గాదా?
దౌర్బల మెందుకు? తానెం
దులగెలువడొ? అపూర్ణుడొ

నిన్ను నీవు గెలుచుటకే
నీకడ కర దెంచె దరుణి
నిన్ను బతను జేయలేదు
నీవే భయపడు చుంటివి.

నిర్బలతయు నీలోనిది
నేడు దూర మొనరించుము
దుర్బలుడవు గాకుమిపుడు
దూర మేగె దది యేటికి?

అంతరాత్మ బోధ తెలిసి
ఔనిది సత్య మ్మటంచు
చింతజేసి యోగి కుటిని
జేరి నటిని జూచె నపుడు

నిద్రపోవు నటి చెక్కుల
ముద్రవేసె బాష్పమ్ములు
భద్రముగా తల వైపున
వంగె నటీ ముఖముపైన

చిరున వ్వొక టధరమ్మున
చెలగి నటుల కనిపించెను
తరుణిపెదవి ముద్దిడుకొని
తక్షణమే వెనుక కొదిగె

పెదవి యెంత చల్లబడియె
వింత! ఎంత నిర్జీవము?
హృదయ మదిరి కూర్చొనియెను
మది సమాధి నిలువదాయె.

అవమానము మదికి తెలిసి
అవని క్రుంగినట్లు తోచె
భవిత తానె గెలువ దలచి
ప్రక్క కొదిగి శయనించెను



## 17. వివేచనము

ప్రాతఃకాలముకాగా
పడతి లేచి చూచె వింత
ప్రాతర్నియమప్రతికూ
లాతతగతి మునిపడుకొనె

తల బరు వయ్యెను నెలతకు
వెలికరిగెను, వేడికలిగె
కల లెన్నో కలిగె రాత్రి
వెలది మొగము వెల వెలయ్యె

దూరమ్మున మఱ్ఱినీడ
తోచెను విశాల దేవుం
డారాధనయందు మునిగి,
యతివ చింతసేయ దొడగె.

యోగివద్ద నిక యుండుట
ఉచితమ్మా? కాదా? యిది
తీగలాగ డొంక కదులు
లాగైనది యేమిసేతు.?

ఎటు బోవలె? నీముఖమ్ము
నెటు జూపుదు నార్యున కిక
ఎటు నను నంగీకరించు?
నిటు వీనికి బదులు లేదు.

వచ్చెను విశాలదేవుని
వద్ద కతివ, అంత గనులు
విచ్చి నమస్కార మనియె
విశాల దేవుం డామెకు

ప్రతినమస్కారమ్ముతో
పడతి నిల్చిన వటుడు త
త్ప్రతిగ వింతను బడుచు నా
వనితతో నిట్లని యనెన్

"దేవీ! నాతో జెప్పున
దేమియైన కలిగినదా?"
నా విని యా చిత్రలేఖ
నవ్వి పలికె గల దం చని

"ఆవశ్యకమైన మాట
యైన ప్రతిన సేయవలయు
నీవిషయము నితరులతో
నీవెప్పుడు చెప్ప ననుచు"

'ప్రతిన సేతు దెలుపు' మనిన
పడతి వల్కె విచారమున
"మతిదలచెద జరిగె దప్పు
మానక యిటు వచ్చుటలో

ఉన్నతి పొందగ దలచితి
నున్నట్లే పడిపోయితి"
నన్న నవ్వి 'తెలిసి కొనుచు
నున్నా' ననె వటు డప్పుడు.

వటుని నవ్వులోని ధ్వనిని
వనిత తెలిసి, "నవ్వే దేల?
ఇటునమ్మిక కలుగ దేమి?
అటు చూచితివా నాడును.

ఐన నీకు వివరించెద
మౌని నేను ప్రేమించగ
బూని యిటుకు వచ్చినాను
కాని దాని జేయలేను.

తోచుచుండె నాపతనము
తోడ్తోడన గుమారగిరి
తోచు నిదియ పాపముగా
తోడుపడెదె తొలగించగ”

“నే సంసిద్ధుడ దీనికి”
నా సంతోషమున నటియు
‘వాస మెరుగుదే యార్యుని
భవనమ్మున వటుడుండును.

అతని తోడ జెప్పవలయు
నతని గలియ గోరుదు’ నని
అతడు సరే యనునంతలో
అలికి డయ్యె యోగిరాక,

మాట లాగి పోయె నంత
నోటువడిన మానిసిగా
చోటు చేసికొనియె నచట
మాటలేక మౌని నిలిచె

కొంతమౌన మూని యోగి
“ఇంత సేపు నిద్రించితి
నెంతో దుఃఖము నా” కని
చింతించెను నవ్వదలచి.

అని ముందుకు నరుగు గురుని
యాననమ్ము శిష్యుడు గని
వినుత గుణుని ముఖకవళిక
వింత యనుచు మదిని దలచి.

“దేవి! నేడు గురుదేవుడు
తెలియు నాకు నస్వస్థత?”
నా విని యనె జిత్రలేఖ
“ఔను గురుం డస్వస్థుడె

దాని కారణము నే నీ
స్థానమున వసించుటయే
కాన వేడితిని సాయము,
కాదు నాకు- గురుని కొఱకు."

వల్లె యనుచు జనియె వటుడు
వడిగా సామంతుని గన
వెళ్లి వచ్చె సాయంతన
వేళ వరకు గుటివద్దకు

వటుడు పాటలీ పుత్రము
వరకు పోయి వచ్చు వరకు
కుటికి దూర మేగిన ముని
కూడ తిరిగి రాక పోయె

'బీజగుప్తు డచటలేడు
వెడలె గాశి కనుట తెలిసె'
బూజు పట్టు భవనముగతి
ముఖము మారె నటి కంతట

"ఏమి చేయుదము వటుడా!"
"ఏమి తోచలేదు నాకు"
"ఏమియు నాకును తోచదు
ఇదివిధి విధి యేమిసేతు?

విధి విధానమే కా దిది
విపుల పాపఫల మయ్యెడు
విధి యిచ్చిన యాధారము
విడిచి నడచి బేలనైతి.

కాదు కాదు జ్ఞాని గాగ
కావలెనని వచ్చినాను
నాదు జ్ఞాన మిదియేనా?
నాకిచ్చును భగవంతుడు

కాని యేల యివి యన్నియు?
నేనేమియు జేయ జాల?
నేనే మిటి? గురు దేవుడు
నీవును జేయగ జాలరు

భగవంతుడు చేయలేడు
వలసినపని జరిగి పోవు''
ముగుద పిచ్చిదైనట్టులు
ముఖము వికృతి గాంచె నపుడు

ఆవేశము తోడవణకు
నట్టి చిత్రలేఖ గనుచు
నా విశాల దేవుడు చిం
తావిలుడై యిట్లు పలికె.

"దేవీ! మీ రిప్పుడు గత
జీవితమున జేరలేరె?''
నావిని నవ్వుచు "మూర్ఖత
నటనా? నిజమా! వటుడా!

ముందు కేను వచ్చితి నన
పోవుటకేనా వెనుకకు?
ముందు వదలి వెనుక కరుగ
నందు దాని పిరికి యనుచు

ప్రకృతి విరుద్ధం బిది యని
ప్రపంచమున వెనుక కరుగు
ప్రకృతి మనిషి కుండిన యా
ప్రబలు డెవడు తెలుపు మిపుడు

క్షణ క్షణమునడచి మనిషి
కడకు మృత్యు ముఖము జేరు
క్షణము వెనుక పోగలిగిన
కాడే మృత్యుంజయుడుగ.

పాప పథమునందుగాని
భవ్యపుణ్య మందు గాని
యేపగిదిన ముందు నడక
యే శరణము తెలియు మిదియు."

అనుచు జిత్రలేఖ వడిగ
నరిగె ముందు ముని జనుగతి.
కనలె మదిని గుమారగిరి
కాంతామణి నిజానుగతి.

లేచి నిలిచినంత జిత్ర
లేఖ పలికె "నీ దినమున
జూచితి గుటి కరుగకుంట
చోద్యమ్మిది" యనిన నతడు

"సత్యము! నే బోకుంటిని,
జవరాలా! కుటి కేగుట
నత్యంతము భయా వహం
బగుట నశక్తు డనయితిని."

"ఐన దాని కుపాయంబు"
"అది యొకటే నీకు తెలుసు"
"నే నెఱిగిన దది యేమిటి?"
"నే నమ్మితి సాకారము

సాకారార్చన కొఱకై
సాయము నీయది కావలె"
"సాకారార్చన భ్రమయగు
చందము తెలియుడి మీరలు"

"ఈ నిర్ణయ మొనరించుట
ఇంతీ! నీవంతు గాదు
నేను గురుడ శిష్యవీవు
నీపని నాబోధ వినుట."

అనుచు నిలిచె గుమారగిరి
అడల దతివ సుంతయేని.
"వినుము యోగి! ఇది మరువకు
వింత విషయ మనుకో కిది

నీముందఱ నిలుచుండిన
నెలత నిస్సహాయ యనుచు
భీమముగా శాసించెదు
విశ్వసింతు శిష్యునుగా.

భ్రమ సెందెద వంతెగాదు
వంచన నీకైనీవే
శ్రమపడె దాజ్ఞాపించుట
చానపైన ననుకొందువె?

ఈ విషయ మ్మెఱుగుదువా?
ఎవరిని శాసించ దలతు
వా వనితయె నిన్ను దాసు
గావించిన దక్ష యనుచు."

నిస్తేజత నిలిచె యోగి
నిర్భర కరుణాస్వరమున
ప్రస్తుతమున కనియె నిట్లు
"పడతీ! ప్రేమించితి" నని.

పకపక నవ్విన వెలంది
"పరిచయమ్మ నీప్రేమయు
ప్రకటించెద నిన్నునేను
వలచకుంటి నిది తెలియుము.

నీపై నధికారమ్మును
నే నొక క్షణమున గోరితి
నాపై యత్నించి యుంటి
నది సఫలమ్మయ్యె గాని

పురుషునిపై నధికారము
పొలతిచేయ బ్రేమ యగునె?
తరుణి పురుషు శాసించగ
దగదు ప్రకృతి శాసన మిది.

శాసితయ్యె యుంటకొఱకు
జగతి జన్మ గొనె నాడుది
శాసితయె కా దాత్మ వి
స్మరణగూడ జరుగ వలయు

తనకు మించు దుర్బలునెడ
తనర దతివ ప్రేమ యెపుడు
తన కాధిక్యత గలిగిన
తరుణి యెటుల బ్రేమించెడు

ఆత్మసమర్పణ ప్రేమికు
నస్తిత్వముతో గలియుట
ఆత్మల బంధ మ్మదియే
అమరమ్మై యెసలారును

కావుననే పడతియు దన
పై విజయుని వరించెడును.
ఈవిషయమునే దెలియక
జీవికతో గూడ చెడును

యోగీ! మగవాని ప్రేమ
యువిదపైన నధికారము
భోగ విలాసముల దనను
పొలతిప్రేమ సమర్పితము.

కాని నేను స్వామిని నిట
మానస దాసుడవు నీవు
నే నధికృతి పొందినాను.
నీ వాత్మ సమర్పించితి.

బలహీనత తెలిసిపోయె
పరమస్థితి తొలగి పోయె
పొలతి ప్రేమ కేవిధముగ
దలచితి వధికారి ననుచు"

యోగి మౌనమున వినియెను
యోష పలుకు కటువైనను
బాగుగ నాలోచించిన
పరమ సత్య మనిపించును

తనబలహీనత తెలిసెను
తత్పరుడై యోచించెను
తన పరాజయపు వికార
తనుగాంచుచు వికలుడయ్యె

కొంత సేపు చింతించిన
యంత మౌని నిలిచె నచట
కాంతతోడ పలుకదలచి
కనులు వెలుగ నిట్టు లనియె

"నిజ మాత్మ సమర్పణనే
నీయెడ నొనరించియుంటి
నిజముగ నోడితి నంచును
నిరూపింపబడితి నేను.

అవ్యయుండు నీద్వారా
అభిమానము భంగపఱచె
భవ్యముగా నా లఘుతను
ప్రతిబింబ మొనర్చినాడు

ఇంతి! నిన్ను గెలుచుటకై
ఇంక నిశ్చయించినాను
స్వాంతమ్మున ప్రేమగాదు
సదావిజయ సాధనకై

నన్ను నేన యుద్ధరించ
నమ్ము మింక భవితలోన
నన్ను నిర్బలునిగ నెంచకు
నిన్ను బాధ్య సేయబోను."

"దీన సహాయము సేయగ
బూనెద నోగురుదేవా!"
"దీన సహాయము సేయుట
దేనివలన? నెట్లు గుదురు?"

"గురు దేవుని యాశ్రమమును
సరగ వదుల దలచు కొంటి
గురుతించితి నారాకను
గుర్వపరాధము సేసితి."

"ఇది యసంభవము నర్తకి!
ఇచటు విడువ నీకు దగదు
ముదితా! నీవెడలుటచే
ముందు విజయ మెవరిపైన"

"నాపై విజయము గాదది
నీపై నీవిజయ మగును
నా పొందిక విజయి వగుట
నమ్మజాల, బోవదగును."

కోపమ్మున గుమారగిరి
"కోమలి! నీ వుండవలయు
నీపగిదిగ దుర్బలుడగు
తాపసిగా దలచబోకు

నీవు పోయితేని పగను
నేనెవ్వరియందు లేక
నే విజయము పొందగలుగు
టెట్లు గు? నిలువంగ వలయు.

విఫలుడ నైతిని నీతో
వెడల నీను నిన్నుదేవి!
సఫలత కనిపించువరకు
జ్ఞప్తి యుంచుకొనుమునీవు."

"పోనీవా? చిత్ర మ్మిది
చానను నన్నాపగలవె?"
"నేనేమిటి? విశ్వములో
గాని నిన్ను నాప డెవడు

ప్రార్థించెదనో తరుణీ!
ఆగ్రహమ్ము ననురోధము
నర్థినాకు గలవు నమ్ము
మతివ! నన్ను బడద్రోసితి."

"పతనము నా వలన కాదు
స్వాయముగానె పతన మైతి
వితయగు నీశ్రమ మెల్లను
వెఱ్ఱివయితి మతిమదమున

కాని దాన చేయగలదు"
మౌని యనియె "దలోదరీ!
నేనే పతనం బందితి
మానక యభివృద్ధి వలయు.

పైకెత్తుట నాపని యగు
పైకి వత్తు నీకతమున
రాకయుండ వలయు గాని
రమణీ! పోవుట తగునే?"

"అవధి యెంత తెలుపు మనిన"
"అవని నేను గెల్చితినా?
ఉవరాలా! పోదు వెటుకు
చను" మని నిలిపెడు నాతడు.

"పోవు వరకు నుందు నిచట
బొబ్బలిడిన లాభమేమి?
పోవగలను తలచినపుడు
పోవున ప్పు డాపలేవు"

## 18. విహారము

తన సమ్మతి లేకుండగ
తరుణి చిత్రలేఖ చనియె
తన కోరిక కననుకూల
తను యశోధరయు జేరెను.

ఈ సమస్యా బీజగుప్తు
నెంతో కలవర పరచెను
వే సమయు నశాంతి యంచు
విచ్చేసెను కాశి కతడు.

ఛాయా చిత్రత నర్తకి
చాయ కన్నులందు దోచు
నీ యశోధరా రూపము
మాయ జేయు దాని నపుడు

పదుగురితో గలిసియుంటు
వదలినట్లు దుఃఖ మిలను
మది నాలోచన తరగల
మరల విశ్వ రూప మగును.

వారము దినములు గడచిన
మూర దాత్మ, సామంతుడు
ఘోర పరాజయ మిది యని
కుమిలి కుమిలి గడుపుచుండె.

సాయం సమయ మ్మయ్యోను
సల్లాపము చేయుచుండి
రాయాసాపనయంబున
నందఱు గుమి గూడియుండి

"కాశియందు నివసించం
గాదలచెద, గార్హస్థ్య స
దాశయ మవరోధించెడి"
ననియెను మృత్యుంజయుండు.

అర్థ భరిత దృక్కులతో
నతడు బీజగుప్తుజూచె
అర్థము భావించ వెఱచి
యనియె బీజగుప్తుండును

"అనురాగము విరాగంబు
నరతి రతియు గేస్తు యతియు
కనిన నల్ప భేదమ్ములు
కనిపించని యట్టులుండు.

ఆశ్చర్యము నా మాటల
నవిశ్వాసమును దోచు వి
పశ్చిద్వరు లెల్ల మెచ్చ
బలుక లేను సత్య మిదియ"

శ్వేతాంకున కవకాశము
చిక్కినపుడు మాటాడగ
చేతో మోదమున వృద్ధు
నాతత గతి సమర్థించె.

"ఆర్యా! సత్యంబెట్టిది?
అర్థ మగుట లేదు నాకు
కార్య మిపుడు వివరించగ
గాని, నాకు తోచె నిట్లు.

పరిస్థితుల యనుకూలత
బరగు సత్య మను పేరున
బరిస్థితులు నెల్లప్పుడు
వరలునేమి యొకతీరున?"

మృత్యుంజయు డతని కనియె
"మించు చింత శ్వేతాంకా!
సత్యము నీ పలుకు, కాని
సమాధాన పడలే మిట."

అనుచు బీజగుప్తు దెసకు
ననియె "గోరెదను వివరణ"
వినుమని వటు మాట కలిగి
వినిచె బీజగుప్తుండును

"విషయము స్పష్టం బైనదె
విరాగి వాస్తవత లేదు
మృషయిది, నిజముగ నున్నను
మృత్యుద్యోతక మియ్యది.

రాగ కేంద్రకము మారుట
రాజిల్లు విరాగ మనగ
రాగము కోరిక యగును వి
రాగ మ్మగు తృప్తి యిలను."

యశోధరను గాంచె నతడు
యశోధరయు గాంచె నతని
విశాల సామ్రాజ్యమ్మున
వెలిగె మౌన మధిపుని వలె.

శ్వేతాంకుడు తాజేసిన
ఘాతుకమును దలచి వగచె
పాతక మగు యజమానుని
భావమ్మును విరోధిలుట.

శ్వేతాంకుని గాంచి యతివ
చింతనెంది "బీజగుప్త!
ఈతటి మన మిట నుండుట
యెంతకాల" మని యడిగెను.

"చెప్పలేను నే వెళ్ళుట
ఎప్పుడౌనో? మీరెప్పుడు?"
విప్పుకొన్న ముఖకమలము
విమల విభాపటలి వెలిగె.

సుందర వదనారవింద
శోభ సుధలు చిలికె నేడు
అందగాడు ననిమిషుడై
యందే లగ్నుండయ్యెను.

సామంతుని కనుదోయిని
జవ్వని కళలను గాంచెను
రామ రామణీయకతను
ప్రమదంబున జుర్రుకొనియె.

ఈ దృశ్యము చూడలేక
సేవగించుకొనియె వటుడు
సాదరమున వారి కనియె
"స్వామి! నగరి కెపు డరుగుట?"

"ఇచ్చలేదు రాలే" నన
'ఇంతి నేను వత్తు' ననియె
నిచ్చ జూపి రార్యులు వా
రిద్ద తేగుదేర దలచ.

శ్వేతాంకుడు యశోధరయు
పే వెడలిరి నగరి జూడ
నాతత సంభాషణమున
యందు మునిగి రార్యు లపుడు.

"యజనం బౌనరింపదలచి
రని వింటిని యేమాయెను?"
"నిజమే, యిప్పటికి నేను
నిలిపితి నా యభిమతమ్ము."

"ఏమి కారణమ్మొకో?"
"ఇది వినుమో బీజగుప్త!
ఏమి? యజ్ఞమున బలిదా
నేచ్ఛ విడువ దోసమగునె?"

"ఆర్యులు బౌద్ధోపదేశ
మవగాహన చేసికొనరె?"
"ఆర్య బీజగుప్త! దాని
యందు సత్యమున్నదిగా

రక్తపాత లాభమేమి?"
"రహి సత్యము మీ పలు కిట"
"రక్తి గలుగు దిరుగాడగ"
"రమ్ము నగరి గని వత్తము."

జనకోలాహలము దాటి
చనిరి గంగ దిశకు వారు
చని గంగా తటమున నిలి
చిన నౌకల గాంచి రంత.

శ్వేతాంకుండు యశోధర
పే నౌకకు జేరు చుండ
శ్వేతాంకా! యను పిలుపున
పిలిచె బీజగుప్తు డతని.

గంగా పరివాహమున న
భంగురగతి దిరుగు నౌక
లం గడుజోద్యమున జూచు
చుం గమనించడు దానిని

కన్యక తన తండ్రి రాక
గని ముదమున నతని కనియె
నన్యమనస్కత నాతం
"డయ్యో నాశనం" బనియెను.

మాట వినిన యశోధరయు
మాణవకుని హెచ్చరించె
"దీటుగ జీవన సంయమ
దీక్ష వలయు నెంతోమది"

కన్యక గంభీరత గని
కనలె నతడు పలికెను సౌ
జన్యముండ దటు ప్రేమకు
సంయమమున కవని యందు.

దగ్గఱు నార్యుల గాంచుచు
దనరె మనః క్షోభ వటుడు
పగ్గె తోడ దెలిసె నతని
భావమ్ముల సామంతుడు.

"శ్వేతాంకా! మీర చ్చటు
విడిన వెనుక నిలువలేక
నాతురమున వచ్చినాము"
నా 'ముందే రమ్మంటిని'

శుష్కహాసన్ముఖత వటుడు
నిష్కపటత యశోధరయు
శిష్యులు లెగురుటు గాంచగ
స్వాగత మిచ్చిరి వారికి.

మందాకిని వేగము నా
నందమ్మును గనిరి వార
లందము చిందెడు నౌకా
యాన మతుల తృప్తి యిచ్చె.

సాయంసంధ్యా స్నానము
లాయత గతి జేయువారు
జైయభయంకర శంకర
శంభోయని మ్రొక్కువారు.

నక్తారాధన తత్పర
భక్తులు, దాన ప్రదాన
రక్తులు, శంకర భజనా
సక్తులు గనిపించుచుండ్రి.

సాయంపూజావాద్య
శ్రవణా మృత పానము నన
పాయత గంగాజలముల
పయి పయనించిరి వారలు.

"ఆర్యశ్వేతాంకా! నీ
కందము మాగధ ధానియ?
ధుర్యత దెలుపుము కాశియ?"
తొయ్యలి పల్కెది, వటుడును.

"కాశి విద్యలకు కేంద్రము
గాని పాటలీపుత్ర ని
వేశితుడను గాన సిరుల
రాశి కనుక నాకు ప్రియము!"

అనిన యశోధర యడిగెను
"ఆర్య బీజగుప్త! మీకు?
కనిన నేడు రేపు కాశి
కన్న ప్రియము లేదు నాకు"

"నేడు రేపు, దీని యర్థ
మేడబోదు గ్రహియించగ"
ఆడు వలికె నతివకంత
యిచ్చ వడిన మనమ్మతో.

"దేవియశోధర! విను మిది
దేనికైన పరిస్థితులె
మానని కారణములగును
మానిని! జడమగును చోటు.

చోటు నమ్మి యిష్టపడదు
సుందరవాతావరణము
చోటుచేసికొను హృదిలో
సుమా! చిరాభ్యస్త మగుట.

జన్మలాలనల పోషణ
సర్వుల కభిమత మయ్యెడి
సన్మిత్రులు కలుగుటచే
శాశ్వతమై యెసలారును.

బ్రతుకు జడము కాదు మనో
వర్తి సంఘమహిత మగుట
హితము పాటలీ పుత్ర
మ్మతనుత నాకగుట నిజము.

ఒకటు బరిస్థితుల సదా
వికలురుగా రెల్ల రెప్డు
ప్రకృతియు బరివర్తనమున
బరిఢవిల్ల గోరుచుండు.

క్రొత్త చోటు చూచినంత
కొనలుదేఱు నుత్సాహము
క్రొత్త ప్రాత యయిన దాక
కొంత తృప్తి గనుచునుండు.

కాన గాశి బాయుమనిన
గాన కరిగినటుల దోచు
దీనివలన దృష్టుడగా
పోనె పాటలీపుత్రము?"

నవ్వుచు నవ్వనితామణి
"ఇవ్వసుధను తర్కశీలు
రవ్వల ప్రతిభా శీలురు
నమల గుణులు మీ" రనియెను.

వటుని గాంచి వనిత పలికె
"బ్రహ్మచారి శ్వేతాంకా!
ఇటు లార్యుని బీజగుప్తు
పటుగతి జాగ్రత్త యనుచు

శ్వేతాంకుడు నవ్వి యనియె
"భీతిలేదు బీజగుప్తు
డాతతముగ సహాధ్యాయు
డగు రత్నాంబరుని యందు.

రత్నాంబరు తోడ నేను
రాగిల్లెద జాగ్రత్తగ
యత్నంబుగ ననిన కన్య
"అదియెట్టుల చెప్పగలను?"

బీజగుప్తు డనియె 'దేవి!
విప్పవచ్చు సత్యమ్మును
రాజుకొనుచు లేకుండిన
రమణి తెలియ జెప్పు' మనిన.

"సంకోచము లేదు వినుము
శంకలేదు మీయెడలను
ఇంకను భేదము గలదే
యిద్దఱిలో?, లేదు సుమ్ము.

రత్నాంబరుడగు పూజ్యుడు"
రమణి బీజగుప్తు లంత
యత్నంబున నొకరి కొకరు
హాయిగ చూచుక నిలిచిరి.

అమలములై స్పష్టములై
అతివ కనులు చెలువారెను
ధమనులలో రక్త ముడికి
దడదడతో వటుండుండె.

తలద్రిప్పెను, శ్వేతాంకుని
వలను జూచె నాతడు తన
కలత తెలిసినట్లయి వగ
కలిగి మాట మార్చె నంత.

"శ్వేతాంకా! మననగరికి
వెడలుద మిక సిద్ధపఱుపు
మా తేరును" పల్కె నంత
మాణవకుడు సంతసిల్లె.

వింత పడిరి యెదుటి వారు
వృద్ధు డనియె నిజమా? యని
"ఇంతనన్ను మన్నించుడి
ఇదియే నాదుర్గుణ మగు.

నే ప్రేరణ కాశ్రయమ్మ
నేనెఱుగను చేయు పనులు
కాన వెడల దలచితి ని
క్కాశి వదలి యింటి జాడ."

యశోధరయు నబ్బురమున
ననియె నతని కంతలోన
"యశోధనా! యితరు కొఱకు
నాలోచించగ లేరా?"

"మీరెప్పుడు రాదలచిన
మీరను మీతోనవత్తు"
"మీరు బాధ పడనేటికి?
మేము రేపు పయనింతుము"

'అంగడిలో కొన్ని కొనిన
యంతట పోవచ్చునుగద!
సంగతి గుర్తుండుటకై
సరగ మేము మరల గలము.'

## 19. మార్గ దర్శనము

వింతతోచు తనపైనే
వెలది యనిచ్చాగతిచే
నెంత దాపు కగుచున్నది
స్వాంతమేమొ అదరుచుండె.

రాత్రి వటుని ముఖకవళిక
నాత్రమ్మున జూడ కున్న
బాత్రమగును యశోధరా
భావమ్ము మనమ్మునందు.

కాశి జేర వచ్చిన దీ
కలతబాసి పోవుటకే
ఆశవదలి చిత్రలేఖ
యందు విరాగము కొఱకే.

ఆ పాటలి పుత్రమందు
హాయిగ జీవించలేక
తాపము, హృద్భారమ్మును
దగ్గించగ నిట జేరుట.

లక్ష్యహీన పథికుడుగా
లాగి తెచ్చె మన మిచటికి
లక్ష్యహీన పథికుడనా?
లగ్గు దోచ దీమాటను.

వ్యక్తి లక్ష్య హీను డగునె?
అసంభవమ్మనుట నిజము
వ్యక్తి లక్ష్యమేమిటొకో?
పలుక గలదె కర్తవ్యము?

తాను జేయ వచ్చిన పని
పూని చెప్పగల డెవ్వడు?
తాను చెప్పుటయే గాదు
తత్పరుడై నడువలేడు.

మనిషి యగును పరతంత్రుడు
ఘన పరిస్థితుల దాసుడు
చనును లక్ష్యహీనుడుగా
శక్తి యొకటి నడుపుచుండు.

విలువ మనిషి కోర్కి కేది?
వివిధమ్ములు నతని గతులు
కలుగుదాని కర్తకాడు
కల్పన, సాధన మాత్రుడు.

ఆలోచన మించి పోవ
నర్ధరాత్రి దాటిపోయె
కాలుగాలు పిల్లి వోలె
కనలుచుండె నాతడు మది.

నేడు పాటలీపుత్రము
గూడ జేరు టెందులకో?
చూడచూడ చిత్రలేఖ
తోడగు చందము తోచెడు.

నేను హరము చేసినచో
మానిని కాదనగలదా?
కాని చేయలేను, వద్దు
కాంత కడకు జేరరాదు.

ఏల? నేను వదలితినా?
ఏణాక్షియె నను బాసెన?
ఏల? విధివిధాన మ్మిది
ఏల నాకు పరితాపము?

నేనెందుకు నా జీవన
మూని కలత పాలు చేతు
మానసమున నాలోచన
మసలుకొనిన గనులుమూసె.

నిద్దురకై యత్నించును
నిర్భరవేదనత్యాగము
కద్దు నాకు నిది జీవ
గ్లానికి గారణమగునా?

జీవన భాగస్వామ్యము
చెలగదె దుఃఖమ్మున కిల?
జీవి సౌఖ్య మొకటే యా
శించి జన్మ గొనునా భువి?

సుఖదుఃఖము లీ జగతిని
జూడ సమానమహత్వత
నిఖిలమ్మున దోచుచుండు
నేబూనెద గర్తవ్యము.

ఏది నాకు కర్తవ్య?
మ్మెందు గలదటంచు లేచి
స్వాదు జలము త్రావి వడిగ
శయ్యపైన గూర్చొనియెను.

ఏది నాకు గర్తవ్య?
మ్మిలను జన్మకర్మకొఱకు
నేది? చేయు చుంటినేమి?
ఇంత యేని మది దోచదు.

కడుపుదునా గార్హస్థ్యము
కడముట్టగ? దానను వం
గడము వృద్ధి సేయుదునా?
కర్తవ్య మ్మిదియేనా?

విధినియమం బీవిధియా?
వెలది యందులకె చనెనా?
విధి వివాహ మది తప్పదె?
పేడ్కయశోధర తగునా?

అందములో జిత్రలేఖ
అమలరత్నమగును కన్య
ముందు యశోధర పెండిలి
మొగము ద్రిప్పి కొంటినేను.

ఏమొగమున నడుగ గలుగు
దింతి నీయ మృత్యుంజయు?
దా ముచ్చట పడునా నా
కామె నీయ నాతండును?

కాదు సంభవ మ్మియ్యది
కాంత పెండ్లి నూహజేయ
గాదు నాకతీత కాల
గమనమ్మున దగ దిప్పుడు.

చిత్రలేఖ నా జీవన
చింతామణి యగుట నిజము
ఆత్రపడిన చేతి కందు
నదియు జారిపోవు నిజము.

నిలిచె నతడు నిద్రరాదు
నీరజాహితుడు వచ్చెను
కలత నతం డిలువెడలుచు
గంగాతటమున కరిగెను.

రాత్రి రెండుజాము లుండె
రజనీకరు డుదయించుట
రాత్రి కింత శోభకలిగె
ప్రక్క కొదిగె సామంతుడు.

ముప్వురు వ్యక్తులు నచ్చుట
ముచ్చటాడు చుంట గనియె
ముప్వురిలో వృద్ధుడొకడు
ముడుతలు వడె ముఖమంతయు.

పరివ్రాజకుం డాతడు
పడుచువాడు నింకొక్కడు
వరుస మధ్య వయోవృద్ధ
పగిది దోచు మరియొక్కడు.

పడుచువాని ముఖమునందు
బాధతోచు, వృద్ధ మదిని
మిడిసి పడును జింత, హేతు
వడుగుచుండు సన్యాసియు.

"యువకుడు తా సన్యాసం
బొప్పుగ గోరుట గనుగొని
యువకా! తగు సమయము గా
దవని తండ్రిమాట వినుము.

నీ కర్తవ్యము సేయుట
నీ విధి" యను మాట కతడు
"నాకు రక్తి చచ్చెనయ్య
నాకు దీక్ష దయ సేయుము."

"దీక్ష గోరు నవసరమున
కీక్షణమే వచ్చితివా?
"దీక్షగోరు నాహృదయము
తేకువ గన బోదు భవిగ

విరాగమ్ము గలుగ వెనుక
వెనుక బోవలేను స్వామి
విరాగి సంసారియైన
వేరు గలదె ఆత్మహత్య?

శాంతిలేదు నామదికిని
జరిగె రెండు నేడులిట్టు
లింత తండ్రి గారి నడిగి
యెఱుగు మయ్య కరుణజూప

తండ్రియనియె నో కుమార!
తప్పక పెండిలి కమ్మా!
తీండ్రపు సతీవియోగము
తెప్పరిలుట కర్తవ్యము.

సంతులేదు నీకింతకు
సన్యాసం బేటికి ని
శ్చింతగ మరుపెండ్లితోడ
చెలగును రాగమ్ము హృదిని.

అనిన వినుచు యతియు బలికె
"విను కుమార! తండ్రి మాట
వినుత మదియు, ప్రేమ మిథ్య
వింతయైన కల్పన యది.

స్త్రీ పురుషుల సంబంధము
చెలగు బ్రపంచమ్మునసే
ఆపై భిన్నము లయ్యెడు
నాత్మల సంబంధ మ్మిటు

ప్రపంచమున గూడ వారి
ప్రవిమ లాత్మ లొకటికావు
విపులమైన యాలోచన
వెలయు నొక్కటిగ దోచును.

ఒక్క టగుట పేరగుటకు
నొక్కటియై నున్న గాదు
చిక్కువడుట బుద్ధిగాదు
చెలగి పెండ్లి యాడుమీవు.

ఇది యెట్లగు నంటివేని
విదితంబిది వెలది యబల
అదిపురుషాశ్రయము గోరు
నదియే సుమి - కర్తవ్యము.

పురుషుండాశ్రయ మీయక
పొలతి దుఃఖభాజన యగు
పురుషుడిట్టి పట్టుననే
పిరికి వాడుగా మాఱును.

అబల కాశ్రయ మీ్మయగ
నడలి దీక్ష గొనదలచిన
ప్రబలకాతరత్వ మ్మగు
వలదు బాలకా! విను మన.

"మహా ప్రభూ! భోగభాగ్య
మహిమకు దిలతర్పణమిది
మహాతపస్సాధనకై
మరల విరికితన మౌనా?"

"కాదు కాని నీతపమున
గారణ మేమిటి? యెందుకు?
నీదు ప్రేయసిని బాసిన
వేదనయే పురికొలిపెను

అందులకే వ్యర్థ మనెద
నతివ కేంద్రకము గావున,
నెందుకోర్కి లేకుండుటు
యెసగు దపం బనగ భువిని."

యోగి చరణముల వ్రాలుచు
యువకు డరిగె దండ్రివెంట
యోగి కెఱగె సామంతుడు
యోచన బడె మునివర్యుడు

అతనికనియె, "సన్యాసం
బాకాంక్షింతువె నీవును
హితము కాదు సన్యాసం
బింత వరకు నామదికిని

మీమాటలు నచ్చుటచే
మెలకువగా నిలిచినాడ"
నామునిని యిట్లని యెను చిరు
హాస్యంబున నార్యుతోడ

"ఈ తిమిరము గంగాతటి
నీతటి కరుదెంచువాడు
చేతస్సన్యాసి కాడు
చిత్తోద్విగ్నుం డయ్యెడు"

"మీయనుమానము సత్య మ
మే యోద్విగ్నుండనేను
మాయ మయ్యె మీమాటల
మరల నొక్కడడుగ వలతు"

'ఆనందమ్ముగ నడగుమ!'
అనినంతన నార్యు డనియె
"పూనిక యువకుని తోడను
బోధసేయు విధము గూర్చి"

"అసఫలంపు ప్రేమగూర్చి
యువని జీవన త్యాగ
మ్మసమానపు ఆత్మహత్య
యని చెప్పితి రిది నిజమా?

ప్రేమస్మృతి సహజముగద!
వేదన నాపుట, కృత్రిమ
మౌమార్గములందు మరచు
టాత్మహత్య! కాదా మఱి?"

మౌన ముండె సన్యాసియు
మాఱువలికె గొంత వడికి
"నీనుడి సత్య మ్మగు.గా
లాను గతిని దుఃఖము చను

భిన్న భిన్న వ్యక్తుల కది
భిన్నకాలముల బోవును
మున్నుదాని బోగొట్టగ
బూనుట యప్రాకృతికము.

అప్రాకృతికంబు గూడ
నంతట గాదాత్మహాని
అప్రాకృతికము ప్రాకృత
మయ్యె మనకు నెల్లెడలను.

వస్త్రము దాల్చుట, యశన
వ్రాత మారగించుటయును
శస్త్రము పూనుట విలాస
సాధనములు కృత్రిమములె.

ప్రకృతి పరపు బ్రతుకుభార
వశ మయ్యెడు నందులకే
సుకృతిగా దలంచుకొఱకు
సుమ్ము కళా విలసనములు

ఆటలు పాటలు నృత్యము
లానందోత్సవము లన్ని
మాటికి మనుజుడు గోరుట
మహిని బ్రకృతి నోర్వలేక

దీనిని జీవన మంటిమి
వివిధోపాయముల దుఃఖ
మూని తొలగజేసి కొనిన
యుక్త మాత్మహత్యకాదు

ఎందుకనగ నది కృత్రిమ
మేయగుటను సహజ మిదియ"
"ఇందు ధన్యవాదమ్ములు
మందబుద్ధి చురు కయ్యెను.

మీమాటలు కర్తవ్య మ
మేయం బని చాటి చెప్పె
నామస్తిష్కపు భారము
నానుం డిటు తొలగిచనియె.

పోయివత్తు నమస్కార
మోయోగీ!" యనుచుజనిన
నాయె నుదయ కాల మంత
నతడు నిద్రవోయె నపుడు

నిద్రలేచె మధ్యాహ్నము
నిండుతృప్తి సామంతుడు
భద్రపురుష మృత్యుంజయు
పాలి కరుగ నాత డనియె

"బీజగుప్త! మీ రియ్యెడ
విలంబమున లేచినారు
మోజుదీఱ నిద్ర వోవు
పోలిక తోచెను నాకిల"

"ఔను, నిద్ర లేదు నాకు
నాలోచన సాగె రాత్రి"
"నే నడిగిన తప్పగునా?"
"నేను దప్పుగా నెంచను.

భావి జీవనము గూర్చిన
పలునిందల మునిగినాడ
దేవి చిత్రలేఖ లేని
జీవితమున భావి సబబె?"

"ఏమి నిర్ణయించినాడ?"
'వేమిలేదు నేటి కింక.'
"ఏమి పయన మగుచుంటిరె?"
"ఇంక మాంద్య మేమున్నది"

ఇంతలోన బయటినుండి
ఇంతి పలుకు వినిపించెను
"ఇంతకు నీ మణి హారం
బిష్టపడడు తండ్రి చూడు."

'ఆత డిష్టపడకుండిన
శ్వేతాంకా! నీక యిత్తు'
ఆతండు సరే యనగా
నడుగిడి రవ్వారు లోన.

'ఆర్య బీజగుప్తా ! మీ
రందు సుప్తిగనుట జూచి
ధైర్యమ్మున వెడలినాము
తగు సరుకులు తెచ్చినాము

కాశి బాసి పోవునెడల
కావలసిన వస్తువులం
దాశపడుట తప్పగునా?
అందు మీరు కొన బోరా?"

"వద్దు యశోధర! నా కవి"
వనిత హారమును జూపెను
"ఇద్ది యెట్లు గలదు చెపుమ?"
"ఎంతో విలువైన దదియు

కొన లే దిది తండ్రి మెప్పు
కొఱకు దెచ్చి యుంటి నంతె"
అనిన తండ్రి, 'ఇష్టమున్న
గొనుము తల్లి! యడ్డ మేమి?

"శ్వేతాంకా! నీ వెయ్యవి
విలిచి తెచ్చి నావో?" యని
ఆతతగతి ప్రశ్న సేయు
నట్టి బీజగుప్తు గాంచి.

'మీయనుమతి లేకుండగ
నా?' యన ముద మందె విభుడు,
"ఓయశోధరా! వెడలుద
మీయన కిష్టము దేరగ"

'భుక్తి పిదప వెడలుద' మన
భోజనమ్ము గావించిరి
రక్తినగరి కరిగి రంత
రమ్య వస్తువులను గొనగ

బీజగుప్త శ్వేతాంకులు
వ్రేళ్ల కుంగరములు కొనిరి
రాజముఖియు గాంచె హార
రాజత మౌక్తిక సంగతి

దానిదీసి సామంతుడు
"మానిని! ఇది యె ట్లున్నది?"
నా నాయమ 'బాగున్నది'
నావిని కొనె నతడు దాని

యశోధరకు మెడను వేసి
యార్యుడు తన కాన్కయనియె
యశోధరయు దాని దీసి
యతని కిచ్చి "తండ్రియాజ్ఞ?"

"నీకిష్టమ్మొగద ఇది"
"నాకు దండ్రి యాజ్ఞ" యనిన
'జోకనిజముగా దోచును
సుమ్ము వెడలి పోవుద' మనె.

## 20. క్షయ వృద్ధులు

చిత్రలేఖ నడక తీరు
చిత్రమయ్యె యోగికంత
నాత్రపడియె జెంత జేర
నాత డిష్టపడక పోయె

తనకు దానె తనను జేరె
దా నేహ్యాత జూపనైన
తనకు దానె మారెనేల?
తత్వమేమొ తెలియదయ్యె.

తనపై దన కబ్బుర మగు
తరుణి జేర నీయవెఱచు
తానెందుకు చేరనిచ్చె
దరుణి మాయ యనుట మరచె.

తనపైనే తన నమ్మిక
తగ్గి పోయినట్లు తోచె
తన సాధన తన యోగము
తునుక లైన తీరు తోచె

భోగ లాలసయు, మదిరా
రాగ, రాగమధురా ధర,
రాగ రాగ మేల కలిగె?
రోగరితను గను రోగము.

విజయి తాను, పరాజయము
నిజమున నెన్నడు పొందడు
నిజబలహీనత నెఱిగియు
నెలత చేర దీసె నతడు

తరుణిమాయ యనుచు దూర
తరజీవనుడగుట విజయ
మరయగ గాదనుచు నతం
డంత బ్రయోగమ్ముచేసె..

అసఫలుండు నయ్యోదాన
నతివ నిదానము దానము
నసము నసము దిగ దుడిచెను
హాయితొలగ జేసె మదిని

విఫలత యెంతభయానక
విషయమ్మో తెలిసె నిపుడు
సఫలత జవ్వని కబ్బుట
స్థైర్య మతడు కోలుపోయె.

ఓటమి తనపై తనకే
ఆటకత్తె గెలుచు టేమి?
ఓటమికై చింత కోప
మూనుట కవకాశ మిచ్చె.

ఒక్కసారి లేచి నిలిచె
నువిద వశము గావలయును
చిక్కు విడని సమస్యయిది
చెలువను గెలువంగవలయు

ఇంతి యేల ప్రేమించదు
హేలనగా దోచె దనకు
నింతకు నాబీజగుప్త
చెంతవలపు మారినదా?

బీజగుప్త వలవమాని
వెలది నన్ను ప్రేమించును.
బీజగుప్త దొలగించిన
వెంటనె తన కాత్మ నిచ్చు.

నెలలు రెండు గడచిపోయె
నెలతవచ్చి, గత ఘటనము
నెల గడిచెను జరిగి, యింత
నిలువ గలిగె గుమారగిరి.

ఈనెలలో గుమారగిరి
ఎంతో నిశ్చలత నుండె
నానెలతకు బలహీనత
నావంతయు దెలియనీడు

పొలతి యెదుట నుండగనే
పొదలు వాసనల గెలువగ
వలయునంచు దలపోసెను
తలపు తలపుగా మిగిలెను.

అగ్ని ప్రజ్వరిల్లు మదిని
నాహుతికై కోరు చుండ
భగ్న మొనర్పగ నశక్తి
పరుడై కడు డస్సె యోగి.

ఆరాతిరి కుమారగిరి
అతివను గూర్చొన బిలిచెను
నారీమణి యెప్పటివలె
నతయై కూర్చొనె నచ్చట.

"దేవి! చిత్ర లేఖ! మాస
మీవిధి నున్నతి గాంచితి
భావింతును దుర్బలతయు
పరువడి విడిపోయె" ననిన

"కావచ్చును" తరుణి పల్క
"కాదేమిటి? కన పేమిటి?
నీవీగతి నుంటి వేల?"
నిశ్చింతగ తరుణియుండె

దంతమోష్ఠమున నొత్తుచు
తబిసి పలికె దరుణితోడ
"కాంత! బీజగుప్తుండును
కాశి కేగె నంచు వింటి"

"సత్య మ్మిది, యే నెఱుగుదు"
"చాన! యశోధర తోడను
మత్యుంజయుతో వెడలుట?"
"అత్యంతాశ్చర్యం బగు."

చిరునవ్వున గుమారగిరి
"చిత్ర మేమి! చిత్రలేఖ!
పరువడి వీడితివి యశో
ధర నతడు వివాహమాడ,

నీవు చేసినది యుచితము,
నీ కుచిత మ్మనిపించదె?
దేవి యశోధరను పొంది
తేజరిల్ల నార్యుడుంట"

కలత తోడ నెలత వలికె.
"కరుణించుడి బీజగుప్త
పలుకుల ములుకుల గ్రుచ్చక
బ్రతికించుడి, నేనెఱుగను."

"బీజగుప్తు గూర్చి పలుక
వెత సెందెద వేమి యలుక?
రాజముఖీ! నీవాతని
ప్రాణమువలె ప్రేమించితి

వేరొక నారిని గూడుట
విన నసహ్యా మయ్యొ నీకు?
నీరీతిగ నుండు దాన
వేటి కతని వీడినావు.

స్త్రీ యన్నియు జేయగలదు
చేసెడి నధికారిణి యని
చేయలేడు పురుషుండని
చింతింతువె చిత్త మందు.

దాసునిగా బీజగుప్తు
జేసి కొంటి ననుకొంటివి
వాసి గాంతు నని తలచితి
వాసపడితి వధికారము"

కుమారగిరి స్వరము కాల
కూటము సహవాస మందె
సుమాంగి నోడించదలచి
చురుక్కు మన మాటలాడె.

ఆవేశముతోడ నతివ
"నే వదలుట బీజగుప్తు
డీ విశ్వసమాజోన్నత
హృదయు డగుట కొఱకు సుమీ!"

ఎట్లొప్పెద దీనిదేవి!
ఎప్పుడైతే వాని వదలి
తట్లు నన్ను బ్రే మించుట
కై వదలితి వతని నిజము."

స్వరము తీవ్రమయ్యె, బూర్వ
బల శక్తులు గురుత్వమ్మ
వరలి నట్లుగా కుమార
గిరి హృదయము తేలికయ్యె.

"చెలువ! నీవు బీజగుప్తు
చేయగలవు వంచితునిగ
చెలగి నన్ను గూడ గాని
స్వీయవంచనము తగునా?

తుచ్ఛమైన కోరికతో
త్యాయ్యాలి నీవింత చేసి
స్వచ్ఛప్రేమను గిల్లిన
పాతకు రాలివి వినుమా!

నాలోనేదో చూచితి
నాపై పాకర్షణమున
లోలోన బశుత్వ వృత్తి
లోల వగుచు బ్రబలినావు.

మానవతకు దిలాంజలిని
బూని బీజగుప్తు నని
చ్ఛానిరతిని వదలి భార
మైన బ్రతుకు చేసినావు

మరియు బీజగుప్తుం డొక
తరుణి నర్తకిని వలచుచు
పరమ గృహ స్థాశ్రమ స
త్పవిత్ర సుఖములు వదలెను.

జీవన నష్టము పొందెను
చెలగి నిన్ను బ్రే మించుట
భావమ్మున బ్రేమ పవి
త్రావశ్యకతను దెలియుట."

చిఱ్ఱుమనుచు లేచె నటియు
"చాలింపుము చాలింపుము"
గిఱ్ఱున నామెను గుమార
గిరి తీవ్రత జూచి పలికె.

"చాలింతునె? యిద్దానికె
చంచల పై తేల? చెలువ?
చాలింతునె పూర్తిగాక
ఆలించుట తప్ప దింక

నీవు చేయుదానికిబ్రతి
గావలయును. నీమదిలో
భావించెద విప్పటికా
భావుకు డారాధించుట

మఱలి వచ్చువెన్క వాని
కొఱకు పోవ నెంచినావు
గుఱుతు పెట్టు కోడె నీవు
కోరిచేసి నట్టి పనిని?

నీవను విషదూరమ్మైన
పావనామృతము దొరికెను.
జీవన భారము దీరిచి
చేర్చె యశోధర వానిని

యశోధరను వైవాహిక
వశమున సుఖ ముండు నతడు
యశస్తిలకుడై చెలగెడు"
ననిన వెలవెలయ్యె జెలువ

"యశోధరను బెండ్లియాడు
టి సంభవ మ్మిది నిజమా?"
"యశోధరను బెండ్లియాడు
టసంభవమ్మా? దేవీ!

నీవు వాసనావశవై
పావనమౌ ప్రేమవదలి
మాపై పయిరాక యసం
భావ్య మసంభవ మగునా?

బీజగుప్తు డొక దివ్య
ప్రేమిక వైవాహికమున
భాజను డౌ టసంభవమె?
బాగు! దురభిమాన మెంత?

ఎంత యచల విశ్వాసం
బింత కింత, నను నమ్మవె?
చెంత చేరి కనుము నీవు
చేరె నుదయ మాదంపతి."

చటుక్కుమని లేచి యతివ
"సత్యమె? వారలు వచ్చిరె?
ఇ ట్లొక్కపరి కా దను మిది
హేలన గా దంజలింతు"

"హ హ్హాహ్హాహ్హాహా! నిజ
మైన దాని కాదందునె?
హు హ్హానగానేల? వెడలి
హాయ లొప్పగ జూచిరమ్మ"

చిత్రలేఖ కూర్చొనియెను
చిత్త ముద్వేగ మందె
"చిత్ర మిదియ, సమాప్తమై
చెలగి పోవలే నింతకు.

పోవుటతో లాభమేమి?
పోయెధనము సర్వమ్మును"
దేవి రుద్ధ గాత్ర యగుచు
దేకువ యడగారి పోయె

యోగి చిత్రలేఖ చెంత
కొరిగి పలికె "దన్వీ! నీ
వాగితేల? ఐపోయిన
దంటివేని యెట్టులగును.

ఒకటి సమాప్తం బగుటన
నొకటికి నారంభ దశయు
నికటసమావేశము లివి
నీవెఱుగవె దేవి! వీని

నీవెఱుగుదు నాప్రేమను
నీవు నన్ను ప్రేమించవు
జీవనమున జేరలేవు
చేరగల్గి మానినావు

కారణ మా సామంతుడె
మీరిద్దఱు నౌకరి నౌకరు
మేర లేని దుఃఖ భాగ
భారజీవనులు గారే?

ఆధారము పొందె నతం
డదియు నీవు పొందలేవె?
బాధయేల ప్రేమించితి
పడతీ!" యని చేయిపట్టె.

వారించదు చిత్రలేఖ
వారికనులు కలిసిపోయె
నారికనుల మదమత్తత
నారిని సారించినట్లు

"ప్రేమ నాకు ధర్మ మయ్యె
వెలది! కలసితివి నాతో
ప్రేమదీక్ష నీయ వచ్చి
వెఱతు వేల యొకటి కాగ."

రమ్మని తలవంచె నతడు
ఝుమ్మన దలయెత్తె నతివ
కమ్మని యధరాలు కలిసె
కమ్మ కమ్మ నయ్యె బ్రతుకు

పిచ్చి వానివలె యోగియు
"వెలదీ! నను ముంచ దలచి
వచ్చితి వేనును సిద్ధమె.
భలే! యెంత సుఖ మియ్యది.

ఓ నాయారాధ్య దేవి!
ఒప్పుల కుప్పా! మనోజ్ఞ
మానస సంచారిణి! నా
మనో రాణి రమ్మనేడు.

నీయౌవన సాగరమున
నే మునుంగ వచ్చినాడ''
నా యాలింగనము గొనుచు
నంత గనులు మూసికొనిరి.

'అగు గా' కని పలికె నతివ
ఆశ్లేషము బిగిసి పోయె
తగు మాత్రముగాక ప్రేమ
తరగ యుప్పొనగ మారెను.

ప్రాతఃకాల మ్మయ్యెను
పడతి కనులు తెఱచి చూచె
చేత మ్ముద్విగ్నముగా
చిత్రలేఖ కంపించెను

"బీజగుప్తు డెంత జేసె?
వెలదిబ్రతుకు చీక టయ్యె
బీజగుప్తువిడుచుటయే
వెత్తి'' యనుచు వెక్కియేడ్చె

కుమారగిరి నిద్ర మునిగె
కూల ద్రోసె దపశ్శక్తి
నిమేషమున, వాని ముఖము
నిర్మలమ్ము గాదు నేడు.

తదేకముగ జూచె నతని
తన్వి తనివి దీఱకుండ
నదేపనిగ, వణకె నంత
నచట నిలువ లేకపోయె

రాత్రి భోగవిలాసముల
రక్తి యుడిన ముఖము నేడు
చిత్ర మింత భయము గొలుపు
చిత్ర లేఖ నివ్వెఱ పడె.

బయట చేరె జిత్రలేఖ
వటుడు పూజ పూర్తిచేసె
నయమున నమస్కరించెను
నమ్రతగా నడిగె నిట్లు

"దేవీ! మీ ముఖ కమలము
తేజము గోల్పోయె నేల?
రేవెలసిన స్వప్నమ్ముల
గావలయును కలత సెందు.

గురుదేవుడు బయటరాడు
కుటి వదలుచు నే డేలకొ?"
"గురుసమాధి నందినాడు
గురుడు" తెల్లవారన య్యొ

"సమాధియా? గురుదేవుడు
క్రమము దప్పినాడె నేడు?
సమాధియేమిటి యిప్పుడు?"
స్తబ్ధత నెలకొనియె నచట.

"దేవి చిత్రలేఖ! నా
కీ వనుమతి నీయ గలవె?
ఈ విశాల దేవుడు ప్ర
శ్నించగలడె కలల గూర్చి?"

"అది తెలియుట యిష్టమైన
నవి నాజీవన బద్ధము"
లిదివిని యగునా? యని వటుడి
ట్లనియెను "దేవి! వినుమ

ఉచిత మంచు నీవెంచిన
నురికి బీజగుప్త రాక
ప్రచురముగా దెలిసివత్తు
వచ్చియుండు నింత వరకు."

"నేనెఱుగుదు నతడు వచ్చె"
నిండె శుష్కతయు మాటను
"రాని మ్మేటు రాక పోని
ప్రయోజనము లేదు నాకు"

చిత్రలేఖ గాంచి వటుడు
"చిత్ర మిదియ దేవీ! నీ
వాత్రపడెదు మునుపు నతని
యఖిల వార్త లరయు కొఱకు."

ఎఱ్ఱవడియె నటి ముఖమ్ము
"ఏల నీకు నా సంగతి?
కుఱ్ఱడ! వీ విన్ని తెలియ
గోరుచుంటి విది యుచితమె?

నా జీవన విషయమ్ముల
మోజు నీకు తగునా? ఏ
రోజునైన యోచించితె?"
రూక్షత పలికెను నర్తకి.

ధీమాగా పలికె నతడు
"దేవీ జీవన విషయ
ప్రేమగాదు, గురు జీవన
విషయ మెఱుగ బాధ్య డౌదు

తెలియుదీవు నీవుండుట
వలన గుటీ పూర్ణ శాంతి
కలకలమున నిండెను గురు
కులము వంటి దిది తొయ్యలి!

ఉచితానుచితముల నెఱిగి
యుండలేని వారి నిచట
నుచితముగా మందలించ
యోగ్యమైన నెల వియ్యది."

"ఒప్పుకోను దీని నేను"
"ఒప్పులేవు బీజగుప్తు
చొప్పుగాదు శ్వేతాంకుని
చూచి వత్తు ప్రార్థించెద.

మరల నొకటు విచారించు
మాపై దయనుంచు దేవి!"
తరుణి నవ్వి "దయదలచుట
తగదు రేరు? ఎవరిపైన?

వ్యాధుని దయ గోరెదీవు
ప్రళయకరుని సృష్టి సేయ
బాధ పెట్టు చుంటి వీ వ
బద్ధమిదియు పోయి వత్తు"

అని వనితయు బయటి కరిగె
నయిన దయ్యో ననుచు వటుడు
చనియె బాటలీ పుత్రము
చాన యతనికై వేచెను.

మధ్యాహ్నం బగునప్పుడు
మగువ చెట్టు నీడనిలిచె
నాధ్యాసను విడక నతివ
ఆర్యుదెలియ వటుని వేచె

ఆవిశాల దేవు డంత
నచటికి జను దెంచిపలికె
"దేవి! బీజగుప్తు గలియ
దెలిసితి వచ్చుట నాతడు.

శ్వేతాంకుని గలిసియుంటి
నాతడు మృత్యుంజయుతో
నాతతగతి భాషించుచు
నరుగుట నరిగితి వెంటను.

లోని కరిగె నాతండును
నేను తిరిగి వచ్చితి నిటు
కాని నిలువలేక పోతి
గాని వెంటనే వచ్చితి!"

"శ్వేతాంకుడు నన్నడిగెనె?"
"విపులకుశల పృచ్ఛసేసె
నోతరుణీ! వింత యొకటి
యొప్పుగ జెప్పెద వినుమా!

తొందఱలో గల డాతడు
తోడ్తోనబ్బుర పడెదవు
తొందరగానె యశోధర
తోబెండిలి యాతనికట"

చకిత యయ్యె జిత్ర లేఖ
"సత్యమ్మా యిది? యశోధ
రకు వటునకు పెండ్లి యానె?
రహి ననుమానింతు దీని.

బీజ గుప్తయశోధరల
పెండ్లియనుచు దలచి యుంటి"
"బీజగుప్తయశోధరల
పెండ్లి యెట్లు దలచియుంటి"

"శ్వేతాంకుడు చెప్పెనాకు"
"నాతండాకర్ణమున
నాతియందు బడిన మాట
నమ్మకమేకాని - మారె

ఆతని నమ్మిక నామెను
నాతడు పెండ్లాడ డంచు
నాతని కింకను నీపై
నాతతగతి ప్రేమగలదు."

చిత్రలేఖ లేచె వడిని
చెప్పె ధన్యవాదమ్ములు
"ఆత్ర పడుచు నను మాటల
కంజలింతు మన్నించగ

విశాలదేవా! వెడలెద
విశ్వసించు న న్నెప్పుడు
ప్రశాంత మౌ నీకుటీర
పరిస్థితులు చక్కబడును."

అనుచులోని కరిగె దరుణి
ఆశ్చర్యం బందె వటుడు
"వనిత చిత్రమైన" దనుచు
పలికె దెలియకుండగనే

చిత్ర లేఖ గూర్చి యోగి
చింత సేయు చుండెలోన
నాత్ర పడియె నామెరాక
కంత పిలిచె రార మ్మని

చిత్ర లేఖ కన్నులు గన
చింత నిప్పులైయుండెను
చిత్ర మతని కనిపించెను
చెదిరిపోయె బిచ్చితనము.

క్షోభ ఘృణియు గ్లాని కలుగు
కోమలి పలికెను వడకుచు
"లోభి! నీచ! పశువ! తులువ!
లోలుప! వాంఛాకీటమ!

నీ వబద్ధ మాడినావు
నీతపమ్ము విఫల మగుత!
నీవు యుగ యుగాల నరక
పావక కీలలమ్రగ్గెదు.

వెడలుచుంటి నాపలేవు
వెఱ్ఱివాడ!" నాయోగియు
"పడతి! ప్రేమ చేతనేను
పొల్పడితిని దీని కొఱకు"

"తుచ్ఛ! నీకు ప్రేమ మహిమ
తోడ పరిచయమ్ము గలదె?
స్వచ్ఛ ప్రేమను గలుషిత
పరచిన పాషండుడవే

మమత్వమ్ము నీకేంద్రము
మహిమ దాని పరిధి సుమ్ము
వ్యామూఢుడవు మూర్తీభవ
విశ్వకామ పీడ వీవు.

ప్రేమ యనగ బలిదానము
పేర్మిని నాత్మ త్యాగము
రామణీయకము హృదయా
రామవల్లి మల్లిక యగు.

నీ తపస్సు నీజ్ఞానము
నీసాధన నీయర్చన
నిజమున కతి దూర ముండు
నిస్తుల మగు భ్రమ మయ్యాది.

సంసారము చేయ వెఱచి
సన్న్యాసిగ మారితివా?
సంసారము నందు రోసి
సన్న్యాసిగ మారితివా?

చానల బోషింపలేక
సన్న్యాసిగ మారితివా?
చానల నాకర్షించగ
సన్న్యాసిగ మారితివా?

శక్తిని సాధించుటకై
సన్యాసిగ మారితివా?
శక్తి రక్తికై వాడగ
సన్యాసిగ మారితివా?

సాధుల బూజించలేక
సన్యాసిగ మారితివా?
సాధువరుల సేవ లంద
సన్యాసిగ మారితివా?

జగతి చేత పూజ పొంద
సన్యాసిగ మారితివా?
జగత్తునే మోసపుచ్చ
సన్యాసిగ మారితివా?

స్వార్థత్యాగము కొఱకై
సన్యాసిగ మారితివా?
స్వార్థసిద్ధి గోరుచునే
సన్యాసిగ మారితివా?

సచ్చిత్తుష్టిని బొందగ
సన్యాసిగ మారితివా?
సంతుష్టిని బొందుటకై
సన్యాసిగ మారితివా?

సంసారుల నుద్ధరించు
సన్యాసిగ మారితివా?
సంసారుల మొగము చాటు
సన్యాసిగ మారితివా?

నన్ను మోస పుచ్చగలవు
నరుల మోస పుచ్చ గలవు
నిన్ను నీవు మోసపుచ్చు
కొన్న గతిని దెలియ లేవు.

జనను ప్రేమను గురించి
యమలముగా వల్లింతువు
మానక జప మొనరించుము
మానిని మానిని మానిని"

కుమారగిరి యోర్వలేక
కోపఘూర్ణి తాకుండయి
సమాధాన మిచ్చుటకై
చానతోడ ననె నిట్టుల.

"పోవే! పోవే! నర్తకి!
పొందేమిటి నీకు నాకు?
నావశ్యక తేమి లేదు
అతిగా ప్రేలెద వేటికి?

పడగొట్టితి వీవు నన్ను
పైకి లేపు చుంటి వీవె
పడగొట్టితి నేను గూడ
పరాజితవు నీవు గూడ

చెడిపోవుట కొక్కరేమి?
చెలువ చెలువు డిద్దఱుసుమి!
చెడుటయు జెడకుండుటయును
చెరిసగమ్మె వరలు పొమ్ము.

నిన్ను నీవు చూచుకొనుము
నీముఖమ్ము పాశవికత
నున్న తీరు తెలిసి కొనుము
నన్నుకత్తె నని వీగకు

నేనె ఱుగుదు నేటినిన్ను
నిర్మలవే? నిశ్చలవే?
మాన వతివె? కన నీ వఖి
మానవతివె? ఫో పొ మ్మిక.

నీశాపము నీవెంటనె
రాశి వోసికొని పొమ్మిక
నీశృంగారమున గూడ
నిలిచి గెలిచి నాను పొమ్ము

భోగ విలాసుల వరించు
పూబోడిని నిను బొందితి
యోగిని, నా వంటివాని
నొప్పు పొలతి పొలతియౌనె?

నీరతికై నాయాకృతి
నీరుగార్చె నిన్ను నేడు
వేరు మాట లేల పొమ్ము
వెలయాలికి నీతులేల?"

ఊగు చుండె గోపమ్మున
నువిద పోవు చుండు నెడల
యోగి పీడవోయె ననుచు
యుక్త విధికి వెడలిపోయె

## 21. మహా త్యాగము

శ్వేతాంకుడు మృత్యుంజయు
వీడు కొనుచు బీజగుప్తు
ప్రీతు జేయ బలికె నిట్లు
విశాల దేవుడు కలిసెను

"ఆరోగ్యము చిత్రలేఖ"
యనుచు దెలిపె ననిన నతడు
మారు వల్కకుండె నంత
మాణవకుడు ప్రశ్నించెను

"తరునా ఇది నాకు నేడు
తత్స్వామిని గన నేరుట?"
"తగ దిట్టుల పోవరాదు
తప్పక వ్యర్థం బయ్యెడు"

చిత్రలేఖ మాట దీయ
జిన్న వోవు విభు డం చని
నాత్రమ్మున బయటి కరిగె
నతడు జరుగుదాని మార్చ

పాటలిపుత్రము చేరిన
వ్యథ తొలంగు నటని తలచె
మాట తలచినంత పెరిగె
మగువల ప్రతిమలు చెలగెను

ఉద్విగ్నత పెరుగుటచే
యుద్ధమయ్యె హృదయములో
నుద్వేల పరిస్థితులం
దూగ దొడగె నాలోచన.

చిత్రలేఖ తొలగిపోయి
చిత్రమైన యనుభవమ్ము
చిత్రమయ్యె యశోధరా
చిత్ర మతని చేరు వగుట

యశోధరను పెండ్లియాడ
స్వాంత మొప్పు చుండె గాని
యశోధరను గాదను వా
డగుట యేమి తోచకుండె

కన్య నిమ్మటని యడుగుట
గౌరవమ్ముగాదు గదా!
అన్యోపాయము తోచక
నతల కుతల మయ్యె మనసు

మానుకొన్న చిత్రలేఖ
మానసమ్ము మారెను గద
మానస బింబమును తెలుప
మన సొప్పిన బాగుండును.

మౌర్యరాజ్యసేనాపతి
మహితసభాసదస్యుడుగ
నార్యుని మది నిలువ బోదు
అన్ని పనులు నిలిచి పోయె

ఇల్లు వెడలి పోదమన్న
హ్రీ భారము రానీయదు
తల్లీనత విరక్తియును
తత్క్షణమున దోచుచుండు

జనతాతతి సంబరములు
సంతోషము చంపు నతడు
మనసు మాడ్చె శ్వేతాంకుడు
మగువ మాట దీసి మరల

రాత్రి నిద్రరాక పోయె
రకరకాల యాలోచన
చిత్ర లేఖ స్వస్థ యనిన
చిత్తరోగి తాను కదా!

సుప్రసన్న నర్తకియన
నప్రసాదు డగును దాను
విప్రతి పత్తికి నిలయము
వింత, యెట్టిభ్రమ మియ్యది?

దీనికన్న నోడ మేలు
తెలివ బెండ్లియాడిన సరి
దానివలన గలత దొలగి
ధైర్యమందు మానసమ్ము

చిత్రలేఖ గూర్చి యుదా
సీనత; మంద్రస్వరమ్ము
చిత్రమయ్యె శ్వేతాంకున
కాత్ర పడియె బోధపడక

బీజగుప్తు నూహించుచు
శ్వేతాంకుడు నిద్ర వోడు
బీజగుప్తు వైఖరి న
న్వే షించును రాత్రి యంత

ప్రాతః కాలం బయ్యెను
ప్రసన్నుడై యుండెనృపుడు
చేతోనిశ్చయు డయ్యెను
చెలువ గూర్చి వృద్ధు నడుగ.

మొదటిసారి బీజగుప్తు
మొగము విరిసె నానాళ్లకు
పదపడి జలపాన వేళ
వచ్చెను శ్వేతాంకు డంత.

వెలవెలగా వటునిమోము
కలగుట గని యార్యు డడిగె
"కళవళపడు టనారోగ్య
కారణమా? వివర్ణతకు"

"కాదు కాదు మానసికా
వేదనచే నిట్లయితిని"
'వేదనయా? ఎందులకని?'
శ్వేతాంకుడు తలవంచెను

మౌన ముడిపి వటుడు వలికె
"మహిత దయకు నాసపడితి
నేను బెండ్లిగోర మీర
గాని చేయ లేరెవ్వరు?

"సంకోచమ్మేల నీకు?
సహోదరుడ వీవో శ్వే
తాంకా! నావద్ద గలుగు
నఖిలము నీ కను మతమ్ము"

"నే నెఱుగుదు మీమనస్సు
గాన సాహసము చేసితి
నూని యశోధరను బెండ్లి
నొప్పుగ గా దలచి యుంటి"

ఒకే సారి చకితు డయ్యె
నొకటేమిటి? వేల తేళ్లు
నొకమారుగ గఱచినట్లు
వికలమయ్యె తనుమనములు

విమూఢుడై యతని గాంచె
వింతకు విభ్రాంతి చెందె
సమూలతరు విచ్ఛేదము
సరణి తోచె నార్యు కంత

ఐనను వెత దోపనీక
"నైన నేమి చేయవలయు?
"దీనిని మృత్యుంజయుకడ
తేవలయును ప్రస్తావన"

"ప్రస్తావన కేమిగాని
పరిచితుండ వీవు గావె?
శాస్త్రి యగునె నాకిది ని
శ్చలత కిదియ నెల వగునే?

మృత్యుంజయు డడుగునాడు
మెలత పెండ్లి కొప్పలేదు
సత్యమ్మొ గాదాయిది?
చయ్యన నీ వెఱుగుదు గద!

చిత్రలేఖ ననుబాయుట
చెప్పవలెనె? శ్వేతాంకా!
ధాత్రియశోధర యెడలను
తత్పరుండ నని యెఱుగవా?"

"తెలియు దేను చిత్రలేఖ
వలనప్రేమ కొన్నమీరు
లలితాంగి యశోధర బెం
డ్లాడు తలపు సంభవమా?"

"నీమాట లసంభవములు
నే వలచితి యశోధరను
నామానస మీరాతిరి
నన్ను నిశ్చయుని జేసెను"

తీవ్రమయ్యె గాత్రమ్మును
"తెలుపు మీవు గోరె దిపుడు
తీవ్ర వేదనాదుఃఖ మ
తిభ్రమణము చాల దొక్కొ?

నాజీవన నష్టి గోరి
నావె నీవు శ్వేతాంకా!
నాజీవన భాగధేయ
నాకు యశోధర యయ్యెడు

తెలియు" మనిన బీజగుప్తు
పలుకులు ములుకులు గాగా
వలవల కన్నీ రొలుకగ
వటుడు ప్రాంజలించి పలికె

"స్వామీ!నే నపరాధిని
పరిధి దాటి తిరుగుచుంటి
స్వామిద్రోహమొనర్చితి
శమియింపుము, శమియింపుము

మీ హృదయమ్ము విశాలము
మీరాదర్శులు మహాత్మ
లీహామోహుని నను మ
న్నింపవలయు, మిము వేడెద"

చిరాకుగా సామంతుడు
"చేయకోయి పిచ్చివాని
త్వరగానిటు వదిలి పొమ్ము
ప్రార్థించెద వెడలి పొమ్ము"

శ్వేతాంకుడు వెడలుటతో
శిరము కరము బాదుకొనియె
రాతికేసి గుద్దుకొందు
రా యనిపించెను మదిలో

స్వాగతమ్మున శ్వేతాంకా!
తగదు తగదు నీకు నిట్లు
పొగలుగ్రమ్ము నామదిలో
పొలతి బెండ్లి యాడుదు నిక

నను సుఖిగా నుండ జేయు
ఘన శక్తులు వేరెవ్వరు?
నను నిర్దయ విఫలుజేయు
మనుజుడు గలడే ధరలో?

యశోధరను బెండ్లాడగ
హార్దికముగ దలచి యుంటి
దిశల్ మారు మ్రోగగాని
త్రిప్పలేడు దీని నెవడు"

తేరును దేనాజ్ఞసేసి
"తెలియదె శ్వేతాంకుని కిది?
తేరుకొందునే నేనిక
ధీరుడయ్యె శ్వేతాంకుడు

తాప మధిక మగు చుండగ
తనదేహ మ్మగ్ని యయ్యె
కూపమ్మున నుండి వెడలు
కొలది మాట వెడలు చుండె.

శీతల పానీయమ్మున
శీత మయ్యె శరీరమ్ము
శ్వేతాంకుడు కనులముందు
వివిధాలోచనలతేపు

ఐన వాని దేమితప్పు
ఆతండును యువకుడెగద!
వాని ప్రేమ సహజమ్మె
ప్రకృతి ప్రేరణలు గల్గ

రక్త మాంసములు గలుగుట
రాజు పేద సమమే కద!
రక్తి చిత్ర లేఖపైన
ప్రశమ మగుట యెఱుగు నెట్లు?

ఔను! నేనె యవివేకుడ
మానిని నొక దాని వలచి
దాని తావు నందింకొక
దానిని వలచుట తగవా?

ఎంత నిర్బలుండనైతి
నెంత తప్పు సేయు చుంటి
ఇంతకు ప్రేమకు జిరత్వ
మెసగదె? అది యెట్లు పొసగు?

ప్రేమ చిరస్థాయి, నేను
వేరునారి వలచు టెట్లు ?
ప్రేమించిన చిత్రలేఖ
ప్రేమ కిదియ ప్రతి యగునా?

చిత్ర లేఖపై నమ్మిక
చెడగలేదు, దుర్భావన
పాత్రగాదు, తప్పుచేసి
బాధపడుట నావంతగు"

ఇంతలోన రథము వచ్చె
చింతాశృంఖలలు తెగియె
స్వాంతమ్మున నాలోచన,
స్యందనమున సామంతుడు

"సంయమ లక్ష్యంబేమిటి?
స్వార్థ త్యాగము కాదా?
సంయమమ్ము లేకుండిన
జంతువులును మనమొక్కటె

మానవీయ ధర్మమొకటె
మనిషి తనకు దానె బ్రతుకు
నా? నరులకు జంతువులకు
లేని పోలి కిక్కడెకద!

యశోధరావివాహమున
కవశ్య పరిణామమేమి?
యశస్వి సోదరతుల్యుం
డైన వాడు మరణించుట.

ఆలోచన చేయలేను
లీల బతన మగుచుందును
గాలికొట్టుకొని పోవును
గాదె! నాదు సిద్ధాంతము

ఐన యశోధరను బెండ్లి
యాడియు బ్రేమించ గలనె?
నేను నేటి దుఃఖమ్మును
మానలేక పెండ్లి తలతు.

కాని భవిష్యమ్మునందు
కాంత వలవ నాతరమా?
మానిని బెండ్లాడు శక్తి
కాన బడదు నాలో నిక

శ్వేతాంకుని జీవనమున
చెలగాటం బాడరాదు
ఆతని కధికారి నగుదు
ఆత్మకు కాబోనుగదా!

అతని దుఃఖభాగుజేయు
నధికారము కలదె నాకు?
ఆతని సేవకు ఫలమి
య్యదియే? తగునా యిట్టుల?

నాలక్ష్యము మార్చుకొనుట
ఆలోచన లేనట్లే
లీల జయాజయములేమి
లేకపోని సుఖము, శాంతి

నాపథమ్ము మీరరాదు
శాపముగాబరిణమించి
కాపథముల ద్రొక్క కుండ
కనల నీయరాదు పరుని

ఇతరుని దుఃఖింపజేయ
నింత కన్న నఘము కలదె?
ఇతఃపూర్వ మనుభవించి
తింతె చాలు సుఖ శాంతులు"

రథము వృద్ధు గృహము చేరె
రహి నాతడు స్వాగతి నిడె
ప్రథితార్యుడు బీజగుప్తు
పరిశ్రమకు హేతువడిగె..

"మృత్యుంజయ మహాశయా!
మీకూతురు వైవాహిక
కృత్యప్రస్తావనకై
నిచ్చటి కరు దెంచినాడ"

చిరునవ్వున జెప్పు డనిన
చిరునవ్వున కుత్తరమ్ము
చిరునవ్వున నిచ్చి "ఆర్య!
చెప్పవలవ నాగుణించి

నాయభిమతమును జెప్పితి
మీ యశోధరను వటునకు
నీయ నడుగ వచ్చినాను
హితుడు కులీనుం డాతడు

సుందరు డగు శిక్షితు డగు
శోభితు డగు మీకన్యకు
మందహాసముదంచిత
మధురవచను డమలుండగు"

ఈప్రస్తావన చిత్రము
మృత్యుంజయు డబ్బపడియె
నాప్రపంచ నిత్యానుభ
వ ప్రపంచ విపరీతము

తనను గోరె దాను మున్ను
తనకు నీయదలపోసెను
తన గూరిచి పలుకు ననుచు
ననుమానించెను గానీ

శ్వేతాంకుని ప్రస్తావన
చేత జేత మూత దొలగె
"శ్వేతాంకుడు యోగ్యుడౌను
పితృ శ్రీని చూడవలదె?

అతని గూర్చి యోచించుట
కసమర్థుడ నేనీయెడ"
మతి చలించినట్లు తోచు
మాటవినెను సామంతుడు

"ఆర్యా! మీ రతుల శ్రీ
కధిపతు లేకైక సుతా
హార్యకు లింకేమి?" యనిన
నతడు నవ్వి యిట్టులనియె

"అదియెందుకు దత్తపుత్రు
నందు పొందు నీసంపద
అది ఏటికి? నీవేటికి
నంగీకారము తెలుపవు?"

"నా పెండ్లి యబద్ధమైన
నాపె నతని కీయకుంట
యే పూర్తి వినిశ్చయమా?"
మృత్యుంజయు డనియె నంత.

"ఎంత యోగ్యుడైనగాని
యింత చేసి నాకూతున
కంతవరకు జేయగలనె
అంత దరిద్రుని కిచ్చుట?"

బీజగుప్తు డాలోచన
విడిచి పలికె; "నైన వినుము
మోజు పడితి వైశ్వర్యము
ముందాతని దత్తు గొందు

నాపుత్రుడుగా నస్మ
చ్ఛ్రీపతి యగు నిది యిష్టమె?
తాపముండునే యింతను
దరుణి కితని బెండ్లిసేయ?"

"వద్దు బీజ గుప్త యసం
భవమిది, నీవయస్సెంత
కద్దు పెండ్లి కాగలుగుట
కలుగు కొడుకు నధికారియు

నాకూతును బెండ్లియాడ
లేక మానినను సరియే
నీకు వివాహము గావలె
నిండు సంతు గలుగ వలెను.

నీకన బోయెడు సంతును
నికృష్టులను జేయదగదు
నాకూతు నదృష్టంబున
గాక వరుడు దొరుకునెట్లు?"

"నిజము చెప్పితిరి యార్యులు
నిజమునకే బెండ్లి యాడ
గుజగుజ యేటికి శ్వేతాం
కునకు యశోధరను గూర్చ

సకల త్యాగముసేసెద
సంపద దానముచేసెద
నకల్మషమునగు మాటిది
హాస్యమునకు గా దార్యా?

వివాహమ్ము నాజీవన
విహితము గాదంచు దలతు
నవివాహితు నాస్తి వృథా
యగుటకన్న నది మేలగు"

ఆకాశము కూలినట్లు
లయ్యెను మృత్యుంజయునకు
"నాకు జిత్ర మయ్యె డీవు
లౌకిక చిత్త స్థాయివె?

చిత్త భ్రమ చాంచల్యము
చెలగు నీవు పలికె దేమి?
చిత్తం బుత్తల పడియెడు
చిత్ర లేఖ కాఅకునీది"

"మీరు నన్ను యోజించకు
డే రహి నే బలికితినో?
మీర దాని, సాక్షి మీరె,
మిత్రు బుత్రు గాజేసితి.

రాజాజ్ఞను హొంది నేడె
రహి నాతని సామంతుని
బీజగుప్తునకు బ్రతిగా
నోజ నిలుప గలను గనుడి

ఇష్టమాసె కూతునీయ?
నింకను సందేహమగునె?"
"కష్ట పెట్టుకోకు పలుకు
కార్యము నెఱ వేఱవలెను"

మాట తప్ప, బాటతప్ప
మనిషిని మనసున్న వాడ
నోటువడను చూడ గలిగి
యూరక ననుమాన మేల?

" ఐన నాకు సమ్మతమే"
"ఐన నిపుడు లగ్నమ్మును
పూని నిర్ణయించు కొనుము
పోయి వత్తు మాట నిలుప"

మృత్యుంజయు డంతలేచి
"మేదిని నీయంత వాని
సత్యము గన లేదెన్నడు
సర్వవిధుల దేవుడవే

సుగుణోపైన నిన్ను గొనగ
సుత కదృష్ట మబ్బుకుండె
తగిన వరుని భగవంతుడె
దగుల చేయు మన మెవరము?"

అనుచు బొరలు నశ్రువులను
కను గొలకుల నాపి యనియె.
జనియె బీజగుప్తుడు తన
సదనమ్మున కతివేగత

వటుని శయ్య కడగాంచెను
పటుము తడిసె వంచె దలను
పటుశక్తిని వటుని లేప
"స్వామీ! పని యేమి" టనియె

"స్వామి గాదు నను బిలుచుట
సామంత శ్వేతాంకా!"
"ఏమి పలుకు చుంటి రీర"
"లింతయు నిజమేనోయి!

నీపెండ్లికి మృత్యుంజయు
నేప్రస్తావించ గొంత
యా పత్తిని బలికె నంత
నఖిల త్యాగము సేసితి

అర్థమగుట లేదా? నా
యఖిల సంపదను బదవిని
నర్థినీకు దాన మిచ్చి
యనుగు సుతుని గా జేసితి.

అయ్యొ నిశ్చయము పెండ్లియు
నయ్యశోధరకును నీకు"
కొయ్యబారి పోయె నతడు
గోడున నేడ్వగ దొడగెను

"వద్దు వద్దు పాపి నేను
వద్దు నాకు, మన్నించుమ
మొద్దు నౌదు నవివేకిని
మోసమ్మొనరించినాడ

బీజగుప్త! నరాధముని
పేర్మి నన్ను శిక్షింపుము
మీజీవన సౌభాగ్యము
మిగులకుండ జేసినాడ"

చరణమ్ముల వ్రాలు నతని
సరగ నెత్తి యార్యు డనియె
"జరుగ బోవునది జరుగును
జరిగిన దది నిర్ణితమ్మొ

ఏమాత్రము విశ్వాసము
నామీదను కలిగె నేని
ఈమాటకు నస్వీకృతి
నెంచకు చూపకు నా కిక.

సత్యవాదియన్న పేరు
జగతి నాకు నిలుపుమయ్యా
మృత్యుంజయునంత వాని
కిచ్చిన మాటను నిలుపుము

భోగించితి భోగమ్ముల
పొందవలసినంత వరకు
భోగించుము నీవు నాదు
పూన్కిమరల్చగ జూడకు

జీవితమున నిదియైనను
చిరుతృప్తిగ జరుగ నిమ్ము
జీవితమును నిష్ఫలముగ
జేయుకుమా దయజూడుమ

కృత కృత్యునిజేసినచో
కృతజ్ఞతలు నీకు, బ్రతుకు
కృతకము గామార కుండ
గుతుకమ్మున చావనిమ్ము

అసఫలుండ నన్నియెడల
నైనను నియ్యెడ గానిచో
నసముడన్నై యశము గొందు
నంగీకారము తెలుపుమ

ప్రార్థించెద వెను వెంటనె
పదవీ పత్రము పొందగ
బార్థివుకడ కేగవలయు
పద! పద! నీదయ సుమ్మీ!"

## 22. అఘమర్షణము

తిరిగి వచ్చెను చిత్ర లేఖయు
స్థిరముగా యోచించ దొచదు
గురువిచారముసెందు నార్యుని
కౌఅకు వోవగ సాహసించగ,

తప్పు చేసిన దతని కౌఅకై
నిప్పుద్రొక్కిన చంద మయ్యెను.
చప్పునను తన సదనమందున
నెప్పడును రోదించు చుండును.

కాలు పశ్చాత్తాపవహ్నిని
కాలుజారిన పిదప సేడ్చుట
గాలికిని దీపమ్ము పెట్టిన
కరణిగా దోచును మనమ్మున,

ఎంత నాతనిపైన ప్రేమయొ
నంత కాలము విరహమయ్యెను
కాంత విరహానంతరమ్మున
గనియె దద్గుణ సౌరభంబును

పిచ్చి యోగికి భ్రమసి తానై
కచ్చపొదలో జిక్కు కొనియెను
ముచ్చటైనది జీవితంబది
పుచ్చి పోయిన చంద మయ్యెను.

మోసపుచ్చగ జూల దార్యుని
ముగుద తానే మునిగె వంతను
గాసిల న్దలచున్ వ్యథానల
ఘనజ్వాలల జిత్రలేఖయు

ఎంత యశ్రుల పాతమగునో?
అంత శాంతికి దావలమ్మగు
కాంత మదికీ చింత సంతత
కర్మఫలమ్మై నిల్చియున్నది

నెలత యిటు దుఃఖించు చుండగ
నెల తబాలున గడిచి పోయెను
తెలిపె దాసియు వటుడు వచ్చుట
కలసి పోవగ ననుచు నంతట

చకిత యయ్యెను జిత్రలేఖయు
సంబరమ్మున బయటు క రిగెను
వికృత ముఖమును గాంచి వటుడున్
వింతపడి యిట్లనియె నటితో.

"దేవి! ఏమీ ముఖమ్మిట్టుల
తేజమున బెడ బాసి పోయెను
నావిని ప్రమదామణి త్వర
"నంత మంచిదియే" యనెన్

"కుశలమా ఆర్యుడు మహాత్ముడు?"
"కుశలమే, పరివర్తితుండగు"
"కృశితుడా? వైవాహికోత్సవ
వశుడు గాకుండెనే తెలుపుమ"

"లేదు- లే దవివాహితుండే
రేపు మాపోనాదుపెండిలి
కాదు పోదనకుండ రావలె
కావునసె మిము బిలువ వచ్చితి"

"ఏమీ పెండ్లియె? ఎవరాకన్యక?"
"ఎవరేమిటి? ఆయశోధరయె సుమి!
"ఏమీ నిజమా?" "ఎంతోసత్యము"
'ఎట్లుకుదిరె నిది యూహించనుగద!'

"కుదుర కుండెడిది మృతుంజయుండు
కూతు నిచ్చుటకు నిర్ధనుండ నని
కుదురనీయమిని గొబ్బున నార్యుడు
వదలె సర్వముం దానపూర్వకత

తన సర్వస్వము తన సామంతత
దానమిచ్చెనీ నిర్భరార్భకున
కనితరమైనది యాతని త్యాగం
బపర భీష్ముడై నటు మది దోచును"

కనుల నీరము, మనసు భారము
తనువు కంపము గుండెదడదడ
"వినుతు డార్యుం డెంతచేసెను
ఘనత్యాగము గాదెయిదియును"

"ఆతనికి నంతటి విరాగము
పాతకిని నావలన గలిగెను
ఖ్యాతియే యగు కాని -----కానీ
హాయి మది నీపెండ్లి యనగా"

"ఆదివారము పెండ్లి దేవీ!
నందఋను విచ్చేతురచ్చుట
ప్రోదిగా, విం దగును మరుసటి
పూట, నీవును రావలెన్ జుమి!"

"అన్యథా భావించకయ్యా!
నందఋకు విందైన రోజున
నన్య చిత్తను రాక కుదురదు
ఆవలను వచ్చెదను సుమ్మీ!"

"అనుజుఁగా నను బోల్చి తీవే
అట్టు లే పొల్చితివి గానీ
నను విచార పరున్ బొనర్చగ
న్యాయమౌనా సోదరీ! ఇక"

"శ్వేతాంక! నామాట వినుమా!
చిత్తమెప్పుడు, సోదరుడ వే
రీతినైనను భగిని నయ్యెద
ప్రియతముడవే తెలియు మియ్యది.

సుదృఢనిశ్చయ నైతి నొక్కట
సుమ్మి, మన్నన సేయుమయ్యా!"
"విదిత మెల్లెడ నీకు దేవీ!
వెళ్లి వచ్చెద గాని వినుమా!

చంద్రవారము రాత్రి యార్యుడు
చనును దేశము పర్యటించగ
మంద్రముగ యోచించుమీవును
మరల కలిసెద దేవి! నీకును."

చిత్ర లేఖయు చెమ్మగిల్లెను
చిత్ర మాతడు వెళ్లిపోవునె?
నాత్రమున నంతటు దృఢత్వము
నంది "పోని మ్మేల నాకిది?

యశోధరా శ్వేతాంకులకు వివా
హము జరిగెను ముద మెచ్చెను వారికి,
ప్రశాంతిగా దద్వివాహోత్సవము
పరగుట సంతస మయ్యె జూపటికు.

విందునాడు కను విందు గాగ భూ
విభుని తోడ సామంతులు వచ్చిరి
ముందు బీజగుప్తుండు సమాదర
ముగ్ధ వచనముల స్వాగత మిచ్చెను

చిత్రలేఖ రాకుండుట మదిలో
చింత తీగె, హృదయమ్ము జ్వలించెను
చిత్ర లేఖ గన నెంచె బాటలీ
పుత్రనగరమును వీడులోపలను

శుభా కాంక్షలను దెలిపి మౌర్యవం
శ్యుండు చంద్ర గుప్త ప్రభు చంద్రుడు
ప్రభుత్వాజ్ఞగా శ్వేతాంకుని స
ప్రభుగా సామంతునిగా బిలిచెను

చక్రవర్తి యా బీజగుప్తు దన
చాయకు బిలిచి చివాలున భుజమున
నాక్రమించి హర్షించి యిట్లులనె
"అమలత్యాగమ్మొనర్చి యుంటివి.

అసంభవమ్మును సంభవమ్ముగా
నసమశక్తి జూపించితి విదియే
ప్రసన్నుడుగ నీ చంద్రగుప్తు డ
ప్రతిభుడుగా దలవంచు నీకనియె

చకితులైరి సహసామంతులువడి
చక్రవర్తితో నతులై రంతట
నికటవర్తి నారీతతి రోదన
మకుటిలతన్ వినిపించె నందఱకు

బీజగుప్తు డానతుడై ప్రభుతో
"రాజరాజ! మహనీయతేజ! నీ
రాజిత సకలధరాఖిల భూభుజ!
పూజిత పాద! యిదేటి కార్య మగు.

దయామేదురాదరధురీణతను
నయోగ్య మిది నావంటి వానినిటు
ప్రయత్నముగ బొగడంగ దగునె, నే
ప్రభుచరణరజోపర్యధికృతుడనె?

భికారినై నేదేశ పర్యటన
వెడలు చుంటి దీవించుమ" యనుచున్
సకల జనులు వెను వెంటున నడువగ
చయ్యన ద్వారము దాక సాగె నటు.

యశోధరా శ్వేతాంక వధూవరు
లతి భక్తిగ జనుదెంచి ముందుబడి
యశస్తిలకు డగు బీజగుప్తుచర
ణాబ్జమ్ముల కెరగిన దీవించెను

ఆతనిలో నొక దివ్యతేజమును
హార్దిక శక్తి నమందత గాంచిరి.
పూత చరితు డని పొగడి రందఱును
మోడ్చిరంత కరపుటములు తృటిలో

ద్వారముకడ సేవకులు కన్నులన్
బాష్పము లొప్పగ నతులై యుండిరి.
వారికి శ్వేతాంకుడు మీ ప్రభుడని
పలికి నిబ్బరముతో బయనించెను

రామునివనవాసము దలపోయుచు
రామ లేడ్వ నిస్తబ్ధు డయ్యె దా
నేమి చేయలేకను మౌర్యప్రభు
డాముహూర్తమున మౌన మూనె నటు.

గహననిశీథి, విశాల జగత్తున
కాలుబెట్టె నాబీజగుప్తుడును
మహా నిశ్శబ్ద మహిత మయ్యె భువి
మరల కుండ జనుచుండె ముందునకు

పాదచారియై పేదవానివలె
బదపదమున బట్టణమును బాసెను
పాదధ్వని వినిపించెను వెనుకకు
పదపడిచూచెను తోచ దేమియును

ధీరత బోయెడు బీజగుప్తునకు
మీఱుపదధ్వని కలతను తెపెను.
దూాతె విధిని వెను దిరిగి చూడగా
తొయ్యలివలె బొడచూపె జీకటిని,

"నాదైవమ!" యన నాగె పదమ్ములు.
"ఏదీ? ఎవ్వరు? ఏమిది? యనగా"
"నాదైవమ! నాదైవమ! మన్నన
నాకు వలయు"నని పదముల బడియెను

చకితు డయ్యెనా బీజగుప్తుడును
"శక్తి! చిత్రలేఖా! అభిశాపమ!
సకల వినాశిని! చను నను వీడుచు
నికటము తొలగుమ, ఏలవచ్చితివి?"

"నాదేవత చరణమ్ముల ధూళిని
నాశిరమున ధరియించ వచ్చితిని
నా దేవత నారాధించుటకై
కాదు కూడ దనరాదు సుమీ! నను.

నాథా! నీజీవనము నష్టమై
నది, నాకతమున నాశమైనయది
బాధపడకు నను దిట్టగ గొట్టగ
పరమదయను చూపించకు నాయెడ"

శరీర మంతయు గంపించుటచే
కరుణస్వరమున బీజగుప్తు డనె
"తరుణీ! అంతయు సమాప్త మైనది
మరల యేటి కిటు కాగమించితివి.

ధనమును లే దందమ్మును లేదిక
మన ముద్వేగత మసలుచు నున్నది
నను నిర్భాగ్యుని జేరవచ్చుటకు
ననబోడీ! తగునే? పొమ్మిప్పుడె"

చేయిపట్టి నిలుపుచు దలోదరియు
"నాయీ యభ్యర్థన మన్నించుమ
రేయి యేల? నాయింట నతిథివయి
రేపకడనె బోవచ్చును రమ్మా!"

చేయి విదిల్చుక బీజగుప్తు డో
"చేడియ! నన్నా పుట తగునే? యిటు
నీయకృత్యమున బరిణామమ్మును
నిండుగ గని తృప్తిగ హసించు మిక"

అనుచు సాగు నాబీజగుప్తు నా
వనిత పదమ్ములు పట్టి కూడదని
"నినుబోనీయను నాథ! నాపయిన
వినుత దయను రావే యొకనాటికి

ప్రేమ చచ్చెనే నాపైనీకిక"
వెలదిపలుకు పలుకున నతడి ట్లను
"ప్రేమ చచ్చినట్టైన నిన్నిటికి
పిచ్చివాడనై త్యాగమొనర్తునె?

చిత్రలేఖ! నీయెడ నాప్రేమను
ఛిన్నభిన్నమ్మొనర్చదల్చెదను
చిత్రమేమొ? యది యసంభవమ్మగు
చిత్ర మెన్ని జన్మల బంధమ్మో?"

అనుచు లేవనెత్తుచు నాలింగన
మును గొనదలచగ వెనుక కొదిగె నా
వనిత తటాలున "భాగ్యదేవతా!
స్పర్శయొనర్చకు నపవిత్రను సుమి.

పతితను పాపిని పరమదేవతా!
భవనమ్మున కరుదెంచిన పిమ్మట
నతుల శాప పావక కీలలలో
నతి పవిత్రగా జేయ బూను" మనె

"పద నీమాటను గాదన లేనిక
పతితు నెంత కావింతువొ పద! పద!
ముదిత! నా కొకటిముందు వచన మీ
ప్రొద్దున నాప నటున్న వచ్చెదను"

చేరి రామె భవనమ్మును వారలు
చేరి యాతనికి శయ్యనేర్పరచి
"మీరలు విశ్రాంతిని గొను డిప్పుడు
మీతో రే పుదయమ్మున గలిసెద"

వింతయ్యైన నర్తకి నడవడికను
బీజగుప్తు డాలోచన మునిగెను,
అంత శయనమున గడచె రాత్రి, ఆ
యతివ వచ్చె బ్రాతఃకాలమ్మున

ఆమెయు కల ధౌత వస్త్ర పరిధా
నాంచలమున దల గప్పి కొనినయది
"స్వామీ! మీచరణామృత మిమ్మన
చకితు డయ్యె నేమిటి కనె నార్యుడు.

"నన్ను నేను బరిశుద్ధ జేసికొన
నున్న దాననో యార్యా! తప్పితి
నన్ను బతితగా నెఱుగుముదేవా!
ఉన్నరూపు వివరించెద నీకిటు.

యోగివాసనా సాధనమ్మునై
యుంటి, గోపమున నర్పణజేసితి
భోగించెను నాశరీర మాతడు
మోహాభరమ్మున బతిత నొనర్చెను

మీవివాహ మను కథ కల్పించెను
మీఱుమోహమున జెంగలించి నా
భావము మీకైయోచన సేయగ
పరవశుడై బంధించె గబంధత,

ఉక్కిరి బిక్కిరి చేసె నన్ను మో
హోదగ్రుండయి పశువై మెలగెను
చిక్కువడితి మీపై కోపమ్మున
జింతించితి నాపై నెఱుకన్గని

మది గుందితి, మీ మందిరమున రా
జదురను గాక గుమారిలి యుంటిని
ఇది నాకథ , నాపాప మెరింగితి
రింక నన్ను మన్నించ దలంతురె?

అహంకార బలమున బెట్రేగితి
నమృత మొలక బోసితి విష మెన్నితి
నిహాము చెఱచితిని పరమున దప్పితి
నిందుముఖుల దల లెత్త నోడితిని.

తార్కిక శక్తిని దలపై గన్నులు
దర్పము మీఱ మునీంద్రుని గెల్వగ
కర్కశనై చని వక్రగతిని బడి
కాంతు మిమ్ము మన్ననకై వేడితి.

సుఖము తప్ప నసుఖమ్ము తీరెఱుగ
జూడని మిము దుఃఖాంబుధి ముంచితి.
నఖ శిఖ పర్యంతము నఘసంగతి
నాథుని విడిచి యనాథగ నిలిచితి.”

“చిత్ర లేఖ! ఇది యెంత వింత ని
శ్చింత నుండు మిది యపరాధమ్మొ?
పాత్రవగుదువే క్షమా యాచనకు?
పరమ పవిత్ర మ్మైనది ప్రేమగు.

ప్రేమలోన త్యాగమ్ము విస్మృతియు
ప్రీతి తన్మయత నొప్పు చుండదే?
ప్రేమలోన నపరాధ ముండునే?
వెలది నీకొఱకు మన్నించితి నిక”

చరణమ్ములపై వ్రాలి తరుణి యనె
"కరుణ నన్ను నుగ్రహించు ధీరలు
చరణదాసిగా హృదయ వాసిగా
శాశ్వతముగ నను బరిగ్రహించుడి."

"విభవ శూన్యుడను బికారితెఱగై
విధి బానిస నై వెడలు నేను నీ
ప్రభుడనుగా మనగల్గు టుసంభవ
మభూతిమంతుని గోరునే పడతి?"

"నాథ! సేనతుల ధనరాసుల కధి
నాథను, నేనీదానను గావున
నాథుడ నీవెటు నిర్ధను డౌదువు
న్యాయమే యిటుల పల్కమీ" కనిన

"నీవు నాదాని వైన నయ్యెదవు
నీదినాది యెట్లగును? తలోదరి!
నేవిడిచితి నఖిలమ్ము శాశ్వత
త్వావికలమ్మున, మరి పొందుటకా?

వదులుటకే యాలోచన వలయును
ముదిత ధనము నామోదించుటయా?
ఇది పురుషుడ నగు నా కుచితమ్మా!
మది బలహీనుడగాను సుందరీ!

నేను బికారిని, నీవు బికారివి
యైన నేగ్రహించగ సిద్ధమ్మే
మానవతీధన మహితత వెలుగుట
మగవానికి దగునా ఇది దేవీ!"

లేచెవడిగ తచ్చిత్రలేఖయును
"లేమికోరెదను నేటినుండియే
దాచుకోక సర్వత్యాగమ్మున
తత్పరనై యనుగమింతు నేడే

ప్రేమనౌక పయనింత మిద్దఱము
విమల సమత్వ పరిస్ఫుట మూర్తుల”
నామె ముఖమ్మతి తేజోమయమ్మై
నామెకనుల జ్యోతులు వెలుగొందెను

దగ్గఱైరి కనుదమ్ములు కలిసెను
తడివికొనిరి యొకరొకరును మేనుల
సిగ్గు వొడమ నును బుగ్గలు కలిసెను
చెలిమికలిసె పెదవుల కతిమధురత

కౌగిలి మునిగిరి పరమానందత
కాంత నారబట్టలను ధరించెను
రాగిలి రిద్దఱుసకలత్యాగత
సాగిరి వనాంత సంచారమ్ముల.

## ఉప సంహారము

కథాకాలమును గడచియు వత్సర
కాలమయ్యె, రత్నాంబరు డంతటు
ప్రథిత శిష్యులను ప్రశ్నసేయగా
వలచి పలికె శ్వేతాంకుని గనుగొని

“వత్సా! నీకల్యాణోత్సవమున
బరిఢవిల్లితివి గృహస్థాశ్రమత
నుత్సాహమ్మనుజూపగలవె నీ
వొప్పుగ దెలిసిన సత్యము దెలుపగ

కుమారగిరి బీజగుప్తు లిద్దఱ
క్రమ పరిశీలన పాపి యెవ్వరో?”
నమత మస్తకుండై శ్వేతాంకుడు
“నా యెఱిగిన విషయంబు తెల్పెదను

గురుదేవా! దేవుడు సామంతుడు
పరమత్యాగనిధానమూర్తియగు
గురువిశాలహృదయుండుకోమల
స్ఫురదుత్తమగుణ గణమండితు డగు.

కుమారగిరి మూర్ఖుడు పశుతుల్యుడు
సమధిక స్వార్థ సిద్ధి ప్రియుడగు
యమనియ మాసన డంబశీలుడగు
విముఖుండగు జీవన బాధాగతి

బలహీనుడు దుర్బల చిత్తుండగు
లలిత గభీరాలాపవర్జితుడు
మలిను డాత డను మాటువినంగనె
పలికె గురుండు విశాల దేవుతో?

"విశాల దేవా! యోగ దీక్షతో
వెలసితి వీవును యోగిగ నేటికి
విశాలదృష్టిని బరికించినచో
వీరిద్దఱిలో బాపి యెవ్వ డగు?"

నతుడై పలికెను విశాలదేవుడు
"జితేంద్రియుండగు కుమారగిరి యు
న్నతుడు లోకమున, వశీభూత స
మ్మతమమత్వుడూర్జిత సత్వుండగు

పూర్ణుడు యోగియు, బీజగుప్తు డుప
భోగ విలాస విమోహచిత్తు డగు
నర్హోరాశ్యతి వేల వీచికా
త్యంత వాసనాదాసుం డాతడు.

పాపోద్ధత విశ్వాంతర్భాగుడు
పాపిబీజ గుప్తుం" డన గురుడును
"పాపము! మీరిద్దఱు భిన్నస్థితి
వఱలుట భేదించెను మీమతములు.

వెడలవచ్చు మీరలు మీవిద్యల
గడన పూర్తియైనది, విను డొక్కటి
వెడలు నెడల విను డంతిమ పాఠము
విని జీవితమున నను సంధించుడి

ప్రపంచమున బాపం బన గలదే?
ప్రతి మనుష్యు దృష్టిని వేరగు నది
ప్రపంచ మీ దృగ్విషమత పాప
వ్యవహారమ్మును గాంచు నీభువిని

ప్రతిమనుష్యుడొక విశేషచిత్త
ప్రవృత్తుడై యుత్పన్ను డయ్యెడిని
ప్రతివాడొక నటుడై యెసలారును
ప్రపంచ రంగస్థలమందున నిటు

మనః ప్రవృత్తిప్రేరితుడై త
న్మనోగతము వర్తించును మాటికి
మనుజున కిది జీవన మన బరగును
మనిషి చేయు దన గుణానుకూలత

తనకు దాను విభుడౌనె మనుష్యుడు
తాను పరిస్థితి నికర దాసుడగు
దనకు గలదె కర్తృత్వము? భువిసా
ధనమగు నతీంద్రియంబగు శక్తికి.

మనిషి మమత్వ ప్రధాను డయ్యెడు
మాటికి గోరెడు దాను సుఖమ్ముల
మనుజుల సుఖకేంద్రములు భిన్నములు
పనినెఱవేఱుటు గూడ భిన్నముల

ధనమున నొక్కడు మదిరను నొక్కడు
తరుణుల నొక్కం డొక డతి చారత
వినుత త్యాగము నందిం కొక్కడు
వెదకు సుఖము మరిపొందును దృష్టిగ

వీరిలోని సుఖ వాంఛ యొక్కటే
ధారుణి నెవ్వం డిచ్చా పద్ధతి
కోర డెవడు దుఃఖమ్మును, కలిగిన
దూరు నతడు విషమంబగు దృష్టిని

అందులకే ఈ ప్రపంచమందున
నెందు పాప పరిభాషలేదు గద!
ముందుగూడ గనబోము, మానవుడు
పుణ్యపాపముల జేయలే డెపుడు?

చేయవలసినది చేయు నంతియే
నాయభి ప్రాయ మగు నిది వినుడీ
మీయందిది భేదిల్లిన యెడల న
మేయత మిమ్ముల బాధ్యుల జేయను

పొందుమీరు సుఖముండుడు నాతో
ముం దెఱిగిన దానిని గమనించుడు
నిండుదనమ్ముల మెలగుడు భూమిని
నిస్తులాశీర్వచనముల నందుడు



రచన : ఆరంభము : 4-10-76
పూర్తి : 2-11-76
శుద్ధ ప్రతి : 10-2-78

కవితా సుధాకర, అవధాని శిరోమణి,
బ్రాహ్మీవిభూషణ, సారస్వత శిరోమణి
అవధాన కళాపూర్ణ
అష్టకాల నరసింహారామశర్మ M.A
అష్టావధాని,
అనంతసాగర్
మెదక్ (జిల్లా)
Tq: సిద్ధిపేట.



: రాజగోపాలపేట, మం. నంగునూరు, జి. మెదక్

: శ్రీ సరస్వతీక్షేత్రము, అనంతసాగర్, సిద్ధిపేట డివిజన్, మెదక్ జిల్లా -502 267.

: ఉన్నత పాఠశాల సిద్ధిపేట, శ్రీ విశ్వేశ్వర సంస్కృతాంధ్ర కళాశాల, వరంగల్, ఎం.ఏ. (ఉస్మానియా విశ్వవిద్యాలయం).

: ప్రథమ శ్రేణి తెలుగు పండితులు (Rtd.)

: అష్టావధానము, జ్యోతిష్యము, వాస్తు భూగర్భజల జ్ఞానము.

: మెదక్‌జిల్లా అనంతసాగర్ కొండలలో శ్రీ సరస్వతీ క్షేత్ర నిర్మాణం, శ్రీ సరస్వతీయజ్ఞ సేవాసమితి ద్వారా ప్రతి నెల యజ్ఞ నిర్వహణ.

: శిథిల విపంచి, శ్రీరామచంద్రిక, ఆత్మవేదం, రామప్రభు శతకం, అష్టకాల సత్యాలు, నికార దేవీ సహస్ర నామస్తోత్రం, దేవి పూజాకల్పము, సారస్వతీంభావయే, సరస్వతీపూజా, సరస్వతీ స్తోత్రము, పురుషోత్తముడు, వాసరేశ్వరీ శతకము, తుకారామస్వామి చరిత్రము.

: కవితాసుధాకర, అవధానిశిరోమణి, అవధాన కళాపూర్ణ, బ్రాహ్మీవిభూషణ, సారస్వత శిరోమణి, కవికేసరి, కవికోవిద.

: సరస్వతీ తత్వ ప్రచారం, దేవాలయ వాస్తు, ఆధ్యాత్మిక కార్యక్రమాలు, మూలికావైద్యము, జాతీయం సమైక్యతాదర్శం.